

గంగాదేవి: లేపాక్షిశిల్పం

—ఫొటో: యు. భానుమూర్తి, అనంతపురం]




# ప్రధానఘట్టముల ప్రచురణ

"ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని । యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతిశాస్త్రజ్ఞులు నీతిశాస్త్రంబని । కవివృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని । యైతిహాసికు లితిహాసమనియు,
పరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ । యంబని మహిఁగొనియాడుచుండ...."

★

ఆంధ్రమహాభారతము ఆంధ్రజాతికి పేరెన్నికఁదెచ్చిన కల్పవృక్షమై వెలుగుతున్నది. నన్నయ ఈ మహావృక్షోత్పత్తికి బీజారోపణచేశాడు; నవ్యాంధ్రభాషాకుసుమ సంపన్నమై, జాతీయతాఫలసిద్ధి కలిగేలాగు తిక్కన ఈ మహావృక్షాన్ని పెంపొందించాడు. ఎఱ్ఱన మిగిలిన దోహదక్రియలు సమకూర్చాడు.

ఈ మహాకల్పవృక్షావతరణకు కారకులైన కవిత్రయానికి అంజలి ఘటించి పాఠకులకు ఒక శుభవార్త అందజేస్తున్నాము !!

భారతమును మినహాయించితే తెలుగుజాతికి సాహిత్యముగాని, సంస్కృతిగాని లేదని చెబితే అతిశయోక్తికాదు.

కేవల శ్రుతపాండిత్యమాత్ర విలసితములయిన భిన్నభిన్నభావములు దేశమున వ్యాపించి అనంతమైన భావసంఘర్షణకు, తద్వారా మానసిక సంక్షోభములకు కారణములవుతున్నవి. ఆంధ్రమహాభారత ప్రతిపాదితము, బలవత్తరమూ అయిన జాతీయధర్మం ఈగడ్డ మీద నేడు లుప్తంకావటమే ఇందుకుకారణం. భారతపఠన ప్రచారములు తగ్గిపోవటమే ఈ జాతీయ ధర్మభ్రష్టతకు హేతువు.

ఇది ప్రజలకు తెలియనిదికాదు. అయినా భారతపఠనం మాత్రం విరివిగా సాగుట లేదు. జనబాహుళ్యానికి భారతప్రతులు అందుబాటులో లేకపోవటమే చాలావరకు కారణం.

★

ఈ విషయాన్ని గమనించి ఆంధ్రమహాభారతంలోని ప్రధానఘట్టాలను, యథాతథంగా సచిత్ర వారపత్రిక పాఠకులకు అందజేయాలని సంకల్పించాము **15-1-'58** తేదీ సంచిక మొదలు ఆయా ఉజ్వల ఘట్టాలప్రచురణ ప్రారంభమౌతుంది. పాఠకులు మా ఉద్యమానికి ఆహ్లాదించగలరనీ, ఈ అవకాశాన్ని అమూల్యమైనదిగా గుర్తించి, వినియోగించుకోగలరనీ ఆశించుతున్నాము.

—సంపాదకుడు

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 19
1-1-58

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి పుష్య, శుద్ధ ఏకాదశి బుధవారం


 విషయానుక్రమణిక 

ముఖచిత్రం :
రవిఫిలింస్ వారి 'కొండవీటిదొంగ' లో
**అంజలీదేవి.**

★

## ఉస్మానియా ఆంధ్రాభ్యుదయోత్సవాల సమీక్ష:

# విజేతలైన విద్యార్థుల ఉత్సాహ భంగం ★ బహుమతి ప్రదానం లేకుండానే ముగింపు

ఎప్పటికైనా ఆంధ్రాభ్యుదయోత్సవాల వంటివి సంగం విజయవంతం కావడానికి కారణం, ఉత్సవాలకు విజయం చేసే ప్రముఖ రాజకీయ నాయకులు. ఈ ప్రముఖ రాజకీయ నాయకులే కనక విజయం చేయక పోతే ఉత్సవాలు పూర్తిగా విజయవంతం కాతాయేమొ?

కవులు, రచయితలు, రాజకీయ నాయకులు తమచుట్టూ గోడలుకట్టుకొని కూచుంటే ప్రయోజనంలేదు. ఉన్నగోడలను పగుల గొట్టెయ్యాలి. ఆశేష ప్రజానీకంతో తాత్కాలికంగానైనా సాన్నిహిత్యం లభించినందుకు సంతోషించి కొన్ని ఘడియల కాలంవరకైనా ప్రజాహృదయాన్ని అర్థం చేసుకోడానికి దొరికిన అదను వినియోగించుకోవాలి. ఉత్సవాలకు ఉపన్యాసకులుగానో, అధ్యక్షులుగానో, ఆహ్వానితులుగానో వచ్చినప్పుడు, కేవలం కార్యక్రమ పత్రికలలో పేర్లను ముద్రించుకొనే వరకే వారి ఉత్సాహాన్ని పరిమితం చెయ్యకుండా, కార్యకర్తలు సహృదయతతో తమ కందిచ్చిన సదవకాశం ఉపయోగించుకోవాలి

ఒక కవిగాని కళాకారుడుగాని, ఉపన్యసిస్తేవిందామనీ, ప్రత్యక్షంగా పరిచయమైన ప్రముఖ రాజకీయ నేతల దివ్యదర్శనం చేసుకొందామనీ వేలకొలది ప్రేక్షకులు ఎదురుచూదుతారు. వీరిపాలిట వచ్చే ఆశాభంగా లకు అంతంలేదు. ఉపాహారాలు, పూల మాలలు వీరికిదొరకవు. గంటలతరబడి, నిలబడి శబ్దగ్రాహకయంత్రాలనుండి ప్రసారితమయ్యే అస్పష్టధ్వనులతో వీరు తృప్తిపడాల్సి వస్తుంది. ఓపికతో వేచివుండే ఈ ప్రేక్షకులకు జరిగే అన్యాయాలను ఏచట్టం గమనించదు; ఈ అన్యాయాలకు ఏ న్యాయస్థానం శిక్షవిధించదు. బహుశా ఇది మన దురదృష్టమేమో?

ఉస్మానియా కళాశాలల ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఈ సంవత్సరం పాల్గొన్న పెద్దలుగాక, చల్లపల్లి రాజా, బందా కనకలింగేశ్వరరావు, రావాడ సత్యనారాయణ,

### "ప్రవీణ్"

జమ్మలమడక మాధవరాయశర్మ, ఉస్మానియా ఉపాధ్యక్షులు సదాశివరెడ్డి ప్రభృతులు పాల్గొంటారని కార్యక్రమ పత్రిక (కార్యనిర్వాహకులు ఆశావాదులన్న సిద్ధాంతానికి నిదర్శనంగా) ప్రకటించింది. వీరు 'కారణాంతరాలవల్ల', 'అనివార్య కారణాలవల్ల' రాలేకపోయినారట. బహుమతి ప్రదానకార్యక్రమంతో ఆంధ్రాభ్యుదయోత్సవాలు 'ఖతం' కావలసింది. అప్పటి నుంచి విద్యార్థులు తమ చదువులను 'ఖురా' చేసేవారు. ముఖ్యమంత్రి బహుమతులను



కుమారి సుమతి నృత్యప్రదర్శనం

అందచేస్తారని కార్యక్రమపత్రిక అతిఉత్సాహంతో వెల్లడిచేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రప్రథమపౌరుడు స్వహస్తాలతో బహుమతు లందిస్తే, అందుకొందామని విజేతలైన విద్యార్థులు ఉవ్విళ్ళూరారు. ముఖ్యమంత్రి వచ్చారు! మరెందుకో వెళ్ళిపోయారు. అనివార్యకారణాలకు కొదువా? బహుమతి ప్రదాన కార్యక్రమం కాలనిర్ణయం లేకుండా వాయిదా పడింది. ఒక్కసారిగా విద్యార్థుల ఉత్సాహం అంతా 'ఖతం' అయిపోయింది!

ఇది చాలా విచారకరమైన విషయం. ఉత్సాహపరులైన విద్యార్థులు ఏ సంఘంలోనైనా ప్రధాన పాత్రధారులు. సంఘంలో అంతర్లీనంగా ఉన్న గుణదోషాలన్నీ విద్యార్థిసంఘంలో వెలికివస్తాయి. విద్యార్థి



ఆర్ట్సుకళాశాల 'సుడిగుండం'లో ఒక దృశ్యం



హైదరాబాదు స్త్రీల కళాశాల శాస్త్ర విభాగ రజతోత్సవం ఇటీవల జరిగింది. శ్రీ సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

## ★ ఆంధ్రాభ్యుదయోత్సవాల సమీక్ష ★

లపై ప్రభావాలు పరోక్షంగా సంఘంపై పడతాయి. విద్యార్థుల ఉత్సాహానికి ఎంత శక్తివుందో, నిరుత్సాహానికి కూడా అంతే శక్తివుంది. అనుభవజ్ఞులైన రాజకీయవేత్తలు ఈ విషయం గమనించలేకపోరు.

ఈ 'అక్సెంటేయుల్ని' మినహాయిస్తే—(మనం మినహాయించకేం చేస్తాం! వాళ్ళే మినహాయించుకొన్నారు–) కార్యక్రమాలు చక్కగానే సాగిపోయాయి డా॥ దివాకర్ల, వేదులపల్లి కృష్ణశాస్త్రి, డా॥ పుట్టపర్తి చక్కగా మాట్లాడారు వీరి ముగ్గురి ఉపన్యాసాలను వినే భాగ్యం భాగ్యనగరవాసులకి తరుచుగానే కలుగుతూ వుంటుంది. ప్రత్యేకంగా పేర్కొనదగిన ఉపన్యాసం డా॥ కొత్తపల్లి వీరభద్రరావుది. డా॥ కొత్తపల్లి ఆంధ్రసారస్వతంపై ఆంగ్ల సాహిత్య ప్రభావాన్ని గురించి పరిశోధన చేసినవారు; పరిశోధనఫలితంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పట్టాన్ని పొందినవారు సంగీత, సాహిత్య, శిల్ప, చిత్రలేఖనాది లలిత కళలనుగురించిన వీరి ప్రసంగం, ప్రేక్షకుల మన్ననల నందుకొంది. వివారు వేల నుండి ప్రేక్షకులు సంస్కృత ఆంధ్ర ఆంగ్ల కావ్యాలనుండి ఉదాహరణలతో నిండి ఉన్న వీరి ఉపన్యాసాన్ని నిశ్శబ్దంగా విన్నారు

వ్యక్తులకు సాంస్కృతికోపన్యాసాలంటే అభిమానముండటం సహజమే! కాని సమూహాలకు వినోద కార్యక్రమాలపై గల మమకారం విజ్ఞానప్రదాయకమైన ఉపన్యాసాలపై ఉండదు. విద్యార్థి 'విద్యార్థి' కావచ్చు కాని, విద్యార్థుల సమూహం మాత్రం 'విజ్ఞానార్థి సమూహం' కాకపోవచ్చు డా పుట్టపర్తి అధ్యక్షతన జరిగిన సమావేశంలో కొందరు 'వెనుకపడిన' ప్రేక్షకులు కొంత కల్లోలం కలుగచేశారు. డా॥ పుట్టపర్తి ఉపన్యాసాలు సాధారణంగా వ్యంగ్యపూరితాలు. విద్యార్థుల నుద్దేశించి వారు ఆనాడు చేసిన ప్రసంగం, వెనుకపడిన విద్యార్థులను కూడా గిలిగింతలు పెట్టింది.



ఎం. చిత్తరంజన్

### సభాస్థలి దృశ్యం

డిసెంబరు పదమూడవ తేది శుక్రవారం సాయంకాలం ప్రారంభమయ్యాయి ఈ అభ్యుదయోత్సవాలు. రంగస్థలం : నిజాం కళాశాల ఆవరణం ప్రత్యేకంగా నిర్మించబడిన రంగస్థల వేదిక వేదికకి ఎదురుగా వేలకొలది ప్రేక్షకులు కూచొని ప్రదర్శనలు చూడడానికి అనుకూలంగా షామియానా, షామియానా క్రింద కుర్చీల వరుసలు; రంగస్థల వేదికకు ఒకపక్కనున్న ప్రవేశద్వారం వద్ద అతిథులను, సదస్యులను ఆహ్వానిస్తూన్న ప్రసాదరావు, రఘురామరావు, నారాయణరెడ్డి ప్రభృతులు, కార్యదర్శులు, కార్యనిర్వాహకవర్గ సభ్యులు కార్యక్రమప్రారంభంకోసం వేచివున్న ప్రేక్షకులు ప్రేక్షకులచుట్టూ దూరదూరంగా నిలబడి,

హృద్యంగనేపాడకే మునకు చెందిన విద్యార్థినీ, విద్యార్థులు. ఇది డిసెంబరు 18 వ తేది శుక్రవారం సాయంత్రం సంధ్యాసమయంలో ఆంధ్రాభ్యుదయోత్సవ కార్యక్రమాలలో ఒక దృశ్యం; ప్రథమ దృశ్యం.

శుక్రవారం రాత్రి కార్యక్రమాలలో ప్రత్యేకంగా చెప్పుకోదగింది కుమారి సుమతి నృత్య ప్రదర్శనం. ఉస్మానియా మహిళా కళాశాల విద్యార్థినిగా కార్యక్రమాలలో పాల్గొన్న ఈమె నటరాజ రామకృష్ణ శిష్యురాలు; శ్రీ శ్రీ డా॥ కృష్ణారావు కుమార్తె. ఆంధ్రదేశపు నాట్య సంప్రదాయాలను ప్రదర్శిస్తూ గవర్నరు త్రివేది సమక్షంలో మూడుమార్లు నృత్యం చేసింది. గవర్నరు దంపతుల మన్ననల నందింది. ఈ సంవత్సరం ఉస్మానియా విశ్వవిద్యాలయం పక్షాన భారత యువజనోత్సవాలలో పాల్గొని, ప్రథమ బహుమతినంది రాష్ట్రపతి ఆశీస్సుల నందుకొంది. ఆంధ్రాభ్యుదయోత్సవాలలో దశావతారములలో కొన్నింటికి 'మధురా నగరిలో' 'మా వల్ల కాదమ్మ' వంటి పాటలకి నృత్యకల్పనచేసి ప్రేక్షకుల ప్రశంసల నందుకొన్నది.

కుమారి కౌశాంబి రాజకుమారి ఆదివారం నాటిరాత్రి కూచిపూడి నాట్య ప్రదర్శన మిచ్చింది. ఆంధ్రు డనిపించుకొన్నవాడికి కూచిపూడి విశిష్టత తెలిసుండాలి. ఆంధ్రేతరులకంటే మనకే కూచిపూడి సాంప్రదాయాలను అవగాహనచేసికొనే శక్తి ఎక్కువుండాలి. కాని ఎన్నింటిలో మనం మన ఆంధ్రత్వాన్ని నిలబెట్టుకొంటున్నాం? తెలుగువారికి తెనుగుతనాన్ని హృదయంగమమైన శైలిలో బోధించింది కుమారి రాజకుమారి.

## "వెన్నెలవాడ"

సోమవారం రాత్రి శ్రీ సి. నారాయణరెడ్డి రచించిన 'వెన్నెలవాడ' నృత్య నాటిక ప్రదర్శించారు. నృత్యనాటికలో నృత్యమెన్ని పాళ్ళు? నాటికఎన్ని?—ఈ విషయం ఇక్కడ అప్రస్తుతం. 'వెన్నెలవాడ'ను మధురమైన శైలిలో రచించారు శ్రీనారాయణరెడ్డి. దానికి మధురాతి మధురమైన సంగీతాన్ని చేకూర్చారు శ్రీ పాలగుమ్మి విశ్వనాథం, శ్రీ మహాభాష్యం చిత్తరంజన్ సహాయంతో. ఒక మదరాసు పత్రిక జరిపిన దేశభక్తి గాయకులపోటీలో ప్రథమ స్థానమును గెలుచుకొన్నవాడు చిత్తరంజన్ అతనివాణి తేనె లొలికించింది 'వెన్నెలవాడ'లో. ఉత్తమ నృత్య నాటక ప్రదర్శనంలో ప్రేక్షకులు నేత భక్తిగాన మాధుర్యాన్ని అవ్యక్తంగానే అనుభవిస్తారు. వెన్నెలవాడలో కవితా మాధుర్యాన్ని, గాన మాధుర్యాన్ని అనుభవించడానికి పూర్తిగా అవకాశం చిక్కింది. నృత్యంలో రసోత్పత్తికి



కుమారి కౌశాంబి రాజకుమారి

సాధనాలన్నీ ఉన్నా, రసం లోపించింది. నృత్యం సామాన్యమైన కళ గాదు. నిర్వాహకులు మరికొంతకాలం ఈ ప్రదర్శనపై వెచ్చించి ఉండవలసింది. నాటికలో పాత్రధారులమధ్య పొందిక కుదరలేదు. కలువలకు, కలువలరాణికి మధ్య, నాటిక చివరి భాగంలో తప్పిస్తే భేదం కనపడదు. చంద్ర పాత్రధారిణి కుమారి విజయకుమారిలో నృత్యానికి అనువైన శరీరచలనం కనపడింది. కలువలలో ఒకతె కుమారి ప్రేమకుమారి కూడా భరతనాట్యంతో ఆమెకి పరిచయం కలదని నిరూపించింది. మిగిలిన కలువలు (కుమారి వై. మాయ; కుమారి జె. లక్ష్మి; కుమారి వి. లలిత); కలువలరాణి (కుమారి ఎస్. లలిత) - అందరూ ఒక్కొక్కరూ చక్కగానే చేసినా, సమన్వయం లోపించడంవల్ల సమిష్టిగా చేసిన ప్రదర్శనం వ్యర్థమైంది. చంద్రుడుగా చిత్తరంజన్, కలువలగా, కలువల రాణిగా కుమారికలు లలిత, సౌభాగ్యం, అనసూయ నేపథ్యగానం చేశారు.

ఈ నృత్యాలు, నృత్యనాటికలు కాక పన్నెండు కళాశాలల విద్యార్థులు పన్నెండు ఏకాంకనాటికలు ప్రదర్శించారు. ఇవిగాక గీతావళి కార్యక్రమాలవంటివి ఉన్నాయి.

ఈ పన్నెండు నాటకాల గుణదోషాలను చర్చించడానికి అవకాశంలేదు ఇక్కడ. ప్రత్యూష, ధర్మపథం—ఈ రెండు విద్యార్థులు రచించిన నాటికలు. ప్రత్యూష ప్రథమబహుమతి నందుకొన్నది. ధర్మపథం నాటకం రచయిత శ్రీ పార్థసారథి శ్రీ ఆనందమోహన్ నటీనట వర్గంలో అఖిల కళాశాలలకు ప్రథమ బహుమతి నందుకొన్నారు. ఈ రెండు నాటకాలను గురించి పరోక్షంగా ప్రస్తావిస్తాను. అలా ప్రస్తావించే ముందు ఒక చిన్న ఉపోద్ఘాతం.

## పాత్రధారి బాధ్యత

నాటకంలో రసోత్పత్తి కలగాలంటే పాత్రధారి తన పాత్రలో కొంతవరకే లీనం కావాలని పెద్ద లన్నారు. పాత్రధారి పూర్తిగా తన్మయుడైతే, అది నటన కుండవలసిన ప్రాథమికలక్షణాలను కోల్పోతుంది. అతడు పూర్తిగా పాత్రకు వెలుపలఉండి నటిస్తే నటన యాంత్రికం అయిపోతుంది. ప్రేక్షకులకుభరింపరానిదిగాతయారౌతుంది. ఇది కేవలం నటీనటుల విషయం. మరి ప్రేక్షకుల విషయమో? ప్రేక్షకులు పూర్తిగా తన్మయులై, నాటకప్రదర్శనం యదార్థమేమో అని భావించేటట్టు నాటకం ఉండాలన్నది ఒక సిద్ధాంతం. అదిఅంతా ఉండడం మంచిది కాదని, ప్రదర్శనాకాలంలో ప్రతీ ఒక్క క్షణం తాము నాటకాన్ని చూస్తున్నామని ప్రేక్షకులు గుర్తించేటట్టు చేయాలన్నది రెండవది. మనం నాకు తెలుసున్నంతవరకు మొదటి సిద్ధాంతాన్ని అంగీకరించిన వాళ్ళం. ప్రచార నాటకాలను మినహాయిస్తే, రెండవరకపు నాటకాలు రాణించవని మన విశ్వాసం. ఈ రెండు సిద్ధాంతాలలోని పరస్పర వైరుధ్యాన్ని గమనించకుండానే, సమకాలీన ఆంధ్ర రచయితలు—ప్రఖ్యాతి గన్నవారు. కూడా— నాటక రంగాన్ని నాశనంచేయడానికి పూనుకొంటున్నారు.

ప్రత్యూష నాటికలో రచయిత డాక్టరు పాత్ర ధరించారు. డాక్టరు అనుచరులతో, సహచరులతో పదేళ్ళనాటి ఒక గాథ చెప్పబోతుంటాడు. ఇతివృత్తం ప్రచారసంబంధమైనది. పదేళ్ళనాటిగాథను ప్రదర్శించడంకోసం ఫ్లాష్ బేక్ పద్ధతి ఉపయోగించారు. యాంత్రిక సంబంధమైన ఏర్పాట్లన్నీ చక్కగా నేలోపం లేకుండానే సాగిపోయాయి. రచయిత విద్యార్థి కావడంవల్ల అతనికి రెండు ప్రశ్నలు వేస్తాను. నాటకం యథార్థమేమో నని భ్రమపడి, నాటిక అందించదలచుకొన్న

(49 వ పేజీ చూడండి)

# కళ్లెం జారిన గుఱ్ఱం

[illegible]మూర్తి రామారావు

సూర్యాస్తమయమయి చీకటి పడుతూంది. రమణారావు రోజూలాగున స్నేహితులవద్దకో, షికారుగా తిరిగి రావడానికో సాయంకాలం వెళ్లలేదు. ఇంటి ముందున్న ఆవరణలోనే యింతసేపూ పచారుచేసి, వరండాలో లైటువేసి, పడక కుర్చీలో వాలి పత్రిక అందుకున్నాడు. పక్కనే చిన్నబల్లమీద వారపత్రికలూ, కథల పత్రికలూ మూడు నాలుగున్నాయి. ఏదో ఓ పత్రిక అందుకున్నాడేగాని, ఏమంత ఆసక్తితో చదువుతున్నట్టు లేదు. ప్రొద్దున్నే, ఆఫీసు పనిమీద వెళ్లకముందే, ప్రధానవార్తలూ, శీర్షికలూ దినపత్రికలో చూడడం, రాత్రి తీరుబడిగా మిగతా వార్తలూ, వ్యాసాలూ, విశేషా వారపత్రికలూ చదవడం, అతనికిన్నీ చాలామంది వలెనే అలవాటు.

ఇవాళ సాయంకాలం వాహ్యాళికి వెళ్ళకుండా అతను యింట్లోనే వుండడానికి కారణం- అతనిభార్య, శారద, పేరంటాలకి వెళ్లడం. ఇంట్లో అతనూ, భార్యాతప్ప పెద్దవాళ్లింకెవరూ లేరు. "నేనొచ్చేవరకూ పనిమనిషిని వుండమన్నాను; పిల్లలను చూస్తూంటుంది లెండి. లోపల గదితాళం వేసుకుని కాస్త అలా తిరిగిరండి"అని శారద చెప్పే వెళ్ళింది. కాని, తప్పనిసరి అయితే తప్ప, యింట్లో తమ యిద్దరిలో ఒకరైనా లేకుండా పిల్లల్ని విడిచివెళ్ళటం అతని కంత మనస్కరించదు. అందుచేత పచారుచేస్తూ యింట్లోనే వుండిపోయాడు.

శారద అయిదుగంటలు కాకుండానే బయలుదేరింది. ఇప్పుడు ఏడుగంటలు దాటుతూంది. పసుపూకుంకానికి వెళ్లి అక్కడినుంచి ఆలస్యంకాకపోతే, క్రిందటివారం కూడా వెళ్ళలేదు గనుక, ఒక్కక్షణం మహిళాసమాజానికి కూడా వెళ్ళివస్తానంది. పిల్లలందరికీ చాక్లేటుబిళ్ళలు ఇచ్చి, అల్లరి చేయవద్దని చెప్పి, 'జాగ్రత్తగా ఆడించవే' అని పనిమనిషిని హెచ్చరించే వెళ్ళింది. పిల్లలు ముగ్గురూ కూడా ఓగంటసేపు సరదాగానే ఆడుకున్నారు. కాని, సంజవేళ అయింది మొదలు "అమ్మేదీ?" అంటూ ఆరంభించారు. "ఇప్పుడే వచ్చేస్తుంది; బిళ్ళలిచ్చి వెళ్ళిందికాదూమరి, ఆడుకోండి" అంటూ సముదాయిందాడే కాని ప్రతి అయిదునిమిషాలకూ "అమ్మేది" అనే ఆలాపన మానారుకాదు! ఇప్పుడే, కాస్తసేపయి పనిమనిషి చెబుతున్న కబుర్లో కథలో వింటూ పెరటి వసారాలో చాపమీద కూర్చున్నారు.

రమణారావుకూ ఏమిటో యింట్లో వెలితిగానే అనిపించింది. దృష్టి అట్టే నిలవకుండానే పత్రికలో వార్తలు అక్కడా, అక్కడా చదవసాగాడు. "......బస్తీలో రిక్షాప్రమాదం" అన్న చిన్న శీర్షిక చూచి ఘుతుక్కుమన్నాడు. ఏదో ఆందోళనతో చదవసాగేడు. వేగంగా వెళుతూన్న లారీ ఒక్కసారిగా పక్కవీధిలోకి మలుపుతిరిగిందనీ, పక్కనుండివస్తున్న రిక్షాను లారీ వెనుకభాగం తగిలిందనీ, రిక్షా బాగా దెబ్బతిన్నదనీ వుంది. అందులోని స్త్రీకి తీవ్రమైన గాయాలు తగిలినవి; ఆసుపత్రిలో చేర్చబడినది. దైవవశాత్తు ఆ స్త్రీ ఒడిలోని బిడ్డకు అపాయమేమీ కలగలేదు; రిక్షావానికి కూడా పెద్దగాయాలేమీ కలగలేదు: ఇదీ వార్తా సంగ్రహం. శారదకూడా యిందాక రిక్షామీదే వెళ్ళింది. కొంపతీసి తోవలో మరేం చిక్కురాలేదుకదా! గదిలో వాచీవేపు చూశాడు. ఏడుంపావయింది. ఎప్పుడు వెళ్ళినా చీకటిపడకుండా వచ్చేస్తూండేదే; ఎందుచేత చెప్మా యింత ఆలస్యం? పేరంటంనుంచి మహిళాసమాజానికి కూడా వెళ్లిందేమో? అయినా, ఈ పేరంటాల పిలుపులు కూడా కొంచెం హద్దులో వుండాలి! వీరున్న పేటకీ వారున్న పేట మైలున్నర దూరంవుంది. దగ్గర బంధువులో, మరీ అంత సన్నిహితులో అవుతే తప్ప, యిలాంటి పిలుపులు ఏ పేట కాపేట వరకే సరిపుచ్చుకోరాదూ? ప్రతి చిన్న కార్యానికీ వూరందరినీ పిలవడమేమిటి? అయినా ఇరవై పాతికేళ్ళ క్రితంవలె కాక ఇప్పుడు ఊళ్ళన్నీ మహా పెరిగిపోయాయి; ఇప్పుడు ప్రతీపేటా ఒక బస్తీఅంత పెరిగింది. అందులోనూ ఈ కార్లూ, లారీలూ మరీ విపరీతంగా పెరిగిపోయాయి. తన చిన్నప్పుడు వూరంతటికీ నాలుగు కార్లుండేవో లేదో; ఇప్పుడో? ఏ వీధిని చూచినా కార్లే! ఇక రద్దీచూస్తే రోడ్లమీద నడవడమంటేనే జంకుగా వుంటుంది. పోనీ, ఈ రద్దీకీ, కార్లకీ సరిపోయేటట్టు రోడ్లేమైనా విశాలము చేశారా అంటే అదీలేదు. ఊళ్లు పెరగటమే కాని, పెరుగుతూన్న పట్నాలకు తగిన మార్పులూ, సదుపాయాలూ ఏమీ పెరగడం లేదు. అందులో మన ఆంధ్రదేశపు పట్టణాలు మరీ అర్ధ్వాన్నం, ఈ విషయంలో. అట్టే, ఏదో సందడిచేస్తూ సంతృప్తిపడడమే కాని పౌరసౌకర్యాలూ, బాధ్యతలూ నిదానంగా ఏమీ పట్టించుకోరు మన తెలుగువాళ్లు! రాక్షసుల్లాంటి లారీలేమిటి ఊరిమధ్యనుంచి? తానెన్నిసార్లు చూడలేదు, మంచి రద్దీగావున్న యిరుకు రోడ్లలో కూడా లారీలను కాస్త దుడుకుగానే పోనివ్వడం? ఆ మధ్య యిలాగే, చీకటిపడే వేళప్పుడు, నాలుగుమూరలు పైకివచ్చిన యినపకడ్డీలతో లారీ పోతూ, ఆ కడ్డీలుతగిలి సైకిలు ప్రమాదం జరగలేదూ? గొయ్యలూ, కడ్డీలూ అలా విస్తరించి వున్నప్పుడు, ఎఱ్ఱ దీపాలు పెట్టి, మరీ జాగ్రత్తతీసుకొని మెల్లగానే నా పోనివ్వాలి. ప్రమాదం జరిగితే ఓ ఘడియ 'అరెరె' అనుకోవడం, ముందు జాగ్రత్తవహించి నిదానంగా కట్టుదిట్టంగా ఏమీ ఆలోచనచేయకపోవడం మనకి పరిపాటయిపోయింది! ప్రమాదాలనుంచి పౌరబాధ్యతలవరకూ రమణారావు మనసు పరిపరి విధాలుగా పోసాగింది!

గడియారం ఏడున్నరగంట కొట్టింది; ఇదేమిటి, శారద యింకారాలేదు? రమణారావుకు ఆందోళన హెచ్చింది. తోవలో ఏ లారీకానీ?......ఛ,ఛ...అటువంటిదేదీ జరగనివ్వకు భగవంతుడా అని అప్రయత్నంగానే అనుకోసాగాడు. "అమ్మెప్పుడొస్తుంది"అని అతని రెండోబిడ్డ, చిట్టితల్లి, పనిమనిషిని అడగడం లోపలినుంచి వినిపించింది. అతనికి పిల్లలమీద జాలీ, శారదపై కొంచెం కోపం ఒక్కసారే కలిగాయి. లోపలికి వెళ్లాడు; చిన్నవాడు, అయిదేళ్లవాడు, నిద్రపోతున్నాడు, పెద్దవాడూ, చిట్టితల్లీ ఆవులిస్తూ పడుకోబోతున్నారు. "అమ్మయిప్పుడే

వచ్చేస్తుంది; నే వన్నం పెట్టేదాకా పడండి, కొంచెం భోజనంచేసి పడుకుందురుగాని" అని పిల్లలను బుజ్జగిస్తూ, "ఏమే, చిన్నబాబు ఏమైనా ఏడ్చుతున్నాడా?" అని పనిమనిషిని అడిగాడు.

"పాలుతాగి పడుకున్నాడు బాబూ" అంది.

పనిమనిషిని వీధివసారాలో వుండమని, కబుర్లు చెబుతూ, పిల్లలిద్దరిచేతా ఎలాగో యింత తినిపించేశాడు. "అమ్మవచ్చేవరకూ మేలుకునే వుంటాం" అంటూనే యిద్దరూ క్షణంలో నిద్రపోయారు. నిద్రలోనే పసివాడు "అప్పచ్చులు తెచ్చావా, అమ్మా" అంటున్నాడు. నిద్రలోకూడా అమ్మనే తలపెడుతున్న పిల్లలస్థితిని చూచేటప్పటికి, రమణారావుకి ధైర్యం పూర్తిగాపోయింది.

పనిమనిషిని పిల్లలవద్ద వుండమని, తిరిగి వెళ్లి వీధివసారాలో కూర్చున్నాడు. మనసును కుదుటపరచే ప్రయత్నంతో తిరిగి పత్రిక తీశాడేకాని చదవడానికి ఏమీబుద్ధి కాలేదు.

అంతకంతకూ ఆత్రుత హెచ్చయింది. పోనీ ఊళ్ళోకి వెళ్ళి కనుక్కుందామా అనుకున్నాడు; కాని ఎక్కడికి వెళ్ళడం?... ఆసుపత్రివేపు?...భార్యామాత్రంగా ఆ వూహ తట్టేసరికి నాలిక కొరుక్కున్నాడు. భగవంతుడు మేలుచేసి, తప్పకుండా వచ్చేస్తుంది. అయినా, ఏదేనా ప్రమాదం సంభవిస్తే?...... పిల్లలతో ఈ సంసారం తానొక్కడూ సాగించగలడా? అసలే, బొత్తిగా తల్లిచాటు పిల్లలు; ఒక్కఘడియ తల్లి పెరట్లోకి వెళ్ళినా, కనిపించకపోయినా గిలగిలలాడుతారు; అందులో చీకటిపడ్డాక మరీను. అంతా, పదకొండేళ్ళొచ్చిన పెద్దబాబుతోసహా, అమ్మ దగ్గరుంటేకాని పడుకోరు. శారద తినిపించినట్టు తను తినిపించగలడా? ఈ కాస్తసేపు శారద లేకపోతేనే యిల్లింత వెలవెలా పోతున్నదికదా, శారద లేకుండా అసలు సంసారం నడవడం సాధ్యమా? పోనీ, పిల్లల్ని అక్కయ్యకేనా ఎవరికేనా అప్పజెప్పినా, శారద లేకుండా తను మాత్రం...ఆ వూహ తట్టేసరికి రమణారావు వొళ్లు చెమటపట్టేసింది. ఏమిటీ అర్థంపర్థంలేని వూహాలని విసుక్కున్నాడు. కాని ఆత్రుతవల్ల కలిగిన భయంనుంచి, అట్లాంటి వూహలన్నీ కలతపెట్టడం మానలేదు.

శారద లేని తన జీవితానికి అర్థంకాని, లక్ష్యంకాని ఏమీ వుండదనిపించింది. ఈ పదహారేళ్ళ కాపురంలోనూ 'శారదలేని తను' అనే యోచన ఒక్కసారీ కలగలేదు. అటువంటిది ఎంత సంభవదూరమైనా బొత్తిగా అసాధ్యవిషయముకాదని చూచాయగానైనా ఒక్కసారీ తట్టలేదు. అతనికి స్పష్టంగా తెలియరాకుండానే శారద అతని జీవితంలో అతిసన్నిహితంగా, ఒక్కటిగా కలిసిపోయిన అంతర్భాగమయింది.



"ప్రాంగణాన రంగవల్లి
తీర్చిదిద్దు తెలుగుతల్లి!"
చిత్రకారుడు: జి. రామమోహన్-సికింద్రాబాదు.

ఇన్నాళ్ళూ అంతగా తెలిసిరాని ఈ సత్యస్వరూపం తటాలున గోచరించేసరికి అతనికి విపరీతమైన ఆతృతతోపాటు చాలా ఆశ్చర్యం కూడా కలిగింది.

దైవమలా అన్యాయం చెయ్యకూడదు; కాని దురదృష్టవశాత్తు ఏదేనా విపత్తు సంభవిస్తే...ఏం చెయ్యడం? తండ్రిలేని లోటు కన్న, ఎదుగుతూన్న పిల్లలకు ముఖ్యంగా తల్లిలేని లోపం అసలే భరించశక్యం కాదు. పదహారు పదిహేడేళ్ళు కాపురం చేసిన తరువాత భర్తకైనా భార్యలేని లోపం ఎంత మాత్రం తీరేదికాదు; మరోభార్యను చేసుకున్నా...ఇలాగుంటుందా?...ఛ ఛ ఏమిటీ అసందర్భపు ఆలోచన అని అసహ్యించుకున్నాడు...కాని తీరా ఏదేనా ప్రమాదం సంభవిస్తే?...తలపెట్టకుండానే అతని మనసులో మరోభార్యతో సంసారం ఎలా [illegible] గలదో అనే విషయమై ఛాయామాత్రంగా [illegible] ఊహాలల్లాడసాగాయి. కొత్త [illegible] సంబంధాలు రెండుమూడు అస్పష్టంగా మనసులో మసలినా, ఫలానా అమ్మాయి అనిమటకూ ఎవరినీ శారదస్థానంలో ఊహించడం అసాధ్యమనిపించింది. శారదస్థానం తన జీవితంలో మరెవరు కాని ఆక్రమించడం దుస్సాధ్యం అని అతనికి గట్టిగా తట్టింది. తిరిగి కొంచెం ఆశ్చర్యము కలిగింది. కాని ఈ దరిద్రపు వూహ లేమిటికి?...ఓయి భగవంతుడా, యిలాటిముప్పు తెచ్చిపెట్టకు అని

# ★ కళ్ళెం జారిన గుఱ్ఱం ★

మనసులో ప్రార్థించాడు.

రమణారావు అంత దైవభక్తి గలవాడూ అని చెప్పలేం; నాస్తికుడూ కాదు. శారద ఎప్పుడైనా దేవాలయానికి వెడదాం అంటే వెళ్లడం, ఇంట్లో సంప్రదాయంగా చేసే పర్వాలూ, పూజలూ వంటి వాట్లో యాదాలాపముగా పాల్గొనడమూ చేసేవాడే కాని మరీ అంత భక్తిశ్రద్ధలు కాని, అనుదినమూ నియమానుసారంగా జపాలూ, ప్రార్థనలూ చెయ్యడానికి గాని అలవాటు పడలేదు. అంత అవసరంకూడా కలగలేదు. సామాన్యమైన ఒడుదుడుకులు మినహా యింతవరకూ కుటుంబ క్షేమం, శాంతి, వ్యక్తిగతంగాకూడా, సుమారుగా అంతా ఏదో సాఫీగానే గడిచిపోతూ వచ్చింది. ఇదా కేమిటి గ్రహచారం, హఠాత్తుగా ఈ విపరీతమైన ఆందోళనా, ఆలోచనలున్నూ! తనకి నలభై రెండో ఏడు వెళ్ళినే వచ్చింది; వయసు ముదురుతూం దేమిటి చెప్మా! నలభైఏళ్లు దాటేటప్పటికి నరాల పటుత్వంతగ్గి యిటువంటి ఆందోళనా, జంకూ హెచ్చవుతాయి కాబోలు! పిల్లలంతా బాగా ఎదిగేవరకూ అయినా భార్యాభర్తలకు ఏ విధాన్నికాని ఎడబాటు కలగడం చాలా అన్యాయం, అసహజం, అధర్మం...ఏమిటేమిటో అస్పష్టంగా అనుకోసాగేడు దైవాన్నీ, విధినీ ఉద్దేశించి.

ఒక్కసారి మొదటి కాపురం రోజుల మధురస్మృతులు జ్ఞాపకం వచ్చాయి. శారద కప్పుడు పదిహేనేళ్ళు; తనకి యిరవై అయిదు. వివాహానికి పూర్వం శారదను తా నెరగడు. పైవూళ్ళో, దూరప్రాంతంలో చిన్న ఉద్యోగం; జీతంకూడా యిప్పటికంటే బాగా తక్కువే. కాని, ఏ యిబ్బందులున్నా సర్దుకుని ఎంత బాగా సంసారం దిద్దుకుంటూ వచ్చింది! అప్పుడు యింకా చిన్నగా, నాజూగ్గా వుండేది. ఇప్పుడు పిల్లలు కలిగాక కొంచెం వొళ్లువచ్చింది. కాని ఎప్పుడూ ఒక్కరీతిగానే నవ్వు ముఖంలో మంచి కళగా వుంటుంది. తనకి తెలియకుండానే, ఎప్పటినుంచి చెప్మా తన వంతగా పెనవేసుకొన్న ఆత్మీయురాలూ, సన్నిహితురాలూ అయిపోయినది! చాలా విస్మయపడ్డాడు.' అయితే, తానుకూడా శారదయందు అమిత అనురాగమూ, సౌమ్యతా కలిగే వుంటూ వచ్చాడన్న సంగతిమాత్రం అతనికి స్ఫురించలేదు; ఆమె నిర్వహిస్తున్న బాధ్యతలూ, చూపే ఓపికా, చేసే సంరక్షణా తాను యిన్నాళ్ళూ సరిగ్గా గుర్తించాడూ! అని మాత్రమే తట్టింది. ఈ వూహ తట్టేసరికి, యింత ఆందోళనలోనూ, అతని హృదయం ఏదో కృతజ్ఞతాపూర్వకమైన మధుర వేదనతో నిండిపోయింది.

వారానికోసారి పట్లూ అవీ దులిపించి ఎంత బాగా యిల్లు సర్దుతుంది! వంటిల్లూ, నట్టిల్లూ అద్దంలా వుంచుతుంది. ఎటొచ్చీ ఆమె బట్టలబీరువా మటుకూ వొట్టి అడివిలా వుంచుతుంది. ఎప్పుడైనా తానే సర్దేవాడు కూడాను. సర్దుతూన్నప్పుడు ఏచీరమడతలోనూ పదిరూపాయలనోటూ, మరో మడతలో వాళ్ళిద్దరిఫొటో, మరోదాంట్లో ఏవో పాతవుత్తరాలు, లేకపోతే పద్య పుస్తకం, యిలా ఏమిటేమిటో కనిపించడం మామూలే! చీరెమార్చి కట్టుకునేటప్పుడు విప్పినచీరె దండెన్ని పెట్టడం ఒకటి, సాధారణంగా మరిచిపోతూంటుంది! అట్లాంటివి సంభవించినప్పుడు వుండబట్టలేక రెండు మూడుసార్లు చివాట్లు పెట్టేసట్లు కఠినంగా మాట్లాడుకూడాను. పాపం, తననీ,పిల్లలినీ కనుక్కోవడంలో మునిగి ఆమె స్వంత విషయంలో అశ్రద్ధ చేస్తూంటూందేమో! ఇవన్నీ గుర్తించకుండా తాను చిరాకు పడడం ఎంతపొరపాటు! ఎక్కడివస్తువ అక్కడ నీటుగా వుంచాలని చెప్పడమే కాని, తాను మటుకూ మేజాబల్లమీదా, సొరుగుల్లోనూ, పుస్తకాలూ, పత్రికలూ, కాగితాలూ, పెన్సిళ్లూ చిందరవందరగా వుంచడం లేదూ! ఫౌంటెన్ పెన్నో, రిస్టువాచీనో కనపడక అందర్నీ చీదరించుకొని నానా హంగామా చేసేటప్పుడు, ఎన్నిసార్లు శారద ఏ పుస్తకం మరుగునుంచో, ఏ సొరుగు మూలనుంచో వెతికి నెమ్మదిగా తనకిచ్చేదికాదు. కాని ఎప్పుడైనా తనవలె విసుక్కుందా? ఆమె తనయందు చూపే నిర్మల విశ్వాసానికీ, సౌహార్దానికీ, తగిన ఆదరణా, అభిమానమూ తాను చూపుతూ వచ్చాడా? ఇకముందెప్పుడూ, ఏమయినా సరే, ఆమెమీద చిరాకు పడకూడదనీ, యింకా బాగా కనుక్కోవాలనీ నిశ్చయం చేసుకున్నాడు, రమణారావు.

పైవూళ్ళో వుంటున్నప్పుడు తానొకసారి సుస్తీపడటం గుర్తు కొచ్చింది. మరీ అంత హెచ్చుజ్వరం ఏమీకాదు, కాని వారం రోజులు పక్కమీదే వున్నాడు. జ్వరం వదిలి తానింకా నీరసంగా వున్నప్పుడు, ప్రక్కనే కూర్చున్న శారద చేతులు పట్టుకుని "రాత్రిళ్ళుకూడా నువ్వు నిద్ర పోవడం లేదు. యిలా అయితే బడలిక చేస్తుంది. పాపం, నీకు తీరిక వుండడం లేదు. ఓసారి మీ స్నేహితుల దగ్గరికో, సమాజానికో వెళ్లి రాకూడదూ!" అన్నాడు ఆమె విస్మయపడ్డట్టు. "మీరింకా కులాసాగా లేచి తిరక్కుండానే నేను సమాజానికా! మీరు హాయిగా వుంటేనే అన్నీను" అంది. కాస్త విషాదఛ్ఛాయలతో కూడిన ఆమె అమాయకపు ముఖం యిప్పటికీ తనకి కళ్లలో కట్టినట్టుంది. తాను, నవ్వుతూ, "నువ్వూ పిల్లలూ ఎప్పుడూ కులాసాగా వుండాలి. నా మాటకేం! ఏదో నాలుగు రాళ్లు తెచ్చి పడెయ్యడంకంటె నేను చేస్తున్న నిర్వాకమేమిటి. బాధ్యతంతా నిర్వహిస్తూ అన్నీ నువ్వే చూసుకుంటున్నావు". అన్నాడు. ఆమె నొచ్చుకున్నట్టుగా "అదేమిటండీ! మీరు కులాసాగా వుంటేనే మా కందరికీ కులాసా. మీరు కష్టపడి ఏ యిబ్బందీ లేకుండా చూస్తూండబట్టేకదా సంసారం చక్కగా, ఏ చింతా లేకుండా దిద్దుకుపోతూంది. నేను చేస్తున్న పాటి అంతా చేస్తారు. మరింత చెయ్యగలను; మీరు బాగుంటేనే నాకు ఏనుగంత బలం" అంది. ఈ మాటలు జ్ఞప్తికి వచ్చి, రమణారావుకి సిగ్గు వేసింది; నవ్వుకూడా వచ్చింది. నిజానికి, తానిన్నాళ్ళూ గుర్తించలేకపోయాడు కాని, శారద క్షేమంగా తన పక్కనుంటేనే తనకు ఏనుగంత బలం!

మొదటి తాత్కాలిక ఉద్యోగం అయిపోయి, మళ్ళీ ఏదైనా ఉద్యోగానికి ప్రయత్నిస్తూ తాను మూడు నెలలు నిరాశతో అవస్థపడ్డప్పుడు తన కెంత ధైర్యం చెప్పేది! "అందరికీ ఉద్యోగాలే వున్నాయా; ఉద్యోగం లేకపోతేమటుకూ హాయిగా బ్రతకలేమా! చదువుకున్నారు; మంచితనంవుంది. ఇది కాకపోతే యింతకంటే మంచిది మరొకటి దొరుకుతుంది. కొన్నాళ్ళు వెళ్లి మా గ్రామంలో వుందాము; లేదూ, అట్టే మదుపు అవసరంలేని చిన్న వ్యాపారమేదైనా పట్నంలో పెట్టుకోవచ్చు. ఇంత మాత్రానికే అధైర్యపడతారేమిటి?" అంటూ తన నగలనుకూడా ఎట్టి శంకా లేకుండా ఇవ్వచూపింది! ఆమె మాట మహాత్మ్యం లాగునే తాననుకున్నకంటే మంచి ఉద్యోగమే లభించింది. తరువాత భాయమయి ప్రమోషనుకూడా వచ్చింది. నిజంగా శారద తన అదృష్టదేవతే! ఇప్పుడన్నీ కలిసి యించుమించు నాలుగు వందలు జీతం; అంతా బాగానే వుంది. కాని నాలుగు కాదు, ఎనిమిది వందలు జీతం అయితేమటుకు శారద క్షేమంగా లేకపోతే పిల్లలికి కాని, తనకి కాని ఎలా జరుగుతుంది? వీటన్నిటికీ అర్థం, విలువా ఏముంటుంది?

గూట్లో రాధాకృష్ణ విగ్రహం దగ్గిర

(46-వ పేజీ చూడండి)




# రైల్వే పరిపాలనలో అసమర్థత

శ్రీ కృష్ణ
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

ఢిల్లీ వద్ద కాందిశీకులకోసం కట్టిన కొత్త పట్టణాలలో చిన్న చిన్న మార్కెట్లు బయలుదేరాయని ఇటీవల ఢిల్లీ పత్రికలు కొన్ని ప్రకటించాయి. ఇలా గే పాతఢిల్లీలోని పెరేడ్ గ్రౌండులో కొందరు ముస్లిములు పవిత్రంగాభావించే ఒకగోరీ చుట్టూ బిచ్చగాళ్ళ కాలని ఒకటి లేచింది. ఇంకా పార్లమెంటు వీధిలో రిజర్వుబ్యాంక్ సమీపాన పి. టి. ఐ. కార్యాలయంపక్కన ఒక చిన్న మార్కెట్ నెమ్మదిగా రూపొందుతోంది. సైకిళ్లమీద తిరుగుతూ అవీ ఇవీ అమ్ముకునేవాళ్ళు ఎక్కడపడితే అక్కడ ముఖ్యంగా క్వీన్ విక్టోరియారోడ్డులోను, కింగ్ ఎడ్వర్డ్ రోడ్డులోను కొత్తగా కట్టిన ప్రభుత్వ కార్యాలయాలసమీపంలో జోరుగా వ్యాపారం సాగిస్తున్నారు. సైకిల్ వాళ్లు ఎక్కడెక్కడ తమ వ్యాపారం సాగించుకోవచ్చునో స్పష్టంగా నిర్దేశించుతూ గత సంవత్సరం నాటి ఆరోగ్యమంత్రిణి రాజకుమారి అమృత్ కౌర్ కూ, న్యూఢిల్లీ సైకిల్ వాళ్ల ఫెడరేషన్ కూ ఒక ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం ఏ గాలికి ఎగిరిపోయిందోగాని, యథేచ్ఛగా ఎక్కడపడితే అక్కడ సైకిల్ వాళ్లు ప్రత్యక్షమవుతున్నారు.

ఢిల్లీలోని పెద్దరైల్వే స్టేషను తాలూకు ఒకటవ, రెండవ ప్లాటు ఫారాల తూర్పు కొసన ఉన్నట్టుండి ఒక శివాలయం లేచింది. శివలింగానికి అభిషేక జలం వచ్చే పద్ధతి చిత్రంగా ఉన్నది. లింగానికి పైగా నీరునిలవ చేసే టాంక్ ఒకటి ఉంది. అందులోంచి నీటిచుక్కలు పడేట్టుగా ఎవరో బహు తెలివిగా ఏర్పాటుచేశారు.

గడచిన కొలది వారాలలో ఢిల్లీలో కొత్తగా బయలుదేరిన వింతలు, విశేషాలు ఇవి. పరిపాలనావ్యవస్థ దెబ్బతినడానికీ, అవినీతి పక్షపాతంలాగా నెమ్మది నెమ్మదిగా క్రమ్ముకోడానికి ముఖ్యకారణం దయాదాక్షిణ్యాలపేరుతో అధికారులు మాను కున్న అలసత్వమే. అనుమతించని స్థలంలోకి ఎవరైనా వచ్చి వస్తువులు అమ్ముకుంటూఉంటే అధికారులు చూసీ చూడనట్లు ఊరుకుంటారు. దాంతో అలాంటి వాళ్లు మరికొందరు బయలుదేరుతారు. క్రమంగా వాళ్ల సమాఖ్య ఒకటి ఏర్పాటవుతుంది. సమాఖ్య ప్రతినిధులు అంగీకరించిన ఒడంబడికలను సమాఖ్యసభ్యులే కాలదన్ని యథేచ్ఛగా ప్రవర్తిస్తూ ఉంటారు. అక్రమపద్ధతిలో వ్యాపారం సాగించినందుకుగాను వాళ్ల నెవరైనా అదిలిస్తే వెంటనే సమాఖ్య సభ్యులంతా ఓ పెద్ద ప్రదర్శన లేవదీస్తారు. పార్లమెంటు సభ్యులు వీరికి సర్వవిధాలా తోడ్పడడానికి సిద్ధంగా ఉంటారు. అధికారులు బాధపడేదల్లా మూడు విషయాలగురించే. ఒకటి—ఉద్రేకాలు రెచ్చినప్పుడల్లా వాటిని ఏదోవిధంగా తగించాలని. రెండు—దయా, దాక్షిణ్యాల పేరుతో అన్నీ సహించి ఊరుకోవాలని. మూడు—దుడ్డుకర్ర చేతో పట్టుకునుండుని ఎదిరించిన ప్రతివాడితోనూ రాజీపడాలని. పరిపాలనావ్యవస్థే గనుక సక్రమంగా సాగుతూ ఉన్న పక్షంలో ఎక్కడ పడితే అక్కడ చెత్తాకానీ మార్కెట్లు తయారవడానికీ, ప్రభుత్వస్థలాలను ప్రజలు అక్రమంగా ఆక్రమించుకోడానికీ ఆస్కారమేమన్నా ఉంటుందా?

ఢిల్లీ పెద్దస్టేషనులో శివలింగం ప్రతిష్ఠించడం కొత్త తీవ్రమైన వ్యవహారమే. రైల్వే స్టేషను సూపరింటెండెంటు ఏంచేస్తున్నాడో శివుడికే ఎరుక. శివలింగంమీద పువ్వులు, పత్రి మొదలైనవి కనిపిస్తూ వుండడంచేత యథావిధిగా పూజ జరుగుతున్నట్లు స్పష్టమౌతోంది. భారత పరిపాలనావ్యవస్థ మతాతీతమైనదన్న సూత్రానికి ఇది విరుద్ధం కాదా? స్టేషను సూపరింటెండెంటు దాన్ని ఎలా అనుమతిస్తున్నాడుమరి?

* * *

ఈమధ్య నాకు కలకత్తా ప్రయాణంలో కలిగిన అనుభవాలు: పశ్చిమదేశాల్లో, ముఖ్యంగా అమెరికాలో విమానప్రయాణాలు నానాటికీ ఎక్కువవుతున్నాయి. రైల్వేలు తమ ప్రాముఖ్యం తగ్గిపోకుండా కాపాడుకోడానికిగాను రైళ్లలో చాలా సుఖంగా, విశ్రాంతిగా వుంటుందనీ, ప్రకృతి సౌందర్యాన్ని బాగా చూసి ఆనందించవచ్చుననీ ప్రచారం చేసుకునే పద్ధతి అవలంబిస్తున్నాయి.

భారతదేశంలో రైల్వేలను దెబ్బతీసేటంతగా విమాన ప్రయాణాలు ఎక్కువ కాలేదు. రైల్వేలే మన ప్రధాన ప్రయాణ సాధనాలు. అయినా, రైల్వే ప్రయాణాలను కఠోరమైన అనుభవంగా మార్చడానికి ప్రజాస్వామ్యం పేరుతో చేయగలిగినదంతా చేశారు. ఇప్పుడు ఫస్టుక్లాసు పేరుతో చెలామణీ అవుతున్న పెట్టెలు నిజానికి స్వాతంత్ర్యం రావడానికి ముందు రోజుల్లోని సెకండుక్లాసు స్థాయిలోనివి. అయితే ఒక తేడా ఉంది. 1937 నాటి సెకండుక్లాసు ఇప్పటి ఫస్టుక్లాసుకంటె హాయిగానూ, శుభ్రంగానూకూడా ఉండేది.

నేను ప్రయాణంచేసిన రోజున పంజాబు మెయిలు ఎయిర్ కండిషన్ కోచ్ 'అతిరద్దీ'గా ఉంది. ప్రయాణికుల సౌకర్యార్థం మేగాబోలు 'డైనింగ్ కారు' తొలగించేశారు. ఇక అంతా క్షుద్బాధానివారణార్థం రైల్వే రెస్టారెంటులమీద పడ్డారు. పదార్థాలు రోతగా ఉన్నాయి. పెట్టేది కొత్తయినా ధరమాత్రం దారుణంగా ఉంది. పోనీ వస్తైనా బాగుందా అనుకుంటే అది మరీ దారుణం. పళ్ళాలు, గ్లాసులు ఛండాలంగా ఉన్నాయి. వడ్డించేవాళ్ళ దుస్తులు మరీ

# న్యూఢిల్లీ లేఖ

పాడుగా ఉన్నాయి.

బ్రిటిషు పరిపాలన రోజుల్లో రైల్వే ప్లాటుఫారాలను శుభ్రంగా కడగడమనే పెద్ద అలవాటు ఒకటుండేది. ఇప్పుడా అలవాటు పోయింది. ఢిల్లీ రైల్వే ప్లాటుఫారాలమీద పూతమీద పూతగా మురికి పేరుకుని ఉంటోంది. బెంగాల్‌లో అడుగు పెట్టి పోతున్న కొద్దీ మురికితనం పెరుగుతూ పోతుంది. రైల్వేప్లాటుఫారాలనేకం, కడగడం మాట దేవుడెరుగును, ఊడ్చిన పాపానైనా కనబడవు. దుమ్ము ధూళీ, చెత్తాచెదారం విహారం చేస్తూఉంటాయి.

ఎయిర్ కండిషన్ చేసిన కోచీలలో కూడా ఒక విధమైన పతనం ప్రవేశించింది. వెనకటి "దుర్దినాల్లో" ఉన్నంత శుభ్రంగా ఇత్తడి ఉండడంలేదు. కిటికీ అద్దాలమీద మురికి పేరుకుని ఉంటుంది. తలగడ గలీబులు మాసిపోయిఉంటాయి. మూత్ర విసర్జనకు సౌకర్యాలు లేవు.

మొఘల్ సరాయ్‌లో ఎవరో బంగారయ్యగారు నా కంపార్టుమెంటులో ఎక్కాడు. బంగారయ్యగారని ఆయనకెందుకు పేరుపెట్టానంటే, ఆయన బట్టలు మాసిపోయి కంపుకొడుతున్నాయి గాని, ఆయన సామాను ఎక్కువభాగం వెండి సామానే. మంచి నైష్ఠికుడులాగా ఉన్నాడు. చేతులు జోడించి ఏదో ధ్యానం చెయ్యడం, ఏదో తావళంగావును గుడ్డచాటున తిప్పుతూ జపం చెయ్యడం చూస్తే ఆయన నిష్ఠ అర్థమైంది. ఆయన తనకి కావలసిన నీళ్ళు తనే తెచ్చుకున్నాడు. మొహం కడుక్కొని ఖాండ్రించి ఉమ్ములు వెయ్యడానికి వాష్ బేసిన్ వాడుకున్నాడు.

మన రైళ్ళలో పొగ తాగేవారికీ, తాగనివారికీ వేరు వేరు పెట్టెలుంటాయి. నా దొక సలహా. కనీసం ఎయిర్ కండిషన్డ్ కోచ్‌లలోనైనా సనాతనాచారపరులకు వేరే కంపార్టుమెంటులు, ఇతరులకు వేరే పెట్టెలు ఉంటే బావుంటుంది. ఇది కుదరకపోతే, వాష్ బేసిన్‌లను పాడుచెయ్యవద్దని సనాతనాచారపరులను శాసించనైనా శాసించాలి.

రైలు ప్రయాణికులలో సహజీవన సిద్ధాంతం అమలుచేద్దామని ప్రయత్నించడం వృథా ప్రయాస!

* * *

లండన్ "టైమ్స్" ఇటీవల ఒక సంపాదకీయంలో ఇలా వ్రాసింది:

"కొన్ని సంవత్సరాలుగా ఇండొనీషియా ఆ ప్రభుత్వం కాదని ఈ ప్రభుత్వమూ, ఈ ప్రభుత్వం కాదని ఆ ప్రభుత్వమూ మారుస్తూ

(47-వ పేజీ చూడండి)

# శ్రీనాథుని పరిహాస రసికత

పనివడి నారికేళఫల పాకమునం
జవిరైన భట్టహ
ర్షుని కవితాను గుంభములు
సోమరిపోతులు కొందఱయ్య
దని కొనియాడనేర, రది
యట్టిద లేజవరాలు చెఱుకు గి
టిన వసవల్చు బాలకుఁడు
డెందమునం గలంగ 'నేర్చునె?'"

నారికేళపాకమును కొనియాడనేరని వారికీ పద్యము చెంపపెట్టు! వారు సోమరిపోతులట! జవరాలు చెఱుకు గీటినను దాని నర్థము చేసికొనలేని వసవల్చు బాలకులట. పద్యము చదివినతోడనే మనకీభావము స్ఫురింపకపోదు. కాని కవి ఎంతటి గడుసువాడు! ప్రత్యర్థులను పరిహసించుటలోను నైపుణి ప్రదర్శించిన యీ పరిహాసరసికు డెవరోగదా! అను భావములు సాధారణముగా మనకు స్ఫురించును. నిందాగర్భితమైన యీ పద్యము హాస్యరసపు మూసలో కాకలు తేరినది.

హాస్యరసపోషణము కత్తిమీది సామువంటిది. హాస్యమును ఎంతో సుకుమారముగా పోషింపవలెను. లేదేని అది ఉదాత్తముగా ఉండదు, వెగటుగా తోచును. హాస్యమును అందరుకవులు పోషింపలేరు. కొందరు మాత్రమే దానిని స్నిగ్ధసుందరముగా తీర్చిదిద్దుదురు. ఆ కోవకు చెందినవారిలో శ్రీనాథుడు సంభావ్యుడు.

మహాకవి శ్రీనాథుడు మంచి పరిహాసరసికుడు. అతని చాటుధార లీ విషయమును బలపరుచుచున్నవి. ప్రతి చాటువునందును హాస్యరసము తొంగి చూచుచునే యుండును. కాని కొన్ని పట్టుల హద్దులు దాటిపోవుటచే అది అపహాస్యముగానో, అశ్లీలముగానో పరిణమించినది. అందువలననే హాస్యరసపోషణము కత్తిమీది సాము—అనుట.

రెడ్డిదొరల కాలమున సింహాచల నృసింహస్వామివారికి మహావైభవముగా ఉత్సవాదులు జరిగెడివి. వానిని తిలకించుటకై ఎక్కడెక్కడివారు ఆ కొండమీద గుమిగూడెడివారు. రెడ్డిరాజులతోబాటు శ్రీనాథుడు కూడ అచ్చటికి చేరెడివాడు. అట్టిసమయములం దాతని పరిహాస రసికతకు లెక్కలు వచ్చెడివి.

ఒకనొకనాడు తములపాకుల తేరమాడబోయి శ్రీనాథుడు అంగడిమీద నున్న అలివేణిని చూచి మరులుగొన్నాడు. ఆ విషయమును ఆ మహాకవియే వావిడిచి చెప్పుకొనెను. ఇందులో చమత్కారమేమియు లేదు. శంకరునివంటి మన్మథారియే ఆమెను వలచి, లింగరూపియై ఆమె హృదయమును నెలవుగా చేసికొనెనట! కనుక శ్రీనాథు డామెపై మరులుగొనుట ఒక లెక్కలోనిది కాదట. ఈ పద్యమును చూడుడు.

చల్లా రాధాకృష్ణశర్మ

"కొలకరిమించు దీవెగలతోఁ ప
దుకాణముమీఁద నున్నయా
య్యలికులవేణితోఁ దములపాకుల
తేరములాడఁబోయి నే
వలచుటకేమి, శంకరునివంటి
మహాత్ముడు లింగరూపియై
కులికెడు దానిగబ్బి చనుగుబ్బల
సందున నాట్యమాడఁగన్—"

ఆ జంగమువారి చిన్నదాని అందచందములకంటె ఈ పద్యమున అందాలు దిద్దుకొనిన శ్రీనాథుని రసికతయే మనల నెక్కుడుగా ఆకర్షించును.

"ఊరు వ్యాఘ్రనగర, మురగంబు కరణంబు
కాపు కపివరుండు, కసవు నేఁడు
గుంపుగాఁగ నిచట గురిజాలసీమలో
నొగులెల్లఁ గూడి కొక్కచోట."

పులిపాటి వారలు శ్రీనాథుని సముచితరీతిని గౌరవింపలేదు. కాగా కవికి వారిపై కోపము వచ్చెను. ఆ కోపమును వెడలగ్రక్కనగాని మనశ్శాంతి కలుగదు. అట్లని శ్రీనాథుడు తిట్టుకవిత చెప్పలేదు. తనకు వారిపైగల కసిని మృదూక్తులతోనే తీర్చుకొన్నాడు. ఇదియే ఆ మహాకవి ప్రత్యేకత.

మరియొక సన్నివేశము. ఆమె బంగారు బొమ్మ. కాని యేమి లాభము? అదృష్టహీనురాలు. బెబ్బులి యొకడు ఆమెను భర్తగా దాపురించినాడు. వయసుదానికి వయసుమళ్ళినవాడు మగడగుటను చూచి శ్రీనాథుడు పరితపించెను. ఆమెయందు సహానుభూతిని ప్రదర్శించుచు:

"......దానికి నేల యొక్కనిం బెబ్బులి
వంటఁ గట్టితివి? పెద్దవు నిన్ననరాదు కోరి
దానబ్బ! పయోజగర్భ! మగనాలికినింత
విలాసమేటికిన్"

అని శ్రీనాథుడు మృదూక్తులతో మొగమువాచినట్లుగా విలాసవంతులైన వృద్ధులను తూర్పారపట్టినాడు.

శ్రీనాథుని పరిహాసరసికత పూబోడులను వర్ణించుటకు మాత్రమే ఉపయోగపడెననుకొనరాదు. సమయముచిక్కిన చాలు. బంధుజనులనుకూడ అతడు గేలిచేయుచుండెడివాడు. శ్రీనాథుని బావమరది రామయమంత్రియట. అతి డోకయూరికి కరణము. అనగా ఆ నాళ్ళలో మకుటములేని మన్నీడన్నమాట. పాడిపంటలకు కొదువలేదు; సిరిసంపదలకును కొదువలేదు. వీనికి నైదోడుగా దంతపుష్టిని, జీర్ణశక్తిని అతనికి భగవంతు డనుగ్రహించెను. రామయమంత్రికి ఇంకేమి కావలెను? ఒకనాడు అతండుల ధ్వంసకుని భోజన పరాక్రమమును కన్నులారచూచి ఆ దయ్యపుతిండిని శ్రీనాథు డిట్లు వర్ణించెను:

"గ్రామము చేతనుండి పరి
కల్పిత ధాన్యము నింటనుండి శ్రీ
రామకటాక్షు వీక్షణపరంపర
చేఁ గడలేకొఁ గాక మా
రామయమంత్రి భోజన ప
రాక్రమ మేమని చెప్పవచ్చు? నా
స్వామి యెఱుంగుఁ దక్కబళిచాతురి
తాళ ఫలప్రమాణమున్—"

ఇటుల శ్రీనాథుని చాటువులలో చిక్కని, చక్కని హాస్యము నెలకొనియుండుట విశేషము. ఇట్టి పద్యము లెన్నియోకలవు. ఇవియన్నియు నాతని పరిహాసరసికతకు మెఱుగులు దిద్దుచున్నవి.



# వెంకటేశంతో ఒకరోజు

వచ్చినపని పూర్తయింది. పూర్తయింది కనుక యీరోజు కాకపోతే రేపు వెళ్ళొచ్చు. ఈసారైనా వెంకటేశాన్ని చూసిపోదామనుకొని టైము చూశాను. తొమ్మిదయింది. ఈపాటికి ఆఫీసుకి వస్తే రానేవచ్చు. లేకపోతే ఓగంటా, రెండు గంటలు అక్కడే కూర్చుంటే వాడేవస్తాడు అనుకొని యింటికిపోదామని బస్సుస్టాండుకి వచ్చినవాడినల్లా తాలూకాఫీసుకి దారి తీశాను.

వెంకటేశాన్ని చూసి చాలకాలమైంది. వాడికి ఉద్యోగం వచ్చినతర్వాత మూడు నాలుగేళ్ళు ఎక్కడెక్కడో దూరంగా వుండడంవల్ల కలుసుకోడానికి వీలులేకపోయింది. రెండేళ్ళక్రితం యీ వూరు తాలూకాఫీసుకి బదిలీఅయినట్టు వాళ్ళనాన్న చెప్పగా విన్నాను. అప్పటినుంచీ కలుసుకోవాలని వున్నా, ఇంతదూరమూ ఇదివరకు ఎన్నిసార్లు వచ్చినా ఎప్పటికప్పుడే ఏవేవో జరూరుపనులవల్ల వీలుపడిందికాదు. బాల్యంనుంచీ కలిసి చదువుకొన్నాం. బి. యే. చదువుతూ నేను మానేశాను. వాడు పేసయ్యాడు. అప్పటినుంచీ ఉద్యోగప్రయత్నంలోపడ్డాడు. ప్రయత్నాల్లో వుండగానే పెళ్ళయింది. ఓకూతురు కూడా పుట్టింది. ■ తరువాత ఉద్యోగం వచ్చింది. అంతే. మళ్ళీ కలుసుకొనే అవకాశమే కలగలేదు. ఇప్పుడెలా వున్నాడో అనుకొంటూ నడుస్తున్నాను. ట్రెజరీపనిమీద కూడా యీ ఆఫీసుకు రాకపూర్వం రెండు మూడు దఫాలు వెళ్ళివుండడంవల్ల ఆఫీసు ఉనికిని గురించి ఎవరినీ అడగవలసిన అవసరం లేకపోయింది. పదినిముషాలలా నడిచి ఆఫీసు చేరుకొన్నాను.

* * *

అప్పటికప్పుడే ఆఫీసు ఆవరణలో చాల సందడిగా వుంది. ఆఫీసు కెదురుగావున్న గంగరావిచెట్టుదగ్గర పది పదిహేనుమంది రైతులు గుమిగూడి వున్నారు. వారిలో కోరమీసాలవాళ్ళు కొందరు, పిలక చుట్టినవాళ్ళు కొందరు, మారరాజులలా తలపాగాలు కట్టినవాళ్ళు, నోట్లో అడుగు పొడుగున పెట్టిన పొగాకుచుట్టను తిప్పుతున్నవాళ్ళు, చేతికర్రలు, కిర్రుచెప్పులు ధరించినవారున్నారు. ఎవరెంత ఠీవిగా దర్పంగావున్నా అమాయకంగా ముఖాలుపెట్టి ■ చెట్టుకింద చేర్లబడిన గుమాస్తాలతో ఏదో రాయించుకొంటున్నారు. ఆచేతిలో రెండు, యీచేతిలో రెండు సోడాకాయలు పట్టుకొని 'సోడా, సోడా' అని ఓ పదేళ్ళకుర్రాడు వాళ్ళచుట్టూ తిరుగుతున్నాడు. 'పుణుకులు, జంతికలు' అంటూ భుజంమీద పెట్టిన జంగిడీమీద వాలుతున్న ఈగలు మొదలైనవాటిని ఎడంచేత్తో పట్టుకొన్న చిన్నకర్రపుల్లతో అదలిస్తూ కేకలేస్తున్నాడు ఓతాత. ఆ చెట్టుకు పదిగజాల దూరంలోవున్న వేపచెట్టుదగ్గర నుంచున్న లీడరు ముక్కుచివరికి వచ్చేస్తున్న కళ్ళద్దాలపైనుంచి గుంపుకేసి చూస్తూ ఏచట్టాల గురించో రూల్సుగురించో చుట్టూనిలబడి వున్న నలుగురైదుగురితో ధాటిగా కబుర్లు చెబుతున్నాడు. అక్కడే తాలూకాఫీసుకి చేర్చివున్న మాజిస్ట్రేటు కోర్టుముందు యిద్దరు కానిస్టేబుల్సు నలుగురైదుగురు ముద్దాయిల్ని కొన్నికుండలు, సీసాలు వగైరాతో సహా హాజరుచేశారు. వాళ్ళనిచూస్తూ 'టీ సార్,

కె. శ్రీమన్నారాయణ

టీ' అంటున్నాడు అప్పుడే కావిడి దించిన టీ ఆసామీ. అలా చూస్తూ ఆఫీసు వరండా ఎక్కాను. తాసిల్దారు వారి గదిముందొకబండి ఆగివుంది. లోపలినుంచి ఆయనేదో చెప్తుంటే, 'అయ్యా! అయ్యా!' అంటూ ఆలకిస్తున్నాడు డవాలు వేసుకొన్న బంట్రోతు. పది పన్నెండు మంది – మున్సబుకరణాల మల్లే వున్నారు – ట్రెజరీచుట్టూ తప్పుచేసిన వాళ్ళు తప్పించుకు తిరుగుతున్నట్టు తిరుగుతున్నారు. అప్పటికప్పుడే ఆఫీసంతా స్టార్టుచేసిన మిల్లులా పనిచేస్తోంది. లోపల హాల్లో గుమాస్తాలంతా ఎవరిసీట్లలో వాళ్ళు కూర్చొని రాసుకొంటున్నారు. జవానులు హడావిడిగ తిరుగుతున్నారు.

కోటు సర్దుకొంటూ గదిలోంచి బయటికి వచ్చి వరండాలో నిలబడి హెడ్‌గుమాస్తా నుద్దేశించి అనుకొంటూ, "నే వెడుతున్నానయ్యా, సాయంత్రానికల్లా వచ్చేస్తాను," అని చెప్పి డఫేదారుకేసి తిరిగి "బంట్రోతులెవరూ సరిగా పనిచేయడంలేదు. ఆరికార్డు రూమ్‌చుట్టూ గడ్డి బాగా పెరిగిపోయింది. చెక్కించేయ్," అని చెప్పి తాసిల్దారుగారు బండి ఎక్కేంతలో రివ్వున వచ్చిపడ్డాడు సైకిల్‌మీద పోస్టల్ కుర్రాడు. "మళ్ళీ ఏదో వచ్చింది. టెలిగ్రాం రాని రోజంటూ లేదు. ఏదోయ్, యిలా యియ్యి," అని కళ్ళజోడు పెట్టుకొంటూ అందుకొని, చదివి జేబులో పెన్‌తీసి ఏదోరాసి 'ఏ. ఫోర్' అని కేకవేయడంతో 'ఏ. ఫోర్ గారు' అని ఒకడు, 'వెంకటేశంగారు' అని నలుగురైదుగురు బంట్రోతులు ఒక్కసారిగా పిలవడంతో ఆ గుమాస్తా ఎవరో గుడ్లుతేలవేసి రాస్తూవున్న, పెన్ను పట్టుకొన్నది పట్టుకొన్నట్టుగానే యివతలికొచ్చాడు. 'వెంకటేశం' అనగానే మా వెంకటేశంకాదు గదా అనుకొంటూ సరిగ్గా చూడానికని కొంచెం ముందుకువచ్చి మావాడు కాదని నిశ్చయించుకొన్నాను.

"ఏమోయ్! ఆ డి. సి. బి. స్టేటుమెంటు గురించి టెలిగ్రాం వచ్చింది."

"అదే, తయారుచేస్తున్నానండి."

"ఏం తయారుచేస్తున్నావో, ఏమో! టెలిగ్రాం వస్తేనేకాని యీ ఆఫీసునుంచి ఒక్కటే వెళ్ళదు. మీకు చెప్పలేక చస్తున్నాను. నాలుగింటికి నే వచ్చేటప్పటికల్లా అది నా బల్లమీద వుండాలి. ఇలా అయితే లాభంలేదు" అని విసుక్కొంటూ బండి ఎక్కి "పోనీయవోయ్!" అన్నారాయన.

బండి వెళ్ళిపోయింది. ■ వెంకటేశం తిన్నగా నాదగ్గరకు వచ్చి "ఎప్పుడొచ్చావురా?" అన్నాడు.

నేను విస్తుపోయి వాణ్ణొకసారి నఖశిఖపర్యంతం పరిశీలించాను. మధ్య పాపిడితీసి పోగ్గాపైకి దువ్వేవాడు. కాని ఎప్పుడూ యిలా అంటాకులా వేలబడడం నేను చూడలేదు. అంతంత బుగ్గలుండేవి. ఇప్పుడిలా చప్పిదవళ్ళయ్యాయేమిటి! అంత లావుగా వుండకపోయినా మనిషి బలంగావుండేవాడు. ఇలా పలాకులా ఉన్నాడేమిటి? ఈ వేషమేమిటి? ఆ కాలరలా మడతలు పడడమేమిటి! టకప్‌చేసి బిళ్ళపెట్టి దానిపై బెల్టుపెట్టి—ఆషోకంతా ఏమైపోయింది! బిళ్ళలకు బదులుగా ఒకదానిలో ఒకటిపెట్టి బిగించాడేమిటి! పెంటుకుడత లొకటివుంది యింకొకటి ఊడిపోయి ఉన్నాడేమిటి? కాబూల్ కాండల్సు చెలులలా అటగలొక్కాడేం! తొక్కా చేతుల్లో ఒకటి మోచేతివరకూ పైకి లాగేసి రెండోది అలా వేలాడతీశాడేం! వీడసలు మా వెంకటేశం అవునా? కాదా? అని నిర్ఘాంతపోయి చూస్తుంటే—

ఇల్లుకూడా వచ్చేసింది. ప్రహరీగోడ వుండడం వున్నదికాని లేనట్టే లెక్క. ఆయన తలుపు తోసేటప్పటికి గుమ్మానికి కవతల ఇవతల వున్న బురదగుంటల్లో పడుకొన్న పందులు చెదిరిపోయాయి.

వాకిట్లోకి వెళ్ళగానే 'అరుణా! మీ ఇంటికి చుట్టాలొచ్చారు,' అని చెప్పి ఆయన తన వాటాలోకి వెళ్ళిపోయాడు.

వీళ్లు మా వూరు విడిచి వెళ్ళేటప్పటికి అరుణ చాలా చిన్నది. నేనేం తెలుసు? నాకేసి అదోలా చూసి వాళ్ళమ్మతో చెప్పడానికి లోపలికి వెళ్ళిపోయింది. వాకిట్లో నిలబడి యింటికేసి చూశాను. 'నలభై ఏళ్లుంటాయి' అనుకొన్నాను. పెంకులు తిరగేయించి కనీసం అయిదేళ్ళయినా అయి వుంటుందని నిశ్చయించుకొన్నాను.

'అన్నయ్యగారా! రండి, రండి! ఉండండి, నీళ్ళు తెస్తా'నని నవ్వుతూ లోపలికి వెళ్ళిపోయింది సుభద్ర. చాలా కలుపుగోలుది. పెళ్లయిన తర్వాత రెండేళ్ళు [illegible]త్తవారింట్లోనే కాపరం చేయడంవల్ల, మా యిల్లూ, వాళ్ళిల్లూ ఒకే వీధిలో ఒకదానిపక్క ఒకటి వుండడంవల్ల [illegible] యింటి ఆడవాళ్లు, మా యింటి ఆడవాళ్లు అస్తమానూ వస్తూపోతూ వుండడంవల్ల ఎరమరికలు లేవు.

కాళ్లుకడుక్కొని లోపలికి వెళ్ళాను. మూడు చిన్నగదులు ఒకదాని తర్వాత ఒకటి వరసగా వున్నాయి. డిపోటా ఖన్నంత వాటా అది.

'ఇదే రావడమా? ఇల్లెలా తెలిసిందయ్యా?' అంది.

'ఆఫీసునుంచే వస్తున్నా'నన్నాను.

'స్నానం చేద్దురుగాని లెమ్మని' భుజంమీద బిడ్డని ఉయ్యాల తొట్టిలో వేసి సబ్బిళ్లు పెట్టె మూతిదగ్గర పెట్టడానికి వెళ్ళింది.

స్నానంచేసి భోజనం దగ్గర కూర్చున్నాను. సుభద్రవంటింట్లోనుంచి వాళ్ల అత్తమామల క్షేమ సమాచారాల దగ్గరనుంచి మా ఆవిడ నీళ్ళోసుకుందా? లేదా అనే విషయం వరకూ అడిగి తెలుసుకొంది. మాలాంటి గుమాస్తాలు యింతకంటే మంచి భోజనం పెట్టలేమంది.

'భోజనానికేం? చారూ, కూరా, మజ్జిగా' అన్నాను.

'ఏం మజ్జిగ, వట్టి నీళ్ళేగా! ఈ వూళ్ళో మంచి మజ్జిగకూడా దొరకదు. బజారుకూడా దూరం. పాపం! పక్కవాటాలో వాళ్ల పిల్లలే తెచ్చి పెడుతుంటారన్నీను,' అంది.

భోజనంచేసి పడకకుర్చీలో మేను వాల్చాను. 'ఆ మధ్య మామగారికి జబ్బు చేసిందని ఉత్తరం రాశారు. సెలవు దొరికితే వెళ్ళి చూద్దామని అన్నారు. కాని తర్వాత కులాసాగానే వుందని ఉత్తరం వచ్చింది. అయినా వారు ఒకసారివచ్చి అందరినీ చూడాలని వుంది. నేను లేకపోతే యిక్కడ యీయనకు కుదరదు. తెల్లవారేసరికి అన్నీ పనులూ అయిపోవాలి,' అంటూ ఆమె ఏమేమిటో చెప్పుకుపోతున్న సమయంలో వెంకటేశం వచ్చాడు. వస్తూనే భోజనం పెట్టమన్నాడు.

భోజనం చేస్తూనే అన్నీ విషయాలూ మాట్లాడేడు. ఒకసారి వచ్చి అమ్మనీ, నాన్ననీ చూసిపోవాలనివున్నా పట్టుమని పదిరోజులు సెలవు దొరకదట. 'ఎంత కష్టంగా ఖర్చుపెట్టినా డబ్బు మిగలడం లేదురా, యింటికి పంపించడాని'కన్నాడు.

భోజనం ముగించి కాఫీ ఫ్లాస్కు తీసుకొని 'ఆ స్టేటుమెంటు పూర్తయింది. కాని యింకోసారి చూడాలిరా, పడుకున్నా' వన్నాడు. నేనూ వస్తానని వాడికూడా బయలుదేరాను. వీడు మరీలా ఎదరగా నడవడం మొదలుపెట్టాడు. కొంతదూరం నడిచి నువ్వు నడుస్తూవుండు, నేను సిగరెట్లు కొనుక్కొని వస్తాలే అని తప్పించుకొన్నాను.

ఆశ్చర్యం వేసింది. 'ఇలాటి తొందరలు ఎప్పుడూ వుంటాయా? ఈ కొలేజా? ఎప్పుడూ ఉంటేటట్లయితే కష్టమే!' అనుకొని తాపీగా సిగరెట్టు కాల్చుకొని వెళ్ళి వాడిపక్క కూర్చున్నాను. వాడు [illegible] చెరువంత పుస్తకంలోనూ మునిగి తేలుతున్నాడు. ఆ హాల్లో ప్రతిఒక్కడూ తొందరలో ఉన్నట్టే వున్నారు. మూలగా బీరువాపక్క కూర్చునివున్న గుమాస్తా కనపడీ కనపడకుండా వున్నాడు. ముందొకబల్ల, పక్కనొక బల్ల, బల్లనిండా కాగితాల కట్టలూ వున్నాయి. ఆయన సమాధిలో వున్నట్టున్నాడు. అతడిపక్క గుమాస్తా కొంప మునిగిపోయినట్టు మొహంపెట్టి పోయిన ఏ కాగితం గురించో కాగితాలకట్టలు వెదుకుతున్నాడు. అతడి పక్క తను వంచిన తల ఎత్తకుండా కలాన్ని పాతిక మైళ్ళ స్పీడుతో నడిపిస్తూ రాసుకొంటున్నాడు. తెలియకో, పొరపాటువల్లో చేసినతప్పుకు మరోగుమాస్తా హెడ్ గుమాస్తాచేత చీవాట్లు తింటున్నాడు. అతడి పక్క సీటులో నిలబడివున్న గుమాస్తా బంట్రోతు తెచ్చిన ఏదో కాగితంమీద నిలబడే ఏదోరాస్తున్నాడు.

ఎప్పటిపని అప్పుడు చేసేసుకొంటే యీ తొందరలేమీ వుండవుకదా, అనే అనుమానం తగిలీ తగలడంతోటే అనేశాను పైకి. మావాడేమీ మాట్లాడలేదు కాని పక్క కూర్చున్న గుమాస్తామాత్రం కళ్ళజోడులోంచి ఒకసారి, తీసేసి ఒకసారి వీడెప్పుడు ఆఫీసుమొహం ఎరగనట్టున్నా డన్నట్లుగా చూశాడు.

'నీకు తెలియదు లేరా' అన్నాడు మావాడు కలగజేసుకొని.

'తెలిసే దేముంది? వచ్చిన ప్రతికాగితా[illegible] ఏదో రాసిపారేస్తే సరిపోదా' అన్నా[illegible].

'ఆ!' అని జేబులోంచి పొడుం డబ్బీ తీసి ఒకపట్టుపట్టి 'ఎంత తేలిగ్గా అనేసావు' అని అందుకున్నాడు మరో పక్కాయన. 'ఇందులో ఒకోకాగితం మనిషిని ముగ్గ చేయిస్తుంది. ఒకటి కుస్తీ పట్టిస్తుంది. ఇంకొకటి సర్కస్ చేయిస్తుంది. మరొకటి ఉల్టా సీదా చేయిస్తుంది. అన్నీకలిసి మనిషి రక్తాన్ని పీల్చి పిప్పిచేస్తాయి. కండలు కరగతీస్తాయి. రాత్రింబగళ్ళు కుర్చీకీ, బల్లకీ అంటించేస్తాయి. నెత్తిమీద వెంట్రుకలు పీకేస్తాయి. మీకు అర్థంకాదు లెండి' అన్నాడు ఆవేశంగా.

'అంతే కాబోలు;' అనుకొన్నాను. మరి మాట్లాడలేదు. గంటగంటకూ కాఫీ తాగుతూ నాలుగయ్యేటప్పటికి ఫ్లాస్కులో కాఫీ ఆఖరు చేశాడు మావాడు.

ఇక నాకక్కడ ఉండపట్టక అలా పోయి వస్తానని చెప్పి యింటికి వచ్చి అరుణను తీసుకొని పార్కుకి పోయాను. అక్కడ ఓగంట గడిపినతర్వాత బజారుకి తీసుకెళ్లాను. ఆ కొట్టూ ఈకొట్టూ తిరిగివస్తుండగా మిత్రుడొకడు తారసిల్లాడు. మాటల్లో ఎనిమిదయిపోయింది. ఇంటికి వస్తుండగా మావాడూ, పక్కవాటాలో ఆయనా కనిపించారు. ఇద్దరి చేతుల్లోను ఫైల్సువున్నాయి.

'ఇంత ఆలస్యమైందే?' అన్నాను.

'ఇంకా నయం. ఆయన కేంపునుంచి రాలేదు కనుక త్వరగా ఊడిపడ్డాం,' అన్నారు.

'సరి, సరి' అనుకొన్నాను.

ఇంటికెళ్లి భోజనాలు చేసిన తర్వాత వాడు కాగితాలు తీసి లైటుముందు కూర్చున్నాడు. నేను మంచమెక్కాను.

రాస్తూనే ఆఫీసుగురించీ, పనిగురించీ తెగ మాట్లాడాడు. వాళ్లనాన్న కూడా రెవెన్యూ డిపార్టుమెంటులో గుమాస్తా పనిచేసి రిటైరైనవారే. సాధకబాధకాలన్నీ తెలిసిన ఆయన వెంకటేశాన్ని గుమాస్తాగా కాక కాస్త పెద్ద ఉద్యోగస్థుడిగా తయారు చెయ్యాలని విద్యే చదివించారు. కాని వాడికి తప్పలేదు. 'టెస్టులు పేసయితే పైకి రావచ్చు' అని సమాధానపడ్డారు అప్పట్లో. అందుకే అది

## వెంకటేశంతో ఒకరోజు

గాను–'ఏ మైనా టెకులు చేసయ్యావా?' అని.

'చదవడానికి తీరికేదీ? అందుకనే కట్ట లేద'న్నాడు.

నాకావలింతలు వచ్చాయి. ఇంకా ఏమైనా మిగిలిన విషయాలు రేపు ఆదివారమే కనుక నే వెళ్లేలోపల మాట్లాడుకోవచ్చని మంచాన్ని కిటికీదగ్గరగా లాగి పడుకొన్నాను.

చల్లగా గాలి వస్తోంది కాని వస్తూ వస్తూ దారిలో మురదగుంటల్లోని సౌరభాన్ని కూడా మోసుకువస్తోంది.

చెవి దగ్గరగావచ్చి దోమలు తీయగా గానం చేస్తున్నవి. అయినా నాకు నిద్ర ముంచుకొచ్చింది.

అలవాటు లేనిది అర్ధరాత్రివేళ మెలుకువ వచ్చింది. 'ఎందు కొచ్చింది చెప్మా' అనుకొనేంతలో పైనుంచి ఒక నీటిచుక్క కాలిమీద పడింది. పడిన అరనిముషంలో మళ్ళీ పడింది. లేచి కూర్చొని చేయిపెట్టి తడిమి చూశాను. జానెడుమేర బట్టలన్నీ తడిసి పోయాయి. బయట వర్షంకురుస్తోంది. లాభం లేదనుకొని మంచాన్ని కాస్త వెనక్కి జరిపాను. తీరా పడుకోనిచ్చి సరిగ్గా కడుపుమీద విడవకుండా పడ్డాయి. అసలే లాభం లేదనుకొని మళ్లా యథాస్థానానికి తీసుకువచ్చి తల కింద దిండులలో ఒకటితీసి చినుకులు పడుతున్న చోట పెట్టి పడుకొన్నాను.

"తయారు చేశానండి!—అయ్యా... అర్జంటు కాగితాలన్నీ రేపు చూసుకొంటానండి—" కలవరిస్తున్నాడు వెంకటేశం.

"ఏడిల్లు బంగారంకానూ! నిద్దర్లోకూడా ఆఫీసు ఒదల్లే"దనుకుంటూ నిద్రపోయాను.

..........................

మెలుకువ వచ్చేసరికి ఎనిమిదయింది. లేచి మొహం కడుక్కుంటూ వెంకటేశం ఏడని అడిగాను. 'మామూలుగా ఏడున్నరకే వెళ్లా'రంది సుభద్ర.

స్నానంచేసి, కాఫీతాగి సుభద్రతో చెప్పేసి ఆఫీసుకెళ్లాను. తాసిల్దారు గదిలో ఆయన చుట్టూ గుమాస్తాలు నిలబడి వున్నారు.

"ఇదిగో! ఇవన్నీ స్పెషల్సు. ఎవరివి వాళ్లు తీసుకొని వెళ్లండి" అన్నాడాయన.

కాగితాలు తీసుకొని మావాడు బైటికి వచ్చాడు.

'నేను వెడుతున్నానురా! ఏం చెప్పమంటావ్?' అన్నాను.

'పరిస్థితులన్నీ చూశావుగా! ప్రత్యేకించి చెప్పవలసిం దేమీ లే'దన్నాడు. 'సరే' అని చెప్పి బయటికి వచ్చాను. గేటుదాటి రోడ్డుమీదపడి టైమ్ చూశాను. తొమ్మిదయింది. గబగబా బస్సుస్టాండుకేసి నడిచాను. ★

# జగన్నాథమాహాత్మ్యం

గ్రీష్మం దాటింది, వర్షఋతువు ప్రవేశించింది. జడిజడివాన లన్నీ కుండపోతలుగా మారాయి. నీటి ధారలకి తోడు నీలికొండల్లో పుట్టిన శీతగాలులు హూంకరిస్తూ వీస్తున్నాయి. అప్పుడే తెలతెలవారుతోంది.

రోజూ యీపాటికి లేచి కాలకృత్యాలు తీర్చుకొని పూజాద్రవ్యాలు సమకూర్చుకొనే జగద్బంధునికి అప్పుడే మెలకువ వచ్చింది. కంగారుగా లేచేడు. "ఇన్ని సంవత్సరాలుగా శ్రీ జగన్నాథుని సేవ చేస్తున్నానన్న మాటేగాని యిదివర కెన్నడూ యింత ఆలస్యంగా లేచిన పాపాన పోలేదు," అనుకుని పక్కమడిచి ఒకమూలపడేసి, "వెధవశరీరం! నిద్రా దేవత ఒడిలో ఒరిగి మత్తెక్కి ప్రభుపూజా సమయమే మర్చిపోయి, యీ వేళింత మందగొండిగా తయారయిందేం చెప్మా!"అని శరీర దౌర్బల్యాన్ని తిట్టుకుంటూ వేగంగా కాలకృత్యాలు ముగించి గుడిదేవిడీ ద్వారం బాహాటంగా తెరిచేడు. అప్పటి కప్పుడే భాస్కరు డుదయించెడు. భాస్కరుని పసిడి కిరణాలు గుడిలోనికి చొచ్చుకొని గర్భగుడిని దాటి శ్రీ జగన్నాథ, బలరామ, సుభద్రల పాదాలవరకు ప్రాకేయి. జగద్బంధునికి వేదన రెక్కువయింది. ఎప్పుడూ యింత ఆలస్యమవలేదు. త్వరగా సంధ్యావందనం ముగించుకొని ప్రాంగణమందలి మొదటి ద్వారమున వ్రేలాడుతున్న క్రిందటి దినపు మామిడి తోరణం తీసి పారవైచి తిరిగి కొత్త తోరణంకట్టేడు. వయస్సు మళ్ళిన ఆవృద్ధుని కంత సత్తువెక్కడిదో! అక్కణ్ణుంచి పరుగు పరుగున లోపలికిపోయి గూట్లో పళ్ళెం తీసి దానితో చందనం, కస్తూరి మొదలైనవి, అగరు కర్పూరాదిధూపములు, కుంకుమ పసుపు మొదలగు పూజా ద్రవ్యములు నింపి స్వామి సాన్నిధ్యమున ఆయత్తపరచి యేమీ తోచక మతిపోయినవానికి మల్లే కొంతవరకు అట్టే నిల్చిపోయేడు, తొందరపాటులో యే పనీ తర్వాత యేపనిచేయాలో తోచకుండా వుంది. రోజూ ఈపాటికి సహస్రనామపూజ కూడా అయిపోయి శ్రీ జగన్నాథ స్వామి వారికి నైవేద్యం పెట్టి కూర్చుండేవాడు. ఇక ఇప్పుడు చేయవలసింది గుడివెనుక భాగమున గల తోటలో పువ్వులు కోయడం, పూజ ఆరంభించడం.

పువ్వుల బుట్ట పట్టుకొని జగద్బంధుడు తోటలోనికి వెళ్ళుతున్న సమయాన అల్లంత దూరాన్నుంచి వినబడింది కంఖారావం. మరికొన్ని క్షణాలకే ఒక రాజభటుడు గుడి ముందు గుర్రాన్ని ఆపాడు. "మహావిక్రములు, అజేయులు, సకలశాస్త్ర కోవిదులు, ప్రజానురంజకులు ఉత్కళ దేశాధిపతులు అగు శ్రీ శ్రీ శ్రీ ప్రతాపరుద్ర మహారాజులుంగారు వేంచేస్తున్నారు. స్వామివారి ప్రసాదము స్వీకరించి తిరిగి కోటకు మరలిపోదురు." గుఱ్ఱం దిగి జగద్బంధునికి నమస్కరించి చెప్పాడు వార్తాహరుడు.

జగద్బంధునికి పై ప్రాణాలు పైనే పోయాయి. శరీరమంతా ఒక్కసారి ఒణికిపోయింది. ఉన్నచోటునుండి కదల్లేకపోయేడు.

కూరపాటి
వెంకటు రంగారావు

"ఒకరోజు ముందుగా నేనా తెలియపరచడు; ఇప్పటికింకా పూవులు కోయలేదు; పూజా లేదు - గీజా లేదు. మహారాజు వచ్చేస్తున్నాడు. ఇంతటి ఆలస్యానికి మహారాజు కేకవెయ్యక మానడు. రాగానే స్వామిప్రసాదము అడుగుతాడు. ఇప్పుడు మహారాజుకి యే మిచ్చి ఆశీర్వదించను? పుష్పాలే ఆశీర్వాద వస్తువులు కదా? పువ్వులు కోసి తెచ్చేటప్పటికి మరికాస్త ఆలస్యం అవుతుంది." అంటూ ఆయన శ్రీ జగన్నాథునికేసి అట్టే చూస్తూ నిలుచుండి పోయేడు. కంఠం బరువెక్కింది. అప్రయత్నంగా వెలువడిన కన్నీళ్ళను తుడుచుకుంటూ "హే! దేవా! ఇన్నాళ్ళుగా నా సర్వశక్తులు ధారపోసి కించిత్తు దోషమేనా లేకుండా మీ సేవ చేసుకుంటున్నాను. ఈవేళ యేదో కర్మవశాత్తు ఆలస్యమవడం, అందులో ఆకస్మికంగా మహారాజు—ఈ రోజే రావటము—ఇదంతా మహావిపత్తుకే వచ్చింది. నా సర్వనాశనానికి యిదంతా దాపురించింది. హే! జగన్నాథా! నన్ను మహారాజు క్రోధం నుండి రక్షించేభారం నీదే!" అంటూ జగన్నాథునికిసాష్టాంగ పడ్డాడు. అప్పటికప్పుడే మహారాజు గుడిని సమీపించేడు. జగద్బంధుడు, "స్వామీ! ఏమిజరిగినా నీదేభారము" అంటూ తన తలలోని క్రిందటిదినపు పూజా పుష్పములు జాగ్రత్తగా తీసి స్వామివారి శిరమునం దుంచేడు.

మహారాజును లోనికి తోడితేవడానికై జగద్బంధుడు గుడిప్రాంగణమునకు వచ్చేడు. మహారాజు అప్పుడే పంచకల్యాణి దిగి పాదుకలుద్వార ముఖమున వదిలి లోనికివచ్చేడు.

జగద్బంధుడు "రండీ! మహారాజా!" అంటూ ప్రతాపరుద్రుని స్వామిసాన్నిధ్యానికి తోడ్కొని పోయాడు.

మహారాజు యధావిధిగా జగన్నాథుని సాష్టాంగపడి కొద్ది క్షణాలు మౌనముద్రలో శ్రీ జగన్నాథుని భజించి లేచికూర్చుని పుష్ప ప్రసాదమునకు దోసిలి ఒగ్గేడు.

జగద్బంధుడు శఠకోపంతో మహారాజును ఆశీర్వదించి మంత్రాలు జపిస్తూ శ్రీ జగన్నాథుని శిరమునుండి పుష్పంతీసి మహారాజు దోసిటలో పెట్టేడు. ప్రతాపరుద్రుడు పూజా పుష్పమును కళ్ళకద్దుకొని దానిని జాగ్రతపరిచి జగద్బంధునివద్ద సెలవుతీసుకొని పంచకల్యాణినెక్కి భటులతో తిరిగి తన నగరానికి తరలిపోయేడు.

కొలువు కూటమున సింహాసనారూఢుడైన ప్రతాపరుద్రుడు అప్రయత్నముగా పూజా పుష్పమును చేతపట్టుకొని కొంచెం సేపు అట్టే పరికించసాగాడు. మహారాజు దృష్టి తిన్నగా పుష్పంలో చిక్కుకొనివున్న రెండు మూడు తలవెంట్రుకలమీద పడింది. "ఎటువంటి విపరీత మిది! మహాప్రభువు శ్రీ జగన్నాథస్వామి శిరః పుష్పమా! అటువంటి పుష్పంలో యీ తలవెంట్రుక లెట్లా వచ్చేయి? ఇదేదో బాగా నిగూఢంగా గ్రహించవలసిన విషయమే?" ఆలోచించసాగాడు. ఆలోచించినకొద్దీ ఆయన ముఖాకృతి మహాభయంకరంగా తయారవుతోంది. "పొండి! ఇప్పుడే పొండి! శ్రీ ధామపురి పోయి ఆ పూజారి జగద్బంధుని యిక్కడకు యీడ్చుకురండి. ఒకవేళ దేవాలయంలో లేనిచో ఎక్కడున్నా సరే వెతికి తీసుకురండి. ఆలస్యంచేశారా! సర్వనాశనం జరుగుతుంది

# ★ జగన్నాథ మాహాత్మ్యం ★

వెళ్ళండి" అంటూ దూతలకి ఆదేశ మిచ్చి పురి మేడు.

రాజాజ్ఞ పొందడమేమిటి అనుచరులు కొద్దిక్షణాల్లోనే పూజారి జగద్వంధుని గుడి నుండి తీసుకువచ్చి మహారాజు యెదుట



పెట్టేరు. జగద్వంధుని చూడగానే ప్రతాప రుద్రుడు రోషక్రోక్కిన క్రోధముకు మల్లే బుసలుకొడుతూ అడిగేడు. "పూజారీ! ఒక్క విషయం చెప్పు! ప్రభువు శ్రీ జగన్నాథస్వామి వారి తలమీద తలవెంట్రుక లెప్పుడు పుట్టేయి? నీ ప్రాణంమీద ఆశ వున్నట్లయితే సరైన సమాధానం చెప్తావు. లేకపోతే నీకు మరణదండన తప్పదు. ఇదిగో! ఇటుచూడు! ఇది నీవిచ్చిన స్వామి వారి ప్రసాద పుష్పం. దీంట్లో రెండు తల వెంట్రుకలు ఎట్లావచ్చేయనీ...?

జగద్వంధునికి ప్రాణాలు లేవు. ఇట్లా జరుగుతుందని తను స్వప్నంలోనూ అనుకో లేదు. ఇది కేవలం ఆ జగ్గని లీలే అనుకు న్నాడు. జగద్వంధుడు మౌనంగా ఆత్మ నివేదన చేసుకుంటూ భగవంతుని ధ్యానింప సాగాడు, "హే ప్రభూ! నన్ను రక్షించు! ప్రతాపరుద్రుని చేతుల్లో ప్రాణం పోడం నాకిష్టంలేదు. ఇప్పుడుకాని రక్షింపకపోతే చావు తథ్యం. ప్రభూ! నేను క్రూరంగా వధింపబడితే తమ భక్త బృందమునకు లోపము వాటిల్లుతుందని కాదు! కాని తమ సేవకుడు ఒక రాజుచేతిలో రాజదండన పేరుమీదుగా తుచ్ఛంగా చావడం మహా లజ్జాకరమైన విషయం."

ఆత్మనివేదనానంతరం జగద్వంధుడు మనస్సు గటిచేసుకున్నాడు. నిర్భయంగా చెప్పేడు. "మహారాజా! స్వామివారి తల మీద వెంట్రుకలు మొలిచాయి. అది మీ రెరుగరు."

"ఓ! అలాగా! మరయితే చూపించ గలవా?" అడిగేడు మహారాజు.

"తప్పక చూపిస్తా మహారాజా. చూపించ లేకపోతే మీ రేశిక్ష విధించినా అవశ్యం శిరసా వహిస్తా" అనిచెప్పి జగద్వంధుడు అక్కణ్ణుంచి తిన్నగా యింటిముఖం పట్టక దేవాలయమునకు పోయేడు. అర్చన ముగిసిన పిదప స్వామిముందు చతికిలపడ్డాడు. ఆయనలో జవసత్వాలు సన్నగిలుతున్నాయి. కళ్లు చెమ్మగిల్లుతున్నాయి. గద్గదకంఠంతో స్వామికి విన్నవించుకున్నాడు: "స్వామీ! తమరు సర్వాంతర్యాములు. నేనేం చెప్ప గలను? తమ సేవకపదవిని పొంది గర్వించేను. నేను మీ మహత్తును భంగపరిచేటట్లు నా శిరఃపుష్పం మీ తలమీద పెట్టేను. హే ప్రభూ! తమ చక్రంతో యీ మహాపరాధి శిరస్సు ఛేదించండి! అనేకదా మీ కోరిక కాని పరిస్థితి ఆలోచించండి! ఇక తెల్లవారడానికి యీ రాత్రి మిగిలింది. ఈలోపునే తమరు నాపై కృప చూప

నట్లయితే నేను గరళం త్రాగి ప్రాణ త్యాగం చేసుకుంటా."

శ్రీ జగన్నాథుని కొంతవరకు ఆ విధంగా వేడుకొని ఆఖరిసారిగా ఆయన కాళ్ళమీద పడి తన్మయతచెంది తిరిగి కొంతసేపటికి లేచి ▪ కటికచీకటిలో ఇంటిముఖం పట్టేడు. ఇల్లు చేరడంతోటే భోజనం మాని విశ్రాం సిద్ధపరచుకొని శ్రీహరిని తలచుకుంటూ శయ్యమీద వ్రాలేడు. బాలడమే తడవుగా నిద్రాదేవత కరుణించి తన ఒడిలోకి లాక్కుంది.

సర్వాంతర్యామి శ్రీ జగన్నాథునికి యిప్పుడు చైతన్యము కలిగింది. స్వప్న రూపంలో శ్రీహరి జగద్వంధుని శయ్యాగారము ప్రవేశించి కృపారసం చిలుకరించేడు. "పూజారీ! నీవు నా పరమభక్తుండవు. నీ కింత విచార మెందుకు? ఒక మిథ్యావిషయానికి యింత భయమా? నా శిరమున కేశములు లేవనా? ఇదిగో! ఇటు చూడు! నా తల నల్లని వెంట్రుకలతో ఎలా నిగనిగ లాడుతోందో! నువ్వు లేచివచ్చి చూడు! రాజుకూడా చూపించి వాని సంశయం కూడా నివారించు" అంటూ శ్రీహరి అంతర్ధానమయ్యేడు.

శ్రీ జగన్నాథుని అంతర్ధానముతో జగద్వంధుని స్వప్నంకూడా మాయమయింది. ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచి చుట్టూ కలియచూసేడు జగద్వంధుడు. ఏమీ లేదు. అర్ధరాత్రి అనేనా వెనుదీయక స్నానం చేసేడు. బయటికివచ్చి ఆకాశంవంక చూసేడు. తెల్లవారడానికి ఒక్క జామురాత్రి గడవాలి. ▪ సమయంలో గుడిద్వారములు తెరవడం ధర్మవిరుద్ధం. కాని నియమవిరుద్ధమయినప్పటికీ జగద్వంధునియందుగల విశ్వాసముచేత అక్కడి పహరాదారులు గుడితలుపులు తెరచేరు.

గుడిలో అడుగు పెట్టడంతోటే మహాఆత్రంగా శ్రీ స్వామివారి మస్తకం పరికించేడు జగద్వంధుడు. ఇంకేముంది? సంతోష సంభ్రమాలతో స్తంభించిపోయేడు. ప్రభు మస్తకం శిరోజపూరితమయివుంది. ఆ కేశ సముదాయం రంగురంగుల పుష్పాలతో శోభాయమానంగావుంది. కేశములు మెరుస్తున్నాయి. జగద్వంధుడు సంశయ హీనుడై మహదానందంలో పూజాద్రవ్యము లన్నీ సమకూర్చుకొని దేవార్చన ప్రారంభించేడు.

ఇక్కడ మరొకవైపు మహారాజు తెల్లవారీ తెల్లవారడంతోటే అశ్వారూఢుడై గుడికి బయలుదేరేను. బయట గుర్రందిగి లోనికిపోతూ తన కెదురొస్తున్న జగద్వంధుని ప్రశ్నించేడు. "ఏది! మీ శ్రీ జగన్నాథుని శిరోజాలేవీ? చూపించండి బాబూ!"

"మీరే చూడండి మహారాజా! స్వామి మీ యెదురుగానే వున్నాడుకదా! మీరే చూడండి" అంటూ మహారాజుని జగన్నాథుని యెదురుగా తీసుకుపోయేడు జగద్బంధుడు.

"బాగు! బాగు!" అంటూ నిశ్చేష్టుడై నిలబడిపోయేడు ప్రతాపరుద్రుడు; భగవంతుని శిరమున వుహించజాలని పొడుగాటి శిరోజాల్ని చూస్తూ. కానిఆయనలో ఇంకా యింకా సంశయం ద్యోతకమవుతోంది. తిరిగి ప్రశ్నించేడు—"విప్రవరా! నిజం చెప్పండి! శిరోజాలు కృత్రిమమయినవా? అంటించినవి కాదుకదా?"

"అంత అపనమ్మకమయితే స్వయంగా పరీక్షచేసి చూడండి మహారాజా!" అన్నాడు గంభీరంగా జగద్బంధుడు.

"సరే!" అంటూ ప్రతాపరుద్రుడు రెండడుగులు ముందుకు వేసేడు. బయట ఆకాశం మేఘావృతమై, మెరుపులతో, భూమి దద్దరిల్లేటట్లు ఉరుముతోంది. ఝంఝామారుతం ప్రచండంగా వీస్తూ మహా వృక్షాల్ని సహితం కూల్చేస్తుంది. గుడిలోని గంటలు వాటంతటవే గుండెలు పగిలేటట్టు మహాభయంకరంగా కొట్టుకుంటున్నాయి. ప్రళయం ముంచుకొచ్చినట్టుంది. ప్రతాపరుద్రుడు ఒక్కగంతులో శ్రీ జగన్నాథస్వామి శిరమును తాకి కొన్ని కేశములను పట్టుకొని లాగడమే తడవుగా స్వామివారి మస్తకమునుండి రక్తము వెల్లువగా ప్రవహించి ప్రతాపరుద్రుని పాదాలుసహితం తడుపసాగింది. మహారాజు ఒక్కసారిగా క్రిందపడి రోదనచేస్తూ కంపించిపోయేడు. "పూజారి మహాశయా! క్షమించు-క్షమించు, నేను చాలా మూర్ఖుణ్ణి—నాశరీరం చెప్పలేని తాపంతో భయంకరంగా దహించుకుపోతోంది. నేను మహాపరాధిని. స్వామివారికి తన సేవకులైన మీయందింతదయ వుంటుందని యింతవరకు నాకు తెలీదు. కాని ఇప్పుడు తెలిసింది. భగవంతుడు భక్తునికి అభిన్నుడు. నేను భగవంతుని అపరాధినేకాక భగవద్భక్తుని అపరాధినికూడా! ఇప్పుడు నన్ను మహాపాతకమునుండి రక్షించేవారెవ్వరు? హరిభక్తాగ్రేసరా! నన్ను రక్షించేభారం నీదే" అంటూ జగద్బంధుని కాళ్ళమీద పడ్డాడు.

మహారాజుని లేవదీస్తూ మందహాసవదనంతో బోధించసాగాడు భక్తాగ్రేసరుడు జగద్బంధుడు—"దండధారీ! నీకు శాంతి చేకూరుగాక! ఇదంతా నీ దోషంకాదు. నాదే. నేను కూడా కరుణాసముద్రుడు శ్రీ జగన్నాథస్వామి మాహాత్మ్యం తెలిసికోలేకపోయేను. కాని ఆయన నా అపరాధాన్ని మన్నించి తన కృపావైభవాన్ని నిరూపించారు. భగవంతుడు తన భక్తరక్షణార్థం ఏం చెయ్యలేడూ?"

ఇట్లా యిరువురిమధ్యా సంభాషణ సాగుతూండగానే యిద్దరూ చూస్తూండగానే శ్రీ జగన్నాథుని శిరోజాలు మాయమయినవి. అవి యెప్పటికీ అంతర్థానమయినవి అచూకీయే లేదు.

పతితపావనుడైన శ్రీ జగన్నాథుని అద్భుతలీలావైచిత్ర్యాన్ని తిలకించిన ప్రతాపరుద్రుని విస్మయానికి మేరలేదు. ఈలోపుగానే అనేకులు అక్కడకు చేరేరు. అందరూ—"ప్రభూ! తమరు సర్వసమర్థులు. స్వామీ! మా మహారాజు అపరాధము మన్నించండి," అని జగన్నాథుని ప్రార్థించారు.

ఆటుతర్వాత ప్రతాపరుద్రుడు బయటకు వచ్చి అనేక దాన ధర్మాలుచేసి, ధనకనక రత్నాలు పంచిపెట్టేడు.

అందరూ గుడిచుట్టూచేరి ఎలుగెత్తి ఇలా అరిచారు—"భక్తవత్సల భగవాన్-కీ-జై! అనాథనాథ! శ్రీహరికీ జై! భువనపావన శ్రీభక్తరాజ్ కీ జై. ★

[బెంగాలీ కథకు అనువాదం.]




గోపాలరావు వాళ్ళనాన్నతో వేరుపడ్డాడు.

వేరుపడడమంటే తనకిరావాల్సిన ఆస్తి తీసికోవటానికాదు; ఆస్తివిషయం ఎత్తుకోకుండానే కుటుంబానికైన అప్పునంతా నెత్తిన వేసుకొని ఇల్లువదలిపెట్టాడు. అయినా, అతను తండ్రితో తగవాడి వేరుపడినవాడే అయ్యాడు. దురదృష్టంకొద్దీ, పార్వతి కాపురానికి రావటమూ, అతను నాన్నతో పోట్లాడి వేరుపడటమూ అనుకోకుండా ఒకేసారి సంఘటిల్లినాయి. ఇద్దరికీ కాకతాళీయంగా సంభవించినా, ఎవరికితోచినట్లు వాళ్ళు అనుకొన్నారు.

అగ్నిగోళమైతే ఈనాడు బద్దలైందికాని, పరిస్థితులు ఏనాటినుంచో అవకాశంకోసం ఎదురుచూస్తున్నయ్. సరిగా మూడుసంవత్సరాలక్రితం గోపాలరావు ఎమ్.ఏ. చదువుతు

## పతాక

న్నప్పుడు కొడుకు ఇంకా చదవటం సుబ్బారావు కేమాత్రం ఇష్టంలేదు. చదువుకొని, కొడుకు వృద్ధిలోకివస్తేవద్దనేతండ్రి ఎవ్వరూ ఉండరుకాని, ఆర్థికమైన ఇబ్బందులు, గృహపరిస్థితి, అంతావివరంగా, కొడుకుతో చెప్పి 'ఇంతటితో తృప్తిపడు' అన్నాడు ఆయన. కాని గోపాలరావు బోలెడన్ని లెక్కలు ఏకరువుపెట్టి, చదువుకైన ఖర్చుని పెట్టుబడిగా చూడమనీ, చదువుని వ్యాపారంగా తీసుకోమనీ తండ్రితో పోరాడాడు. ఎలాఅయితేనేం, ఆఖరికి సమ్మతించాడు సుబ్బారావు. ఇందుకులోతిగా కారణంలేక పోలేదు. ఆయనదృష్టిలో ఒకసంబంధం ఉంది. ఆపిల్ల తల్లిదండ్రుల ఏకైకసంతానం. ఆమెని కోడలుగా తెచ్చుకుంటే బోలెడంత ఆస్తివస్తుంది. ఆరోజు వాడిమాట తను విన

కుంటే రేపు వాడు తనమాట వింటాడని ఏమి నమ్మకం?

అయినా, స్త్రీ వస్తే చేదవరికి కాని, అమ్మాయి అదోలాఉంటుంది. ఏదో ఫరవా లేదులే అని సరిపెట్టుకోవలసిందే. అందుకే, చేతిలో చిల్లిగవ్వ లేకున్నా, రెండో కొడుకు కాలేజీలో చదువుతున్నా, కూతురు పెళ్ళీడు కొచ్చి, సిద్ధంగాకూచున్నా గోపాలరావు చదువుకి సుబ్బారావు సమ్మతించాడు. అయితే అతను ఈ పెళ్ళివిషయం సూచనగానైనా కొడుకుతో అనలేదు; అందుక్కారణం తనకొడుకు తనమాట కెదురాడడనే ధీమాయే. కాని కథ అడ్డం తిరిగింది. గోపాలరావు ఆపిల్లని చచ్చినా చేసుకోను పొమ్మన్నాడు. సుబ్బారావు బతిమాలాడు. కుటుంబ వ్యవహారాలు విడమర్చి చెప్పాడు. తమ్ముడు చదువుతున్నాడు; చెల్లెలు పెళ్ళికి ఎదిగి ఉంది. బోలెడప్పులున్నయ్. పైగా తానింకో సంవత్సరం చదవాలి. ఇంత కుటుంబమూ, ఇన్ని ఖర్చులూ, అమటే చెక్కమీదే చెల్లు పోవాలి...గోపాలరావు కొంచెం వెనకాముందు ఆలోచించాడు. కాని, నిరానందకరమూ, కళావిహీనమూ, అయిన, ఆ అమ్మాయి మొఖం కలిపించి, అతని సడలిన నిశ్చయాన్ని మరోమారు దృఢం చేసింది. అతను మరోమారు 'నాకీ పిల్లవద్దు' అన్నాడు గట్టిగా.

అందమేమీ శాశ్వతమైన వస్తువుకాదు. అదేమీ కొఱుక్కు తినేది కాదు. అయినా, నామీద తన కొడుక్కెందుకో ఇంత వ్యామోహం! వాడికి తనమీద సానుభూతి లేదనుకొన్నాడు. ఒకవంక తండ్రి కష్టం చూస్తో, తన సుఖంకోసం పాకులాడే కొడుకు నేమనుకోవాలి? ఏమనుకున్నా సరే సుబ్బారావు ఈసారి ఓడి పోయాడు. అయితే ఈ ఓటమి అతని హృదయంలో ఒకమంటని ప్రజ్వలింపజేసింది. అతని మనస్సులో 'కొడుకుల్ని వృద్ధిలోకి తేవటమైతే తండ్రుల బాధ్యత ఔనుండేమో కాని, వాళ్ళనుంచి ప్రతిఫలం వాంఛించటం ఈ కాలానికి సరిపోదనే భావం బాగా నాటుకపోయింది. ఇది అతణ్ణి ఉదాసీనుడిగా చేసింది. ఇంచుమించుగా అతను అకర్మణ్యుడయ్యాడు.

వర్షాలు కురవక పంటలు సరిగా పండలేదు. పండిన గింజలైనా సరిగా విచారించుకోక పోవటంతో వచ్చే ఆదాయము తగ్గిపోయిందాయేడు. సుబ్బారావందుకేమీ విచారించలేదు. చేతిలో పైకం ఉంటే పంపుతాడు; లేకుంటే లేదు. తను మాత్రం అంతకంటే చేయగలిగిందేముంది కనక.

తమ్ముడు తండ్రినీ, అన్ననూ నిందించాడు మనస్సులో. తనకి తండ్రి, డబ్బు పంపకపోవటానికి అన్నే కారణమని అతని అభిప్రాయం. పైగావాడెంత తెలివికలవాడు? ఏదో అయథార్థమైన కారణంతో, సత్యము, నిత్యము, అయిన డబ్బును చేజేతులా పోగొట్టుకొన్నాడు!

ఏ ధ్యేయమతనికి ఉద్రేకాన్ని ప్రసాదించిందో ఏమోకాని, అతని పెళ్ళి పేరుతో పరీక్ష పోగొట్టుకున్నాడు. అతన్ని చూచి ప్రపంచం వికృతంగా నవ్వింది. జాలితో అతని వివేకవిహీనతకి నిట్టూర్చింది. గోపాలరావు తన దురదృష్టానికి విచారించాడు. బాధ్యతారహితంగా ప్రవర్తించిన దానికి తండ్రిని అభిశంసించాడు. 'తండ్రికే కాదు బాధ్యత; కొడుకులకూ ఉంది' అన్నాడు సుబ్బారావు. నాశక్తికొద్ది నా బాధ్యతని నిర్వహించాను. 'ఇక శక్తికిమించి నేనేమీ చెయ్యబోయ్యేదిలేదు' అన్నాడు.

తాను తప్పినా, తమ్ముడు ప్యాసు అయ్యాడు. వాణ్ణి నాతరవాత చదివించాలని గోపాలరావు ఉద్దేశం...కాని తండ్రి సమ్మతించలేదు. మళ్ళీ వాదాలు; ప్రతివాదాలు.

అయితే ఇంటికి కోడలు వస్తున్నదనే సంతోషంలో తాత్కాలికంగా, అన్ని అభిప్రాయభేదాల్ని విస్మరించి రెండో కొడుకు కాలేజీలో చదివేందుకు సుబ్బారావు సమ్మతించాడు. ఎలాగైతే నేమి, తమ్ముడు కాలేజీలో చేరాడు మెడిసిన్ చదివేందుకు.

గోపాలరావు కోరిక అంగీకరించి కట్నం కానుకలు లేకుండానే పార్వతిని కోడలిగా తెచ్చుకున్నాడు సుబ్బారావు. అసలు పార్వతిని చూచిన తరువాతే, ప్రసన్న వదనం, కాంతిపుంజాలైన నేత్రాల్ని చూచిన తరవాతే, ఆమెను కోడలుగా అంగీకరించాడు.

మళ్ళీ సంసారం శాంతంగా గడిచిపోతోంది. నిజానికి అలాఅనిపించినా, దాన్ని ప్రశాంతత అనే వీలులేదు. లోపల ఎన్నో అగ్నిగోళాలు రగుల్కొంటున్నయ్. ఏనాడో అవి బద్దలుకాక మానవు...

గోపాలరావు ఊరికే ఉంటున్నాడు. మధుకి (రెండో కొడుకుపేరు) నెలనెలా వందా యాభై పంపాలి. ఇక ఇంట్లో కొఱవలేకుండా రోజులు గడవాలి. ఇవ్వన్నీ ఈదుకువస్తూ కూతురికి పెళ్ళిచెయ్యాలి. బోలెడంత కట్నం ఇవ్వాలి. తను తీసుకోకున్నా, ఒకరికివ్వక తప్పదుకదా? ఎక్కడనుంచి తెస్తాడు?

చీకటి తెరలు సంధ్యాకాశాన్ని అలముకొన్నట్లుగా, విషాద ఛాయలు సుబ్బారావు వదనమ్మీద సుస్పష్టంగా కనిపిస్తున్నాయి. అతనిలో ఓర్పు తగ్గతోంది; చికాకు ఎక్కువౌతోంది. ఆరోజు వాయిదు వచ్చి బాకీవిషయం తేల్చెయ్యమన్నాడు. వడ్డీమీదవడ్డీ పెరగటమేకాని, ఇన్నాళ్లుగా ఒక్క చెల్లు అయినా వెయ్యలేదని కొంచెం నిష్ఠూరంగా మాట్లాడాడు. సుబ్బారావు తన కష్టసుఖాలను చెప్పుకొన్నాడు. అంతా విని, ఆ వడ్డీదాసు "ఇంత కష్టాల్లో ఉన్న వాళ్ళు రెండో ఆయన్ని చదువులకు పంపకుంటే ఏమ్మునిగిపోయింది పంతులూ! పెద్దాయన చదివి ఏం సంపాదిస్తున్నాడు గనుక?" అన్నాడు. అవును. నిజమే. వీడుఏంసంపాదిస్తున్నాడు? ఇక వాడుగాని తన్ను ఉద్ధరించడు.

ఆరోజంతా అతను రుసరుస లాడుతున్నాడు. రెండోకొడుక్కు సెలవలైపోయినాయి. డబ్బిస్తేకాలేజీకి వెళ్తానంటున్నాడు. అటు అప్పులు. ఇటు చదువు వయిపు 'నాన్నా ఏన్నేం చేస్తావు? ఎన్నాళ్ళు నాకీ చెఱ' అనిపించే కూతురు దీనాననం! అతనికి పిచ్చిపట్టింది. పిల్లిమీద ఎలకమీద పెట్టి అందర్నీ దీవించివదిలాడు. 'ఈ వెధవ మూలాన ఇంత అప్పు అయింది' అన్నాడు గోపాలరావునుచూచి. ఇలా అనటమేమంత అసహజం గాదు; ఇది పెద్దతప్పు కూడా కాదు. కాని, గోపాలరావు తండ్రితో వేరుపడవలసిన క్షణం ఆసన్నమైందనుకున్నాడు. అలా చేస్తే పైకి ఎవ్వరేమన్నా, తనకుటుంబ ఖర్చులన్నా తండ్రికి తప్పిపోతయ్యనుకున్నాడు. అతను నింపాదిగా 'మన అప్పు ఏమాత్రం వుంటుంది' అన్నాడు. 'అయిదు వేలు.' 'అంతా నా చదువుకే అయిందా' అన్నాడు. 'మరి దేనికంటావు' అన్నాడు తండ్రి. 'అయితే నాకైన అప్పు నేనే తీరుస్తానులే' అన్నాడు గోపాలరావు. సుబ్బారావు ఎగతాళిగా 'ఇంటిపేరు కస్తూరివారట. ఇంటిలో గబ్బిలాల కంపు' అన్నాడు.

తెల్లవారగానే ఒక బండితెచ్చి, రెండు ట్రంకులూ, బెడ్డింగూ బండిలో పెట్టించి తండ్రిదగ్గరకు వచ్చి, 'ఇక వస్తా నాన్నా, నేను పట్నం వెళుతున్నాను' అన్నాడు.

'ఏం, ఎందుకూ' అన్నాడు. సుబ్బారావు ఆశ్చర్యపోతూ.

'ఎన్నాళ్ళని ఇంట్లో కూచొని తినటం? ఏదయినా ఉద్యోగం చూచుకొందామనుకుంటున్నాను...ఇన్నాళ్లు నాకు సంతరించి ఇంతవాణ్ణి చేశావు. అబాకీ ఎలాగూ తీర్చు

 **తెగిన తీగలు** 

కోసను. కాని నా కోసం చేసిన బాకీలన్నా తీర్చాలని నా సంకల్పం,' అన్నాడు.

ఒక క్షణంపాటు పలక్కుండా ఊరుకుని 'సరే...వెళ్లు......ఈరోజు వెళ్ళగానే సరి కాదు. అన్నమాట [illegible]కోగలగాలి,' అన్నాడు కోపంతో. గోపాలరావు జవాబేమీ చెప్పలేదు. పోయి వాకిట్లో బండి దగ్గర నుంచున్నాడు.

తరవాత ఐదునిమిషాలకి పార్వతివచ్చింది, అడుగులో అడుగు వేసుకుంటూ. ఆమెను చూస్తున్నాడే కాని, అతని మనస్సు ఎక్కడో వుంది. దగ్గరకు వచ్చి, పాదాలు స్పృశించి, నమస్కారం చేసి 'వస్తా మామయ్యా, మమ్మల్ని ఆశీర్వదించండి' అంది. ఆమాటతో తెలివి తెచ్చుకుని, రుద్ధకంఠంతో 'నువ్వూ వెళ్లుతున్నావా అమ్మా' అన్నాడు. పార్వతి తల వంచుకొంది.

"మంచిది తల్లీ! వాడు ఒట్టి అమాయకుడు కొంచెం జాగ్రత్తగా చూచుకో" అన్నాడు. మళ్ళీ లోపలికి వెళ్ళి, 'పార్వతీ! ఓమాటు ఇల్లా రా' అని పిల్చాడు. ఆమె లోపలికివెళ్లి నుంచుంది. రెండు వందరూపాయల నోట్లు ఆమె చేతిలో పెట్టి 'ఇంతకంటె ప్రస్తుతం...' ఇక పూర్తి చేయకుండానే తలను మరోవైపు తిప్పుకున్నాడు. ఆమె మళ్లీ నమస్కారం చేసి వెళ్ళి బండి ఎక్కింది.

వాకిట్లో నుంచుని బండి కనిపించిందాకా చూచి, కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ భారతి వచ్చి తండ్రి దగ్గర ఓ చిన్న మూట ఉంచి, 'వదిన ఇమ్మంది' అంది. సుబ్బారావు విప్పి చూచాడు. తాను పార్వతికి పెట్టిన నగలు! అవ్వి తీసుకోలేదన్నమాట!



అతనికి కోపమూ, దుఃఖమూ పొంగి వచ్చాయి. పెదవులు వణికాయి. కళ్ళమీద సన్నని నీటిపొర కమ్మింది. కాని, భారతి ఓర్చుకోలేక 'నాన్నా' అని వెక్కి వెక్కి ఏడ్చింది.

'ఎందుకు నాన్నా విచారించటం! సొమ్ములు ఇచ్చిపోగానే, చేసిన అప్పు తీర్చగానే, తండ్రి ఋణం తీరుతుందని విశ్వసించే కొడుకు ఉన్నా ఒకటే, వెళ్ళినా ఒకటే!' అన్నాడు మధు. వచ్చి సుబ్బారావు వింతగా అదోలా చూచాడు కొడుకు ముఖంలోకి.

## 2

గోపాలరావు పార్వతిని పుట్టింటికి వెళ్ళమన్నాడు. ఆమె వెళ్లనంది. ఇద్దరూ పట్నం వెళ్లారు. ఏదో సత్రంలో ఓ రెండు గదులు తీసికొని అతను ఇంటికోసం బయలుదేరాడు. మూడు రోజుల తరవాత మాంబళంలో ఓ చిన్న వీధిలో రెండు గదులు దొరికాయి. అవే వంటకీ, సామానుకీ, పడక్కీ, అన్నిటికీ. ఇల్లు చూచి వచ్చి కావలసిన సామానులు వస్తువులూ అన్నీ కొనుక్కొని, నాలుగో రోజు సాయంకాలం కొత్త ఇంటిలో ప్రవేశించారు. చిన్నగదుల్లో ఉన్న కొద్ది సామానుసర్ది, వరాండా వైపున్న కిటికీలో కూచుని 'ఇల్లు బావుంది కదండీ' అంది పార్వతి. 'అవును! ఇంతకంటె మంచిది సంపాదించుకోలేనంతకాలం ఇది బాగుండక తప్పదు!' అన్నాడతను విచారంగా. 'ఏమో నబ్బా! నాకు మాత్రం బావున్నయ్ అసలిద్దటికి ఇంతకంటె పెద్దయిల్లు ఉన్నా బావుండదు. చిక్కు చిక్కు మంటో అదోలా ఉంటుంది, అందామె నవ్వుతో. గోపాలరావు మనస్సు ఎక్కడో ఉంది. ఆమె వచ్చేరాకపూర్వమే తా నిల్లు వదలి వచ్చేశాడు. లోకు లేమనుకొంటారు. అత నన్నాడు. 'పార్వతీ! నువ్వు నన్ను క్షమించాలి' అని.

"ఏం? ఎందుకు?"

"నువ్వు రాగానే ఇలా ఇల్లు వదలి రావటం!...సుఖపెట్టే విషం ఇంక ఎలాగూ లేదు. నువ్వు నిందలు కూడా భరించక తప్పదు!'

"పోనివ్వండి! ఎవరికి తోచినట్లు వాళ్ళనుకుంటారు. అన్నట్లు రేపో రెండు కుర్చీలు పట్టండి. మీరా పెట్టెలమీద కూచోటం తప్పుతుంది" అంటూ ఇంకేమీ అతని జవాబు కెదురు చూడకుండా లోపలికి వెళ్లింది, వంట ప్రయత్నం చేసేందుకు. అతను బజారుకెళ్ళి రెండు పటాలు, టెంకాయి, ఊదొత్తులూ, పూలు పట్టుకు వచ్చి మేకులకి పటాలు తగిలించి పార్వతిని పిల్చాడు. ఆమె టెంకాయి కొట్టి హారతి ఇచ్చి భర్త కళ్ళకద్ది తనకళ్లకద్దుకుంది. చిఱునవ్వు వెన్నెలలు ఒలకపోస్తూ, సాక్షీ భూతంగా నిల్చిన ఆ లీలా రూపుని ఎదుట నతముఖులై, సాంజలులై, రెండు క్షణాలు నుంచున్నారు వాళ్లిద్దరూ.

అనంతమైన సంసారయాత్ర ఆ క్షణం నుంచీ ప్రారంభమైంది. వాళ్ళకు.

## 3

తండ్రి అంతవాడు కొడుకు, కొడుకు అంతవాడు తండ్రి. ఒకరితో ఒకరు ఘర్షణ పడి రచ్చకెక్కకుండా ముఖాలు చాటు చేసికొని విడిపోయ్యారు. ఆ రోజు వెళ్ళి ఈ నాటికి ఏడు సంవత్సరాలైనా ఒకర్ని ఒకరు కలుసుకోలేదు. ఆఖరికి (ఒకే ఒక సారి తప్ప) ఉత్తరాలైనా రాసుకొన్న పాపాన పోలేదు.

అదీ గోపాలరావే రాశాడు. దానికతను ప్రత్యుత్తరం ఆశించిందీ లేదు; సుబ్బారావు రాసిందీ లేదు. ఎడేళ్ళంటే స్వల్పమైనమానవ జీవితంలో, ఎన్నో మార్పులు జరగటానికి ఎంతో అవకాశం వుంది. సుబ్బారావు, కూతురు భారతి పెళ్ళి చేశాడు. పెళ్ళికి అందర్నీ పిలిచాడు కాని, కొడుకును పిలవలేదు. గోపాలరావు వెళ్ళిపోయిన రెండో యేడే ఆమె పెళ్ళి జరిగింది.

"నాన్నా! అన్నయ్యను పిలవ్వా అయితే,' అంది భారతి, విషణ్ణమూ మ్లానమూ అయిన కూతురు ముఖం చూచి, 'పిలిచినందువల్ల ప్రయోజనం ఉంటుందనుకుంటే, ఎందుకు పిలవను తల్లీ"

"పిలిచినా రాడనేనా?"

"ఎంత పిచ్చి, తల్లీ! నీకు?" అని రసహీనమైన నవ్వును బలవంతంగా పెదవులమీదకు తెచ్చుకుంటూ "ఇదుగో నావైపు చూడు. దేహం కుష్కించిపోయింది. ఒళ్ళు ముడతలు పడింది. ఒక్కణ్ణి! మీ అమ్మ పోయిన నాటినుంచీ మీ ముగుర్నీ, ఈ చేతులతో సాకి పెంచాను. అల్లాంటి నేను ఏదో కోపంతో ఒకమాట అన్నానే అనుకో. వాడు అంతతోనే, అన్ని బంధాలు తెగగోసుకొని వెళ్ళటమేనా?...పోనీ, తిరిగి రాకూడదా? నాఅంత వాడయ్యాడుకదా! ఈ పొలమూ, వ్యవహారము చూచుకొని, మధూను తనలా చెయ్యవలసిన బాధ్యత వాడికి లేదా?...ఇక వాణ్ణి, వాడంతట వాడుగా వరుణ్ణి వెతికి పెళ్ళి చెయ్యవలసిన చెల్లెలు పెళ్లికి, చుట్టం మాపుగా వచ్చి పొమ్మని ఎల్లా రాసేది? వాడుగా వస్తే మంచిది. రాకుంటే, నే చేయగలిగింది ఏమీ లేదు" అన్నాడు సుబ్బారావు.

భారతి చెమ్మగిల్లిన కళ్లను పమిట కొంగుతో తుడుచుకుంటూ "దుఃఖార్ద్రమైన ఈ మనస్సు—తనకెక్కడైతే ప్రేమ ఉందో, అక్కడే ఇంత కఠినమెందుకైందా ?" అనుకొంది.

భారతి గోపాలరావుకి రాసింది. "అన్నయ్యా! అన్నీ దగ్గరుండి నిర్వహించవలసినవాడవు. నీ ఒక్కగానొక్క చెల్లెలి పెళ్ళవుతూవుంటే, విరోధిలాగా దూరంగా ఉండాల్సిందేనా? వచ్చి ఆఖరికి ఆశీర్వదించి పోలేవా? నీ మనస్సింత బండబారిపోయిందా?...ఇప్పుడు రాకుంటే, నువ్వు నీ చెల్లెల్ని ఇక పోగొట్టుకొన్నట్లే" అని.

అయినా గోపాలరావు రాలేదు. అతని దగ్గర నుంచీ, ఓ ఉత్తరమూ, చిన్న పార్శెలూ వచ్చాయి. పార్శెల్లో, గోపాలరావూ, పార్వతీ, చంటిపాపా కలిసి తీయించుకొన్న ఫోటో, ఇంకేదో చెల్లెలికి చిన్న బహుమానం. "చెల్లీ! నేనక్కడకు వచ్చి మాత్రం చేసేదేముంది? ఆశీస్సులంటావా, అవి ఎప్పుడూ ఉన్నయ్. నే చేయకలిగిందదే కనక, మళ్ళీ ఓమాటు ఇవ్వగలిగిందే ఇస్తాను ... పెళ్ళికి రాకపోగానే నేను చెల్లెల్ని పోగొట్టుకుంటానా?....పోనీ నాకు చెల్లెలు లేకపోయినా, నా చెల్లెలికి అన్నాయ్ మాత్రం ఉంటాడు. నా చెల్లెలి మనస్సు నాకు బాగా తెలుసు" అని రాశాడు.

బంధువులంతా ఎవరికి తోచినట్లు వాళ్ళన్నారు. దుర్మార్గుడనీ, ద్రోహి అనీ, భార్యాలోలుడనీ... ఏవేవో, వారి వారి వాక్శుద్ధికీ, ధీశక్తికీ తగినట్లుగా అన్నారు. సుబ్బారావు ఈ నెపంతో అయినా కొడుకు వస్తాడనే ఆశించాడు తన హృదయం ఇంకా ఎండిపోలేదు. వాటి ద్వారాలు కొడుకు కోసం తెరుచుకొనే ఉన్నాయి.

అయినా గోపాలరావు రాలేదు. కూతురు పెళ్ళి అనే వ్యాజం, తాత్కాలికంగా విభిన్నతనందిన తండ్రీ కొడుకుల మనస్సుల్ని మళ్ళీ ఏకోన్ముఖం చేస్తుందనే, అతను ఆ క్షణంకోసం ఆశతో ఎదురుచూచాడు. ఆ క్షణమైతే వచ్చింది. కాని, అది ఆషాఢ మేఘంలా ఉరుముల్నీ మెరుపుల్నీ వెంట పెట్టుకొని వచ్చిందే కాని, జలబిందువుల్ని విదిలించలేదు. అందరూ కొడుకుని నిందిస్తూ ఉంటే, అతను గంభీరంగా వింటూ, 'తన కొడుకు ఇంత దుర్మార్గుడా' అని అనుకొన్నాడు.

భారతి అత్తవారింటికి వెళ్ళిపోయింది. అతను ఒంటరివాడైపోయ్యాడు. ఒకరోజు ఇంటిదగ్గర భోంచేస్తాడు. రెండో రోజు ఇంకెక్కడో! అతని దూరపుచుట్టం ఒకావిడ ఉంటానంటే వద్దని పంపివేశాడు. అత[illegible] ఒంటరి జీవితం, మమతావిహీనమై చవిటి పఱ్ఱలాగా కనిపించింది. అందులోనుంచి తపించేందుకు ఒకటే ఒక్క మార్గం ఉంది. మధుకు పెళ్ళి చేసి వాడి నాశ్రయించటమే. వాణ్ణి కదిలిస్తే చదువు పూర్తయిందాకా పెళ్ళిఅఖర్లేదన్నాడు.

కాని, ఇంతలో ఏదో కాలవ రావటం, తన డెబ్భై ఎకరాల పోరంబోకు మాగిలయ్యే సూచనలు కనిపించటం, ఆ పని తొందరలో పడి మళ్ళీ తన విషయం మరిచిపోయ్యాడు. పొలంలోని తాళ్లూ పేళ్లూ కొట్టించటం, గుంటా మిట్టా చదును చేయటం, నీళ్లకోసం అధికార్ల చుట్టూ తిరగటం, సంవత్సరానికో పరకగా మాగిలి చెయ్యటం అంతా పూర్తయ్యేసరికి మూడేళ్లు పట్టింది! మధు చదువు ఆ యేటితో పూర్తయింది. 'పెళ్ళిచేసికో' మన్నాడు. అతను 'అలాగే' అంటుండగా అతనికి ఏదో 'ఫారిన్' వెళ్ళి పెద్ద చదువులు చదివేందుకు 'స్కాలర్‌షిప్' వచ్చింది. సుబ్బారావు మధూని బతిమాలుకొన్నాడు వెళ్లొద్దని. కాని, మధు దృష్టి అంతా అమెరికామీదే! అతని కళ్ళు అప్పుడే ఉజ్వల భవిష్యత్తులోకి తొంగిచూస్తున్నయ్. అతను అమెరికా వెళ్లాడు.

## 4

గోపాలరావు ఇలు వదలి ఐదు ఏళ్లు అయింది...ఆ యేటితో అతను తీరుస్తానన్న బాకీ పూర్తిగా రద్దయింది. ఆఖరుసారిగా పంపవలసిన రూపాయలు పంపుతూ రెండోసారిగా తండ్రికి ఉత్తరం రాశాడు. "ఇంతటితో నేను తీరుస్తానన్న బాకీ అయితే తీర్చాను. నేను తీర్చుకోలేని ఋణం ఇంకోటి ఉంది. అవకాశం లభిస్తే నా వాంఛలోని సత్యాన్ని మాత్రం నిరూపించగలదే కాని, నన్ను ఋణవిముక్తుణ్ణి చేయలేదు..." అని రాశాడు. మొదటిసారి రాసింది, తాను మొదట ఉద్యోగంలో చేరినప్పుడూ తన వందరూపాయల జీతంలోంచి రు 25/-లు తండ్రికి పంపుతూ 'ఇంతకంటె ఎక్కువ పంపలేకపోతున్నాను. బహుశా ఈ సంవత్సరమంతా ఇంతేనేమో' అని రాశాడు. వంద రూపాయలతో, కొత్తగా కాపురానికి వచ్చిన పెళ్లాంతో, సంసారం గడుపుకొని, పాతిక రూపాయలు చెప్పినట్లుగా పంపాడంటే, సుబ్బారావు ఎంతో బాధపడ్డాడు. కాని, కోపం ఒకవంక పొంగివస్తోంటే, "ముష్టి పాతిక రూపాయలు పంపాడు. ఇక వీడు అప్పు తీరుస్తాడుట!" అన్నాడు. ఈ రోజు చెప్పినంతా తన కొడుకు చేసేసరికి, ఆయనకి తనమీద తనకే అవిశ్వాసం కలిగింది. అతని మనస్సులో ఇంకా కొడుకు వస్తాడనే ఆశ ఉంది. ఆయన దృష్టికి, కొడుకు వెళ్ళిపోయింది నిన్న మొన్నటి సంఘటనలాగే ఉంది.

పైగా తానిప్పుడు కొంచెం 'స్థితిపరు' డయ్యాడు కూడా. ఆ స్థితికోసమైనా తన దగ్గిరకు రాడా అని అనుకొన్నాడు. కాని, అలా ఎన్నటికీ జరగదని అతనికి నిశ్చయంగా తెలిసినా, అతను మాత్రం పిచ్చిగా, తన కొడుకు ఎన్నడో ఒకరోజు హఠాత్తుగా వస్తాడనే విశ్వసించాడు.

రెండేళ్ళకిందట - అంటే గోపాలరావు వెళ్ళిపోయిన మూడేళ్ళకి అన్నమాట- తనూ, పక్కింటి వెంకట్రావు ఓనాడు కూచొని కబుర్లు చెప్పుకుంటూంటే, కొడుకుదగ్గర నుంచి డబ్బు వచ్చింది. వెంకట్రావు ఆశ్చర్యపోయి, "మిమ్మల్ని వదిలేసి వెళ్ళిపోయినా, గోపాలరావుని మీ అబ్బాయి అని చెప్పుకోటంలో మీ కేమాత్రం అగౌరవం లేదు" అన్నాడు. సుబ్బారావు వెంకట్రావువైపు



# తెగిన తీగలు



కుతూహలంతో చూచాడు.

"ఈ నెల్లో ఆయన మీకు డబ్బేమీ పంప కుసుకున్నాను. ఇంకో నెలైతే అసలు పంపే వాళ్ళే కాదు. ఇంట్లో ఏమీ బాగాలేదు. పెద్దమ్మాయికి నెలనుంచి జ్వరం. మీ కోడలు నీళ్ళాడే రోజులు. ఇంట్లో ఖర్చులు-డాక్టరు బిల్లులు...అన్నీ [illegible] జీతం రాళ్ళమీదే కదా!" కొంచెమాగి, మళ్ళీ వెంటనే, "అబ్బాయి కూడా ఆ మధ్య కొద్దిగా జ్వరపడినట్లుంది. నే వెళ్ళిన నాటికి బాగానే ఉన్నారను కోండి" అన్నాడు.

"అయితే నాతో చెప్పావు కాదేమి వెంకట్రావు?"

"అని మాత్రమేమి లాభముంది? మీ రేమైనా వెళ్తారా పెట్టారా? ఎంతిన్నా మీ లో మీరు బాధపడ్తామంటారేగాని ఆయనదగ్గిఱకి వెళ్ళరుగదా!" అన్నాడు నవ్వుతో వెంకట్రావు.

మరుసటిరోజు సుబ్బారావు ఓ రెండు వందలు కొడుకు పేర మనియార్డరు చేశాడు. కాని, వారం తిరక్కపూర్వమే అవి తిరిగి వచ్చాయి!

గోపాలరావుకి డబ్బు అవసరం ఎంతగానో ఉంది. పార్వతికూడా "పోనీ ఇవ్వి అప్పుగానే పుచ్చుకోండి" అంది. అయినా గోపాలరావు ఒప్పుకోలేదు. తనమీద జాలి పడినవాడైతే ఓమాటు వచ్చిచూచి పోవచ్చు కదా ఇలా డబ్బుపంపేకన్నా. తాను పంపిన డబ్బు తిరిగిరావటంతో సుబ్బారావు భారంగా నిశ్వసించాడు. వాడు తనతో సంబంధాన్ని శాశ్వతంగా తెంచేసుకొన్నాడు. తానన్నికష్టాల్లో ఉన్నా ఒక్కముక్కైనా రాయలేదు! పైగా సర్కారు 'కిస్తు' లాగా తనకి పంపాడు! అసలు మమకారం ఉన్నచోట కదా కష్టసుఖాలు చెప్పుకొనేది! వాడు తనని తోసివేసే కొద్దీ తా నెందుకో ప్రాకులాడటం?

* * *



ఒంటరిగా వెళ్ళిన మధు ఇద్దరై తిరిగివచ్చాడు. అత నెవరినో పెళ్ళిచేసుకొని వచ్చాడు! సుబ్బారావు ఈ విషయం విని, వెన్నులో తీపులిన్నట్లు బాధపడ్డాడు. అతనికై తెఱచి ఉన్న ఒక్క ద్వారం కూడా మూసికొని పోయింది. ఇరకేమి మిగిలింది? ఆ ఒక్క ఆశాకిరణం నశించిపోయింది. అంతా చీకటి - భవిష్యత్తు ఒక చలికాలపు కాళరాత్రి! గోపాలరా వెంత కఠినుడు? పితృహృదయం ఏమాత్రం అర్థంచేసుకోలేదు!

ఏమైనా, గోపాలరావు తనదగ్గిఱకు రావలసిందే కాని, తానుమాత్రం వాడి దగ్గరకు వెళ్ళడు! ధర్మాన్ని విస్మరించి, పతితుడైన కొడుకు దగ్గఱకు వెళ్ళి, తాను భిక్షమెత్తలేడు. ఒకిది, అలా ఎన్నటికీ జరగదు! తానిలానే ఉంటాడు. ఏమి శాశ్వతం?

వర్షం కురవకుండానే, ఏ ఉఱ వచ్చినట్టుగా ఒకరోజు మధు ఒచ్చాడు, తనకి డబ్బుతో అవసరమైనపని ఉందని. ఓ పదివేలు కావాలట!

'అంత డెబ్బెక్కడ ఉంది.'

'పోనీ, పొల మమ్మితేనో?'

క్షణమాగి, 'సరే నాలుగుభాగాలు చేసి నీవంతు నీవమ్ముకొనివెళ్ళు' అన్నాడు సుబ్బారావు.

ఆరోజే నాలుగుభాగాలు చేసి, ఒకటి మధుకి; ఒకటి [illegible]రతికి రాసిచ్చాడు. మధు తనభాగ మమ్ముకొని వెళ్ళిపోయాడు!

సుబ్బారావు హృదయంలో, ఎల్లాగైనా గోపాలరావుని రప్పించుకోవాలనే సంకల్పం దృఢతరం ఔతోంది. కాని, అభిమానం అడ్డువస్తోంది. ఎవడైతే తనని తిరస్కరించి పోయాడో, వాడిమీదకే తన మనస్సెందుకు పోతోంది?

మధు వెళ్ళిపోయిన రోజున అతను జన్మలో మొదటిసారిగా ఏడ్చాడు. ఎవరో చేయిపెట్టి కడుపులో కలచినట్లుంది. భార్య గురు వచ్చింది. రోజు రోజంతా వెనకటి స్మృతులు అతన్ని చుట్టి ముట్టేవయ్. రాత్రి కలవరించాడు. భార్య కనిపించినట్లు ఆమె తనని ఆహ్వానించినట్లు! పెదవి విప్పి ఏదో చెప్పిందికాని, అతనికి తెలీలేదు!

మరుసటిరోజు ఎండబడి నిద్దర్లేచాడు. ఒళ్ళు బద్ధకంగా ఉంది. అతనికి మంచమ్మీదనుంచి లేవాలనిలేదు. ఏ కిసలయహస్తమో వచ్చి తనని స్పృశించితే ఎంత బావుంటుంది! తనకి మనమళ్ళూ, మనమరాళ్ళూ ఉన్నారు. అయినా వాళ్ళని తాను ఒక్కసారీ చూడలేదు!

ఎలాగైనా వాళ్ళని చూడాలి. కాని, ఎలా? ఎలా? పొలముమీదకి వెళ్ళాడు. వరి మోకాళ్ళెత్తున ఉంది. ఒకవెన్ను కోతకాదు. పాలుకాలుతోంది. అతనికి చంటిపాపల పాలబుగ్గలు కనిపించాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. ఒంటిగంట దాకా గట్లమ్మట తిరిగాడు. ఎవరో కనిపించి 'ఏంబాబూ! ఇంకా ఈడే తిరుగుతుండారు. భోంచేసినట్లు లేదు,' అన్నాడు. అవును, తానింకా భోజనం చేయలేదు. అడుగులో అడుగు వేసికొంటూ ఇంటికి వచ్చాడు. పగలు భోజనం చేయలేదు. రాత్రికి నాలుగు మెతుకులు కొతికాడు. రాత్రికి జ్వరం వచ్చింది. పొద్దున వెంకట్రావు వచ్చి గంజి, ఏదో నాటుమందూ తెప్పించి ఇచ్చాడు. అతను ఇంటికప్పు చూస్తూ పండుకొన్నాడు...మూడో రోజుకి జ్వరం తగ్గిపోయింది. కాని తలంతా, తలపులతో, బరువెక్కిపోయింది.

ఇక అతను ఓర్చుకోలేకపోయ్యాడు. జ్వరం అతని అంతరాత్మని శుద్ధిచేసింది. కొడుక్కి [illegible]త్తరం రాశాడు అతను. "జరిగిందేదో జరిగిపోయింది. ఏలాగూ [illegible] మాట నువ్వు చెల్లించుకొన్నావు ఇక రాకూడదా? జబ్బుతో చచ్చి సగమైపోయిన, ముసలి తండ్రి నోమాటు వచ్చి చూడకూడదా? ఇక్కడ ఉండకుంటే పోనీ. ఓ మాటురా'.. అని.

గోపాలరావు ఉత్తరం చూసుకొని కళ్ళనీళ్ళు కార్చాడు. మళ్ళీ తన త[illegible]డ్రితో కలిసి పొయ్యేక్షణం ఒచ్చిందనుకొన్నాడు. ...కాని, ఏడేళ్ళుగా ఆయన కష్టాలో ఉంటే, విస్మరించి, ఆయనవైపు తలఎత్తి చూడకుండా, ఈ రోజు ఆయన దగ్గిఱకు ఏ ముఖంతో వెళ్ళటం! వెళ్ళితే లోకు లేమనుకుంటారు? ఆస్తికోసం వెళ్ళాడనుకోరూ?" పితృప్రేమ ముందుకీ, అభిమానం వెనక్కీ లాగాయి. కాని, తండ్రి రోగంతో తీసుకొంటూ ఉంటే, తాను అభిమానంతో ఎలా ఊరుకోగలడు? పెళ్ళాం బిడ్డల్ని తీసికొని బయలుదేరాడు...... కాని మధ్యలోనే అతని అభిప్రాయం మారిపోయింది. తనకు తాను వెళ్ళి తన ముఖం తండ్రికి చూపలేడు. ఏ అదృష్టశక్తివల్లనో, నాన్నా తనూ ఒకచోట తారసిల్లటం ఘటిస్తే!

చంటి పాపని పార్వతి చేతికిచ్చి, 'ఎలాగైనా నాన్నని తీసుకొని రా' అని తాను పిల్లలతో తిరిగి వెళ్ళిపోయ్యాడు!

పార్వతి ఇంట్లోకి వెళ్ళేసరికి పడకకుర్చీలో పండుకొని ఉన్నాడు సుబ్బారావు. అతని ముఖం ముడతలు పడిపోయింది. ఒళ్ళు శుష్కించి ఉంది. ఎన్నాళ్ళనుంచో లంఘనాలు చేసినట్లున్నాడు. పార్వతి

(48-వ పేజీ చూడండి)

# ఆగిపోయిన నాకథ

సాయంకాలం ఐదు గంటలు కావస్తోంది.
ఆఫీసునుంచి ఇంటికి చేరాను.

తలుపు తీసి చిరిచి నవ్వులు నవ్వుతూ చేతిలోని మల్లెమొగ్గలపొట్లం అందుకుంది శ్రీమతి.

డ్రస్ మార్చుకున్నానో లేదో ఒకచేతిలో టిఫెను, ఇంకో చేతిలో కాఫీకప్పుతో వచ్చింది వయ్యారం ఒలకబోసుకుంటూ.

"కాస్త కూర్చోనిస్తావా లేదా?" అంటూ అందుకున్నాను. "ఈలోపల శ్రీవారికి కోపం వస్తే..." పూర్తిచేయబోతుంటే "శ్రీమతి వారు సేవచేస్తారు" అన్నాను.

"ఏమండీ! కూరలు తెచ్చారండీ"

"తమ రెప్పుడు చెప్పారండీ?"

"అట్లా అడుగుతారేమండీ! ఆఫీసుకు వెడుతూ మరచిపోతారేమోనని సంచీ కూడా తీసుకువెళ్లారు"

"అవును" అన్నాను గుర్తు చేసుకుని.

"ఇంతకీ సంచీ ఏం చేశారండీ?" ప్రశ్నించింది.

"ఆఫీసులో నా డ్రాయరులో దాచి ఉంటానులే!" అన్నాను.

"ఆదేం మనుషులండీ మీరు" ఖాళీప్లేటు, కప్పు తీసుకువెళ్ళింది.

పేపరు చూస్తున్నాను.

"ఇవాళేమైనా కూరలప్రాప్తి ఉందా?"

"ఈరోజుకి కాస్త నువ్వు తెచ్చుకో గూడదూ!"

"మరి మీరు తోడు వస్తే..." అంది ఓరకంట చూస్తూ.

"సంచీ ఇలా తే" అని సంచీ తీసుకుని పది అడుగులు నడిచానో, లేదో...

"ఏమండీ, మిమ్మల్నే..."

"మళ్ళీ ఏం మునిగింది?"

పంచదార అయిపోయింది. ఓ వీసె"

'అలాగే', అని పోయి తెచ్చాను.

మరల పేపరు చూస్తున్నాను.

"ఏమండీ? ఏమండీ?" వంట ఇంట్లోనుంచి.

"ఏమిటండీ అంత కంగారు."

"ఇది చూడండీ!"

"ఏమిటండీ అది?"

"ఈ ప్రకటన చూడండీ!" అంటూ తొందర తొందరగా వచ్చింది పంచదార పొట్లం కట్టిన పేపరు చూపించి. నిదానించి చూశాను. అది ఒక వారపత్రిక ప్రకటన......నుంచి కథలకు నాలుగు ప్రైజులిస్తామని ప్రకటన...

"మీరు ఒక కథ వ్రాసిపంపరాదటండీ."

"నేనా?...కథా?" అన్నాను అర్థంగాక.

"ఏమిటండీ అలా అంటారు" అంది గునుస్తూ.

"ఎలాగో కష్టపడి వ్రాశానే అనుకో..."

"మీకు తప్పకుండా ఫస్టుప్రైజు వస్తుంది"

"అలాగా?..." అని పేపరు చూస్తున్నాను...

"మిమ్మల్నే, వ్రాస్తారా, రాయరా?"

"ఓ, అలాగే," అన్నా, బాధ కాస్త తప్పుతుందని.

"ఇదిగో కాగితం, కలం" అంటూ తెచ్చింది.

ముళ్లపూడి సత్యనారాయణ

"లేడికి లేచిందే పరుగట...అలాగుంది నీ పని...నేనెన్నడైనా కథ వ్రాశానా! అందులో పోటీచేయమంటావు. నీకేమైనా మతిపోయిందా? అదేదో నీవే వ్రాసుకో" అన్నాను మరల పేపరు చూసుకుంటూ.

"సరేలెండి" అంటూ విసవిసా వంటగదిలోకి నడిచింది.

శ్రీమతికి కోపం వచ్చిందని తెలుపుటకై గిన్నెలు, గరిటెలు...వగైరా గణగణ మ్రోగుతున్నవి. అయినా ఆ కోటువాడికి బుద్ధి ఉండక్కర్లా! వాడికా పేపరుతప్ప ఇంకేం దొరకలా?

"భోజనానికి లేవమ్మ" సత్యభామ పోజులో.

ఎప్పుడూ కిలకిలానవ్వుతూ ఉండే శ్రీమతికి హఠాత్తుగా ఇంత కోపం ఎలావచ్చిందా అని ఆలోచనలో పడ్డాను...

"వినబడిందా?"

ఉలిక్కిపడి, "ఆ" అంటూ లేచాను.

భోజనం పూర్తిఅయింది. అది కావాలా, ఇది కావాలా, అని ఆమె అడగలేదు. నాకది కావాలని నేనూ పలుకలేదు.

ఆమె భోజనంకూడా పూర్తిఅయింది.

'మేముగూడా నీతో ఏకీభవిస్తా' మంటూ కంచాలు, పీటలు...టపటపమంటున్నవి.

"ఓ, భామామణీ! నీ అలుకకు కారణమెయ్యది?" అన్నా ముదకు.

"తమకు సర్వం విదితమే" అంది నొక్కుతూ.

"అదా! అయితే కాగితం, కలం తీసుకురా" అన్నా కోపంపోతుందేమోనని.

అర నిమిషంలో తీసుకు వచ్చిందది.

"ఏమి వ్రాయాలి? ఎలా వ్రాయాలి?" అడిగాను దేవిని. "నే చెబితే మీరు వ్రాస్తా రన్నమాట"

నే మాట్లాడలేదు......

"బి. ఏ. ప్యాసయినారు ... ఒక కథ వ్రాయలేరట..." నసుగుతోంది.

కాగితం, కలం తీసుకున్నాను.

కలం వదవదనంటోంది.

"నాకీ రాత్రి గడువియ్యి. ఆలోచించి రేపు ఉదయానికి నీ కోరిక తీర్చగలను..." అన్నాను.

"మీరు ఎంత మంచివారండీ" అంటూ నవ్వింది.

* * *

ఆ మర్నాడు...

"ఏడు గంటలైనా ఇంకా లేవరేమండీ?" లేవకుంటే ఏం ప్రమాదం వాటిల్లుతుందోనని చప్పున లేచి కూర్చొన్నాను.

ముఖప్రక్షాళనం కావించేసరికి తుండు గుడ్డతో వేచి ఉంది శ్రీమతి. తుడుచుకోటం పూర్తి అయేసరికి ఉప్మాప్లేటు, కాఫీ కప్పులతో తారసిల్లింది.

ఈ రోజున ప్రొద్దున్నే టిఫిను ఏమిటా, ఎన్నడూ లేనిది అని ఆలోచిస్తున్నాను.

"చప్పున కానీయండి"

"అలాగే, దేవీ!" అంటూ పూర్తిచేశాను.

రేజరుసెట్ తీసుకోబోతున్నాను.

కలం, కాగితాలతో ప్రత్యక్షమయింది.

గుర్తుకు వచ్చింది—రాత్రి వాగ్దానం. ఈ పూట టిఫెనుకు కారణం. ఏం వ్రాయాలి?

కాగితాలు, కలం తీసుకున్నా, ఇహ దేవి వంటగదికి పోతుందని.

కాని కదలేదు ఆమె. "ఇహ తమరు శెలవు తీసికోండి" అన్నాను.

"మీరు కాగితంమీద అక్షరం పెట్టండి" అంది. ఏం వ్రాయాలి?

# ★ ఆగిపోయిన నా కథ ★

భగవంతుని పేరు వ్రాస్తే ముక్తి వస్తుందని...అంటే ఆ దేవునివల్ల ముక్తి కాదు... ఈ దేవినుంచి ... విముక్తి వస్తుందని "సరస్వతి" అని వ్రాశాను.

దేవి వంటగది ప్రవేశం జరిగింది. నా చేతిలోని కాగితం డ్రాయరుమీద పడింది. కలం జేబులోకి వెళ్లింది. దృష్టిమటుకు వంటింటివైపుంది ఏ క్షణంలో వస్తుందోనని.

పది నిమిషాలు గడిచినవి.

శ్రీమతి ఇటువైపు వచ్చే సూచనలు లేవని తిరిగి రైటరు సెట్ మీద వేశాను.

"మళ్ళీ కదిలారేమండీ?" అంటూవచ్చింది స్నానకార్యం నిర్వర్తించుకుని.

ఏం చెప్పాలి? సమయానికి చిన్న అబద్ధం తోచింది.

"ఏమీ లేదు...పెన్సిలు అరిగిపోయింది చెక్కుకునేందుకు బ్లేడు తీయబోతున్నా" అన్నాను.

"అబద్ధాలాడటంలో గూడా నేర్పుందా అండీ" అంది కొంటెగా నవ్వుతూ.

నాకర్థం కాలేదు.

నా పరిస్థితి గ్రహించి "ఇంకా అర్థం కాలేదా...మీకు డిగ్రీ ఇచ్చిన వాడెవడండీ!" అంది క్రింది పెదవి పంటితో నొక్కుతుని వస్తున్న నవ్వునాపుకొని.

"మీరు పెన్నుతో వ్రాస్తుంటిరి. పెన్సిలు చెక్కాలంటారేమండీ!" అంది.

"ఓ, సారీ..." అంటూ యథాస్థానం ఆక్రమించా దేవి చూడకుండా జేబులో పెన్ను తీసి.

ఎందుకు వ్రాయాలంటే జవాబు దొరుకుతోందిగాని ఏం వ్రాయాలంటే ఏమీ తట్టటం లేదు.

"మీరు వ్రాస్తున్నది కథా, కథానికా లేక స్కెచ్చా" అంది క్రాస్ ఎగ్జామిను చేస్తున్న ధోరణిలో "ముద్దాయి నిర్దోషి" అందా మనుకున్నా. కాని మాట బయటకురాలేదు నాకా మాటకి అర్థం తెలియలేదు. కాని తప్పించుకునేందుకు కథ వ్రాస్తున్నా నన్నాను.

"కామెడీయా, ట్రాజెడీయా?" అంది టాయిలెట్ అవుతూ.

"కామెడీయే" నన్నాను.

"ఎంతవరకు వ్రాశారు?" అంటూ దగ్గరకు రాబోతోంది.

ఇంతలో ఆపద్బాంధవుడిలా నా ఫ్రెండు కృష్ణ గృహప్రవేశం, మాదేవి వంటగది ప్రవేశం ఏకకాలంలో జరిగాయి.

"రక్షించావురా బాబూ!" అని మెల్లిగా అనుకొని ఊపిరి పీల్చాను.

ఒక అరగంట వాడేదో వాగాడు "ఇక పోతా" అన్నాడు. "కాసేపుండరా!" అన్నా వంటింట్లోకి వినబడకుండా.

"కాదు, పనుంది పోయివస్తా" నన్నాడు కృష్ణ మెల్లిగా వాడి చెవిలో ఊది... "బయటపడే మార్గము చూడరా" అన్నా.

"నాతో అరకప్పు కాఫీ, [illegible]" అనబోతున్నాడు "మెల్లిగరా, లోపలకు వినబడుతుంది, అలాగే" అన్నాను.

"కాసేపు కూర్చో, గడ్డంగీక్కున్న పిదప నీ నాటకం మొదలిడుదువుగాని" అని చప్పున గడ్డంగీక్కున్నా.

కృష్ణ నాకో దేవదూత. మా శ్రీమతికో యమదూత. "కొద్దిగ పనుంది లోపలకు వస్తారూ!" అన్నగా శ్రీమతి కంఠం వంట గదినుంచి.

"వస్తున్నా..." అని "నీ డ్రామా కానీయి" అని మా వాడికి చెప్పిలోనికి వెళ్ళాను.

"సమయానికి దాపురించాడు......ఇహ అయ్యన్ను వెళ్ళమని చెప్పండి." అంది. 'అలాగే' అందా మనుకున్నా. కాని "ఎంత చెడ్డా స్నేహితుడుగదా" అన్నాను.

"నే పోయి చెప్పివస్తా..." అని బయలు దేరబోయింది. "మీ ఆజ్ఞ శిరసావహిస్తా" అన్నాను.

అంతలో "ఏరా! ఎంతసేపురా. అర్జంటుగా మీ ఆఫీసరు నిన్ను రమ్మనమని చెప్పమన్నాడు" అన్నాడు. ముందు గదిలోంచి కృష్ణ.

"ఆఁ వస్తున్నా ఐదు నిమిషాలలో..." అంటూ శ్రీమతి ముఖకవళికలు పరీక్షించక స్నానం ముగించి డ్రస్ వేసికొని "భోంచేయటానికి కిమాళ టైము లేదు. హోటలులో తింటా" అని చెప్పాను. ఆవిడతో.

"కథ ఎంతవరకు వ్రాశారూ?" అంది భోజనంమాట వినీ వినకట్లు.

"కడపటి ఘట్టంలో ఉంది. ఆఫీసునుంచి వచ్చినపిదప పూర్తిచేస్తా..." అని చల్లగా జారుకున్నా బ్రతుకు జీవుడా అని. నాలుగు అణాలతో మావాడి లంచం చెల్లించా.

ఆ పూట హోటలులో ఎంగిలి పడ్డాను.

సాయంకాలం ఐదుగంటలు కావస్తోంటే నా గుండె వేగం హెచ్చింది.

నా స్నేహితుడు శర్మ ఇంటికి వెళ్ళి ఏదైనా వాడు వ్రాసినకథ అడిగి తీసుకుపోదామని. సమయానికి వాడింట్లో లేడు. ఎనిమిదింటికిగాని రారని తెలిపింది వాడి అర్ధాంగి.

అప్పటివరకు పార్కులో గడిపి ఎనిమిది గంటలకు వాడింటికి వెళ్లాను. వాడిని చూసే సరికి కొంచెం కుదుటబడింది మనసు.

"ఏరా, బ్రదర్, మా ఆవిడ ఏదైనా కథ వ్రాయమని ఒకటే గోలచేస్తోంది. ఏం వ్రాసేందుకు కుదరటం లేదు. నువ్వు వ్రాసింది అచ్చుకాని దొకటి తగలెయ్. అది కాపీచేసి ఆవిడకు సమర్పించుకుంటా" అన్నాను వాడితో.

"ఓ, దానికేం" అంటూ ఒక కట్ట తెచ్చాడు ఏదో ఒకటి తీసుకోమని.

ఒకటి తీసుకుని జాగ్రత్తగా పాంటు జేబులో దాచి ఇంటికి చేరాను.

"ఇప్పటికి ఇల్లు కనబడిందిగావుల్ను" అంటూ తలుపులు తీసింది.

భోజనం పూర్తిచేశాను.

"ఆ కథ పూర్తిచేస్తారా?" అంది. ఏదో ఆలోచిస్తున్నా.

"రేపు సాయంకాలం పోస్టుచేస్తే ఎల్లుండి అంటే గడువు తేదీ కడటికి చేరుతుంది... ఈ పూట పూర్తిచేసి రేపు తప్పక పంపించండి..." అంది.

"తమరు విశ్రమించండి" అంటూ టేబులు ముందు కూర్చున్నాను, వస్తూ తెచ్చిన ఆనెల భారతి శ్రీమతికిచ్చి. భారతిలో ఐక్యమయింది దేవి- నేను చకచకా కాపీ చేయటం పూర్తిచేశాను ఆటంకం లేకుండా.

'చూడండి' అని నే కాపీచేసినది చూపించాను. శర్మ వ్రాసినది డ్రాయరులో ఉంది.

భారతి అచట పారేసి గబాలున వచ్చి చదివింది ఉత్సాహంగా గట్టిగా ఊపిరి పీల్చాను.

"ఇదేమిటండీ! మీరు కామెడీ వ్రాస్తున్నానని చెప్పి ట్రాజెడీ వ్రాశారు" అంది. అపుడు గుర్తుకువచ్చింది ఉదయం ఆమెతో కామెడీ మూడువంతులు పూర్తయింది అన్నమాట.

"ట్రాజెడీ అయితే బాగుంటుందని" అన్నా లేని ఉత్సాహం తెచ్చిపెట్టుకొని.

"బాగుందండి మీ తెలివి... ఓం ప్రథమంగా కథ వ్రాశారు. అందులో పోటీకి పంపుతున్నారు. అది ట్రాజెడీ అయితే... ఇంకేం... పెళ్ళికి వెడుతూ పిల్లిని చంకపెట్టుకు వెళ్ళినట్లుంటుంది..." అంటోంది ఏకధాటిగా.

"ఇహ అవి మంచినీళ్ళు పుచ్చుకోండి... దాన్ని కామెడీ చేస్తా ఇలాతే" అన్నా.

"ఊ" అని మరల భారతిలో మునిగింది శ్రీమతి. నేను చాల బాధపడ్డా. ట్రాజెడీను కామెడీ ఎలా చేయుటమా? అని.

అదృష్టవశాత్తు నిద్రాదేవి మాదేవిని వరించింది.

* * *

ఆ మర్నాడు...

"లేవండి! ఆరు దాటింది"

"ఊ" అని పసిగా నిద్రమత్తుతో

"కాఫీ చల్లారిపోతోంది లేద్దురూ!" జాలిగా.

"సరే" అని లేచి ఒళ్ళు విరుచుకుని పనులు పూర్తిచేసుకున్నాను.

వేడివేడి ఇడెన్లప్లేటు, కాఫీలతో ప్రత్యక్షమయింది దేవి.

అవి ఆరగించాను...

"కథ ఓసారి చదివిస్తా ఇలా తెండి" అంది.

ఏంచేయాలి?

"రాత్రి ఆ కథను మార్చలేదు. ఈపూట"

"అవున్లెండి. పసిపిల్లలాగా... కాసేపుకను మూశారో లేదో గోర్క మడిచారు..." అంది

"ఒకగంటలో పూర్తిచేస్తా, నీపని నువు చేసుకో" అన్నా కాస్త విశ్రాంతి వసుందని.

"నిన్నటలాగా ఎవరన్నా నిత్యవ. రాయుడు వస్తే పందుచూస్తారు. మీరు తలుపువేసుకుని వంటగదిలో కూర్చొని వ్రాయండి. ఎవరన్నావస్తే లేరని నే చెబుతా" అంది.

"ధంపావురో!" అందామనుకున్నా. కాని గొంతుక పూడిపోయింది.

కాగితాలు ముందరేసికొని వంటగదిలో సైతాయించాను.

ఐదు నిమిషాలు గడచినవి.

శ్రీమతి స్నానం పూర్తిచేసింది.

కథ మార్చడం నేనింకా మొదలిడలేదు. శ్రీమతి చూసినపుడల్లా ఏదో వ్రాస్తున్నట్లు నటించేవాడిని.

"మూర్తి ఉన్నాడండీ?" బయటనుంచి కృష్ణ కేక.

తలుపు తీద్దామని వెళ్ళబోతున్నా.

"తమరలా కూర్చోండి" అంది అర్ధాంగి గదిలోకిపోతూ.

"లేరండీ, బజారుకు వెళ్ళారు" కాని శ్రీమతి కోపగృహాము అలంకరిస్తుందేమోనని ఏమీ ఎరగనట్లు కూర్చొన్నా.

మొన్న చూసిన సినిమా కథ గుర్తుకు తెచ్చుకుని దానిలోని కామెడీని దీనిలో ఇరికించి ఎలా అయితేనేం పూర్తిచేసాను.

"భోంచేద్దురు గాని లేవండి" అంది.

పూర్తిచేశాను. భోజనం. దేవికూడా పనులు పూర్తిచేసుకుని రాగానే "నాకథ సమర్పించా" ఇష్టదైవాన్ని ప్రార్థించుకుని.

అంతా శ్రద్ధగా చదివి చివరకు "బ్బా" అంది పట్టలేదంటూ.

"ఏదో మొదటికథ" (తుదికథా అనుకోండి) వసిగాను.

"సరే, పంపండి" అంది ఉపాధ్యాయిని ఫోజులో.

"చిత్తం" అన్నాను శిష్యునిలా.

టైము చూశాను. పన్నెండు గంటలయింది. కాసేపు నడుం వాల్చాను. ఒకగంట కునుకు తీశానో లేదో "వెళ్ళి పోస్టుచేసి రద్దురూ!" అని లేపింది.

సరేనని రిక్షామీద పోస్టాఫీసుకు చేరాను. తొందర తొందరగా స్టాంపుల క్లర్కు దగరకు వెళ్లాను. తలుపులేసి ఉన్నవి ▪ పోస్టాఫీసులో ఒకడూ కనిపించలేదు.

పరికించి చూశాను. తాళం వేసిఉంది. అప్పుడు గుర్తుకువచ్చింది ఆ రోజు ఆదివారం అని.

"అవును లేకుంటే నేనీరోజు ఇంట్లో ఎందుకున్నా" అని నాలో నేను ప్రశ్నించుకుని కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరాను.

"అదేమిటండీ! కథ తిరిగి తెచ్చారేమండీ?" అంది ఆశ్చర్యపోతూ.

"నీ తెలివి తెల్లారినట్లే ఉంది. ఇవాళ ఆదివారం సెలవు. లేకుంటే ఇంట్లో నే నెలా ఉంటాను? పళ్ళు...పళ్ళు...నిద్ర పాడు చేసావు. పైగా మూడు రోజులనుంచీ నా దుంపతెంచావు అన్నా కోపంగా.

"తెలిసుండి మరెందుకు వెళ్లారు?" అంది.

నీవు వెళ్లమన్నావని" అని తప్పు ఆవిడ మీదకు తోశాను.

"చివరకి పని చేశారా, ఇంతా కథరాసి" అంది అమాయకంగా.

"నీకో మంచిమాట చెబుతా వింటావా?" అన్నాను.

"చెప్పండి" అంది.

"కాఫీ కావాలా"

"లేదు."

"ఈ కాగితాలతో కుంపటి వెలిగించు" అన్నాను అవి ఆమెకిచ్చి.

"ఏమిటండీ, ▪ పాడుమాటలు. ఓంప్రథమంగా వ్రాసినదాన్ని ఇలాచేస్తారా" అంది.

లేకుంటే నువ్వు పంపించుకోగాని నేనుమటుకు ఇంకే పత్రికకు పంపదలచుకోలేదు" అన్నాను.

"అంతే నంటారా!" అంది.

"అవును" అన్నాను.

"మూర్తి ఉన్నారండీ!" బయటనుంచి కృష్ణ.

"ఆ, వస్తున్నా..."...అంతే.

నా కథ ఆగిపోయింది......

ఆ మీదట ఆమె నాటికీ నేటికీ కథ వ్రాయమనలేదు... ★



# దేశం మొత్త[ం] ★ మనకృష్ణ

దక్షిణాపథంలో గోదావరి తరవాత పెద్ద నది కృష్ణానదే. ఆంధ్రుల చారిత్రిక వైభవానికి, సంస్కృతికి కృష్ణాతీరం పుట్టినిల్లు. శాతవాహన సామ్రాజ్యంనుంచి విజయనగర సామ్రాజ్యందాకా అనేక మహారాజ్యాలు ఈ నదీ తీరాన వర్ధిల్లి కాలగర్భములో అంతరించి పోయాయి. పంపా సరోవరము, విరూపాక్ష, శ్రీశైల తీర్థాలు ఈ నదీ తీరానికి చెందినవే. నాగార్జునకొండ, అమరావతివద్ద జరిగిన త్రవ్వకాల మూలంగా ప్రాచీన బౌద్ధ కళాసంపద, సంస్కృతి ఎంతగానో బయటపడి ఆంధ్రజాతికి గర్వకారణమైనవి.

కృష్ణానదికి ప్రాచీనతా ప్రాముఖ్యమొక్కటే కాదు ఉన్నది. సువిశాల ఆంధ్ర దేశాన్ని తన జలధారలతో సస్యశ్యామలం చేసి జాతి ఆర్థిక సౌష్ఠవానికి కారణం కాగల ప్రాముఖ్యంకూడా ఉన్నది.

కృష్ణానది పడమటి కనుమలలో పుట్టి 775 మైళ్ళు తూర్పుగా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తోంది. నదికి నీరు అందించే ప్రాంతమే దాదాపు 97,050 చ. మైళ్లున్నది. విజయవాడవద్ద ఒక మైలు ఎడంలో ఉన్న రెండు కొండలమధ్య ఈ నది ప్రవహిస్తుంది. ఇక్కడే సుమారొక శతాబ్దం క్రింద ఆనకట్టకట్టారు. ఇక్కడే ఇటీవల బరాజ్ కూడా కట్టారు. (మొన్న డిసెంబరు 4 వ తేదీన దీనికి శ్రీ సంజీవరెడ్డి ప్రారంభోత్సవంజరిపారు.)

నదికి ఆనకట్టకట్టి, నది జలాలను వ్యవసాయాభివృద్ధికి ఉపయోగించాలనే ఆలోచన 1792 ప్రాంతాల్లోనే మేజర్ బీట్సన్ అనే ఆయనకు కలిగింది. కాని ఒక 50 ఏళ్ళదాకా ఆలోచన ఆలోచనగానే ఉండిపోయింది. 1852-55 సంవత్సరాలలో సర్ ఆర్థర్ కాటన్ ఈ సంకల్పాన్ని పునరుద్ధరించాడు. కాప్టెన్ ఆర్ సుమారు రూ. 2 కోట్ల ఖర్చుతో ఆనకట్ట నిర్మించాడు.

నైఋతి ఋతుపవనాల వర్షాలమూలంగా సాధారణంగా జూలై అక్టోబరు నెలలమధ్య కృష్ణానదికి వరదలు వస్తాయి. 1903 అక్టోబరు 7 వ తేదీన విజయవాడవద్ద 11.9 లక్షల క్యూసెక్కులనీరు ప్రవహించింది. అక్టోబరు తరవాత నది ఎండిపోయి కాలవలా తయారవుతుంది. ప్రవహించే నీరు నూరు క్యూసెక్కులకు కూడా ఒక్కొక్కసారి తగ్గిపోతుంది.

జాగ్రత్తగా దర్యాప్తుజరిపినమీదట విజయవాడ ఆనకట్టవద్ద మొత్తం 1745 వేల మిలియన్ల ఘనపుటడుగుల నీరు లభ్యమవుతుందని భారత ప్రభుత్వం అంచనా వేసింది. ఇప్పుడు అమలులోవున్న వర్క్సును మినహాయించి ప్లానింగ్ కమీషను 680 వేల మిలియన్ల ఘ. అ. ల నీరు ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించింది. ఇలా కేటాయించిన నీటిని సిద్ధేశ్వరం, నాగార్జునసాగర్, పులిచింతల రిజర్వాయర్లకు ఉపయోగిస్తారు. ఇప్పుడు విజయవాడవద్ద బరాజ్ నిర్మించడంతో ఆంధ్రకు కేటాయించిన ప్రతి నీటిచుక్క సద్వినియోగం చేసుకున్నట్లౌతుంది.

## ఆనకట్ట

నాలుగుఅడుగుల వ్యాసము, 11 అడుగుల లోతు కలిగి, రెండువరసలుగా, ఇటుకతో

★ రాష్ట్రపతి






…లమీద 14 అడుగుల ఎత్తున గోడ …జ్వాడవద్ద ఆనకట్టనిర్మించారు. నదికి …వైపు 200 అడుగులమేరా, ఎగువవైపు … అడుగులమేరా గోడకటూ ఇటూ … …చి పైదాకా బోల్డరురాళ్ళు పోసి పైన దప్పాచేశారు. మొదట్లో ఈ ఆనకట్టను 5.8 లక్షల ఎకరాల ఆయకట్టుకు ఉద్దేశించికట్టారు. తరవాత ఆయకట్టు పెంచడంకోసం కొన్ని మార్పులు చేశారు. 1923-25 సం॥ లలో ఇప్పటి 6 అడుగుల ఎత్తు తలుపులు నిర్మించారు. అప్పటినుంచీ ఆయకటు పెరుగుతూ వచ్చి ఇప్పుడు 11½ లక్షల ఎకరాలైంది.

1952 మేలో ఆనకట్టకు ఏవో మరమ్మతులు చేయాల్సివచ్చి తలుపులువెత్తివుంచారు. ఇంతలో అనుకోకుండా వరదలు వచ్చాయి. అంతవరద ఎప్పుడూ రాలేదు. నీటిమట్టం గబగబా పెరిగింది. తలుపులు దించడానికి వీలులేకపోయింది. తలుపులమీద 9 అడుగుల ఎత్తున నీరు ప్రచండవేగంతో ప్రవహించి దప్పామీదపడింది. ఈ విధంగా దప్పా పాడు కూడా అనేకచోట్ల ధ్వంసమైంది.

### …ందేశం ★

"…బరాజ్ ప్రారంభోత్సవసంద…ర్భంలో ఆంధ్ర ప్రజలకు నా …శాంతులు అందచేస్తున్నాను …బరాజ్ భారతదేశంలోకల్లాపాటు …ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతర్వాత …యిన మొట్టమొదటి భారీ నదీ …ప్రాజెక్టు ఇదే. ఈ ప్రాజెక్టు …సంపన్న లక్షఎకరాలకు పైగా …నీటి సౌకర్యం ఏర్పడడమేకాక, …నిరోధించడానికి ప్రభుత్వం …కృషికూడా ఎంతో తోడ్పడం… బరాజ్ నిర్మాణంలో పని …కార్మికులకు, సాంకేతిక సిబ్బం… …దరికీ ఈసందర్భంలో నా అభి… …లు తెలుపుతున్నాను. ఆంధ్ర …ఆర్థిక సౌఖ్య సౌభాగ్యాలకు …నిర్మాణం తోడ్పడుతుందని …న్నాను."

## బరాజ్ నిర్మాణం

ఆనకట్ట తలుపులకు 104 అ. 5 అం. ఎగువన రెగ్యులేటర్ వంతెన నిర్మించారు. ఆనకట్టతో కొంతమేరా, దప్పాలతో కొంతమేరా కలిసి ప్రవాహాక్కిని నిరోధించేందుకు రెగ్యులేటర్ ఉద్దేశింపబడింది. పూండిలోని నీటిపారుదల పరిశోధన కేంద్రంలో అనేక ప్రయోగాలు చేసిన మీదట ఈ బరాజ్ నిర్మాణవిధానాన్ని రూపొందించారు.

ఫ్లోర్‌కి అడుగున 16 అ. నుంచి 20 అ. దాకా లోతుగల రీఇన్‌ఫోర్స్డ్ కాంక్రీట్ నూతులను ప్రవాహ నిరోధానికి, గోతులు పడకుండా చేయడానికి మూడు వరసలుగా నిర్మించారు. ఫ్లోరు అడుగున పునాది నేలను గట్టిగా ఉంచేందుకు రెండవ మూడవ వరుసలలోని నూతులు ఉపయోగపడతాయి. రెగ్యులేటరు లోపాడు ఫ్లోరు గ్రావిటీ రకానికి చెందినది. దీన్ని 6½ అడుగుల మందాన కాంక్రీట్‌తో కట్టారు. అటూ ఇటూ 4 అడుగుల మందాన దప్పాచేశారు. తలుపుల ఎత్తు ఆట్టే ఉండనవసరం లేకుండా ఫ్లోరుమీద 5 అడుగుల ఎత్తున గోడకట్టారు.

కుడివైపున స్లూసుల విషయంలో కొంత కలలంబరువుతోను, కొంత కంపు తిరగడం పద్ధతితోను నీటివొత్తిడిని నిరోధించేవిధంగా ఫ్లోరును నిర్మించారు. ఎడమవైపున స్లూసుల విషయంలో ఎక్కువలోతు త్రవ్వ నవసరం లేకుండా ఒక రీయిన్‌ఫోర్స్‌డ్ ప్లాటుఫారం లాంటిది కట్టారు. రెగ్యులేటర్‌కు వలభయ్యేసి అడుగుల వెడల్పుగల 70 తూములున్నాయి. కుడివైపున 17 అ. × 12అ. కొలతలుగల 8 స్లూసులు, ఎడమవైపున అదే కొలతలుగల 8 స్లూసులు ఉన్నాయి. ఎడమతట్టున వంతెనకు మరో 6 అవధులు (స్పాన్స్) ఉన్నాయి.

స్తంభాలు 8 అడుగుల మందం గలవి. ప్రతి 9వ స్తంభాన్ని 14 అడుగుల వెడల్పుగా, వంతెనమీంచి ఫ్లోరుమీదికి దిగి పరీక్షచేయడానికి వీలుగా కట్టారు. ప్రతి



# ఇరవై రెండేళ్ళ క్రితం...



[కేంద్ర శాసనసభ 1936 ఏప్రిల్ 2 వ తేదీన 11 గంటలకు ఆనరబుల్ సర్ అబ్దుర్ రహీం అధ్యక్షతన సమావేశమైనది. ఆ సందర్భంలో కృష్ణానదిపై రోడ్డు వంతెన విషయమై ఈ క్రింది ప్రశ్నోత్తరాలు జరిగాయి.]

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు:— మద్రాసు-కలకత్తా గ్రాండ్ ట్రంక్ రోడ్డును నిజంగా ఉపయోగకరం చేయడానికి కృష్ణా గోదావరీ నదులమీద వంతెనలు నిర్మించవలసిన అవసరం గాను గురించాలో లేదో ప్రభుత్వం తెలియజేస్తుందా? లేని పక్షంలో మద్రాసు ప్రభుత్వంతోను, ఇందుకు సంబంధించిన జిల్లా బోర్డులతోను సంప్రదించి ఈ విషయమై ప్రభుత్వం పర్యాలోచన చేయుచుందా?



ఆనరబుల్ సర్ ఫ్రాంక్ నోయిస్:— బెజవాడవద్ద కృష్ణానదికీ, రాజమండ్రివద్ద గోదావరికీ వంతెనలు కట్టాలనీ, దీనికిగాను కేంద్ర ప్రభుత్వపు రిజర్వులనుంచి రోడ్డు పద్దుక్రింద ధనసహాయం చేయాలనీ ఒకప్పుడు మద్రాసు ప్రభుత్వం అడిగింది. కాని స్పష్టంగా అంచనాలేమీ తయారు కాలేదు. ధన వ్యయంకూడా ఎక్కువ అవుతుందనే ఉద్దేశంతో ఈ స్కీములను మానివేశారు. వీటిని పునరాలోచనచేసే బాధ్యత స్థానిక ప్రభుత్వానిదే. అయితే ఒక సంగతి చెప్పాల్సిఉంది. ఈ రెండు వంతెనలను నిర్మించడం ఒకవేళ సాధ్యమైనప్పటికీ కలకత్తా మద్రాసు పరావరి రోడ్డును ఎట్టి అడ్డంకులం లేకుండా పూర్తిగా వేయడం సాధ్యం కాదు.

శ్రీ ఎన్. జి. రంగా:— ఈ రెండు వంతెనలనునిర్మించడంవల్ల మద్రాసుకలకత్తా పరావరి రోడ్డు అభివృద్ధికి వీలు కలుగుతుందనేది నిజమా కాదా?

సర్ ఫ్రాంక్ నోయిస్:— గౌరవనీయ సభ్యుడు ఒక యథార్థ విషయం చెబుతున్నారుగాని ప్రశ్న అడగడంలేదు.

[1936 ఏప్రిల్ 16 గురువారం సభలో ప్రశ్నోత్తరాలు:]

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు:— కృష్ణానదిపై వంతెన నిర్మించే విషయమై ఆలోచన చేస్తున్నారో లేదో ప్రభుత్వం తెలియజేస్తుందా?

సర్ ఫ్రాంక్ నోయిస్:— ఇప్పుడు ఉన్న రైల్వే వంతెనతో కలిపి రోడ్డువంతెనను నిర్మించాలనే ప్రతిపాదన ఉన్నది.

శ్రీ ఎన్. జి. రంగా: కృష్ణానదికి వంతెన నిర్మించాలనే ప్రతిపాదనపై పరిశీలన ఇప్పుడేదశలో ఉన్నది?

సర్ ఫ్రాంక్ నోయిస్:— ఈ ప్రతిపాదనను గూర్చి ఇంకా మద్రాసు ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే ఉన్నాము.



## కృష్ణా బరాజ్

కంభానికి కూడా అలా కిందికిదిగే మెట్లు ఏర్పాటుచేశారు.

రోడ్డు 24 అడుగుల వెడల్పున ఉంది. దీనికటు 5 అడుగుల వెడల్పున, ఇటు 5 అడుగుల వెడల్పున మనుషులు నడిచేందుకు దారి వదిలారు. ఈ దోవకు అనుగుణ ఎలక్ట్రిక్ తీగలు, టెలిఫోన్ తీగలు, నీటి గొట్టాలకు చోటు వదిలారు.

రెగ్యులేటర్ తలుపులు 40 అ. × 12 అ. కొలతలు గలవి. ఒక్కొక్క తలుపు 16.3 టన్నుల బరువు ఉంటుంది. పక్కతూముల తలుపులు 17 అ. × 12 అ. పరిమాణం గలవి. ఇవి ఒక్కొక్కటి 8 టన్నుల బరువు తూగుతాయి. వీటి కౌంటర్ వెయిట్లు రీయిన్‌ఫోర్స్‌డ్ కాంక్రీటుతో తయారైనవి. ఈ గేట్లను ఎలక్ట్రిక్ మోటార్ (5 హెచ్. పి.)తో పనిచేయిస్తారు. నిమిషానికి వీటిని 1 అ. 8 అం. చొప్పున లేవనెత్తవచ్చు. ఒకవేళ విద్యుచ్ఛక్తి పనిచేయ్యకపోతే మనుషులచేతనే తలుపులను కదిలించడానికి ఏర్పాటుచేశారు.

## మరో లక్ష ఎకరాల ఆయకట్టు

కృష్ణాబరాజ్ నిర్మాణఫలంగా కృష్ణా జిల్లాలో మరొక లక్ష ఎకరాల భూమి సాగవుతుందని అంచనా. నీటి పారుదలకు 184 విభాగాలద్వారా ఈ అదనపు ఆయకట్టు సాధించాలని ఊహ. ఈ స్కీముల పరిశీలన పూర్తయింది. కొన్ని స్కీములు అప్పుడే అమలు జరిగి 42 వేల ఎకరాల భూమి కొత్తగా సాగయింది. మిగతా విభాగాలను కూడా త్వరలో అమలుచేయాలని ప్రభుత్వం సంకల్పించింది.

ఈ బరాజ్‌కు సంబంధించినంతవరకూ 2.6681 కోట్ల రూ. ఖర్చు అంచనావేశారు. ఇతర పద్దులతో కలిపి మొత్తం 2.3415 కోట్ల ఖర్చు అంచనావేశారు. 1954 ఫిబ్రవరి 13 వ తేదీ ప్రకాశంగారు ముఖ్యమంత్రి హోదాలో ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం చేశారు. నిర్మాణంలో ప్రధాన భాగాన్ని గానన్ డంకర్లీ అండ్ కో వారికి 160 లక్షల రూ.లకు కంట్రాక్టు ఇచ్చారు. 1954 మార్చిలో ఆ కంపెనీకి ఆ స్థలాన్ని అప్పగించారు. గేట్లు మొదలైన పరంజామా అంతా [illegible]లోని వర్క్‌షాపు కర్మాగారంలో తయారుచేస్తున్నారు. పది పదిహేనునెలల పొదుపుతో మొత్తం పనంతా అయిపోతుందని అంచనా.

ఉక్కు, షీట్ ప్లేట్లు, రీయిన్‌ఫోర్స్‌డ్ కాంక్రీట్‌కు కావల్సిన ఉక్కు, గేట్లకు ఉక్కు మొదలైన ముఖ్యమైనవన్నీ కొరత కావడంవల్ల పని చురుగ్గా జరగలేదు. ఉన్నతాధికారులు ఎంత ప్రయత్నించినా ఆ పదార్థాలు దొరక్క పని మందకొడిగా సాగింది. చివరి కెలాగైతేనేం కావలసినవన్నీ సాధించి పనిసాగించారు. తలుపులు తప్ప మిగతావన్నీ తయారై సిద్ధంగా ఉన్నవి. తలుపులు కూడా పొలాలకు నీళ్లు వెళ్లే సమయం ముందే అమర్చుతారు.

ఈ బరాజ్ భారతదేశంలోకల్లా పెద్దది. ఈ రెగ్యులేటర్ నిడివి 3400 అడుగులు. పక్కతూములున్న రెండుభాగాలలో రోడ్డు బ్రిడ్జి నిడివి 4045 అడుగులు. ఇంత పెద్ద బరాజ్‌ను ఇంత తక్కువ ఖర్చుతో, 3½ ఏళ్ళ స్వల్ప వ్యవధిలో ముగించడం చాలా గొప్ప విషయం. ఇలా సంతృప్తికరంగా పని జరగడానికి కారణం పొదుపుగా, సమర్థతతో, అన్నీ చక్కగా ప్లానుచేసుకుని కృషి సాగించడమే.



# నక్షత్ర ఫలితాలు

## 1958 సంక్షిప్త ఫలితాలు

**( 1-1-58 మొదలు 7-1-58 వరకు )**

### గ్రహస్థితి

| | కే | | |
|---|---|---|---|
| | 5 వ తేదిని బుధ వక్రత్యాగము. మేష, వృషభ, మిథున కర్కాటకములలో చంద్రుడు. | | |
| శు | | | |
| ర బు | శ కు | గు రా | |

1958 సం॥ సంక్షిప్తఫలితాలు గోచార రీత్యా చూచుకోవలెను. జాతక చక్రం ప్రకారం యోగకారకుని దశలో శుభయోగము ప్రబలంగాను, అవయోగము తక్కువగాను ఉండునని తెలుసుకోవలెను.

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. బుద్ధిబలమును ఉపయోగించి ప్రయత్నించినను కార్యసిద్ధి వుండదు. చేతికి వచ్చేడబ్బు అవసరములకు సరిపడక ఇబ్బందిపడుటచేత అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగా వున్నదని విని వ్యాకులపడుతాడు. అయినను దైవానుగ్రహమువల్ల అన్నియు సరిపడతాయనే మనోనిబ్బరముతో వుంటారు. ఉద్యోగస్థులకు అస్థిమితము; వర్తకులకు ఆందోళన. 1, 2 తేదీలలో నిలకడలేనిస్థితి, శ్రమ. 3, 4 తేదీలలో ధనప్రాప్తి. 5, 6 తేదీలలో ప్రయాణము, ఆత్మవిశ్వాసము, కొద్దిగా అనుకూలత. 7 న ఆరోగ్యచింత.

8-2-58 నుండి కొంత అనుకూలయోగము కలిగిననూ కొంత ఇబ్బందికూడా వుంటుంది. 17-5-58 తేదినుండి తిరిగీ మిశ్రమయోగము. 21-7-58 నుండి కొంత మెరుగుగా వుంటుంది. 16-9-58 నుండి మీకు మంచియోగము. 7-11-58 నుండి మరికొంత అనుకూలము. కాబట్టి మొత్తము మీద 1958 వ సం॥ రము మీకు మిశ్రమ యోగము.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము అనుకున్నట్టుగా సొమ్ము చేతికి రాకపోవుటచేతను, ఖర్చులు ఎక్కువగుటచేతను అశాంతి కలుగుతుంది. కార్యభారము అధికమవుతుంది. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. ఉద్యోగస్థులకు అధికారులతొందరలు; వర్తకులకు అశాంతి. భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహార పరిష్కారములో దుష్టస్త్రీలతో వివాదము. విద్యార్థులకు చదువుపై ఆసక్తి. 1, 2 తేదీలలో కార్యభారము, త్రిప్పట, 3, 4 తేదీలలో స్వల్పకార్యలాభము. 6, 7 తేదీలలో వివాదము, ఆరోగ్యచింత.

2-8-58 నుండి కొంత అనుకూలత కలిగినప్పటికీ ఇంకా కొంతకాలము ఇబ్బంది

బి. నరసింగరావు

వుంటుంది. 17-5-58 నుండి 20-7-58 వరకూ యోగకరముకాదు. 21-7-58 నుండి ప్రారంభమైన శుభయోగము 16-9-58 నుండి అధికమవుతుంది. 7-11-58 నుండి ఈ శుభయోగము మరికొంత వృద్ధియవుతుంది. మొత్తము మీద 1958 లో మీకు యోగావయోగములు సమానముగా వుంటవి.

### *కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]*

తిలకు తగని పనులను పైని వేసుకొని, కార్యసాధన కానప్పటికీ నిరుత్సాహము పొందరు. సోదరసహాయంవల్ల కొంతవిజయం సాధించుతారు. ఉద్యోగులకు అధికారుల చురుకుమాటలచే మనస్సు కలతచెందుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి. ప్రమాదమువల్ల గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు, ఎరువుల వ్యాపారస్తులకు లాభము. 1, 2 తేదీలలో కార్యభారము. 3, 4 తేదీలలో సోదర సహాయము, కార్యలాభము. 5, 6 తేదీలలో కొద్దిగా అనుకూలత. 7 న ప్రమాద భయము.

ఈ నక్షత్రము 2, 3, 4 పాదముల వారికి 8-2-58 నుండి కొంత అవయోగము మొదలౌతుంది. 17-5-58 నుండి 20-7-58 వరకూ యోగప్రదము. 7-11-58 నుండి తిరిగి అవయోగము మొదలవుతుంది. సంవత్సరాంతమున కొంత శుభయోగము. ఈ నక్షత్రము మొదటి పాదమునకు ఫలములు భరణీ నక్షత్రమునకువలెనే వుండును.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

మీ బుద్ధిబలమువల్లను, పదవిగలవారి సహాయమువల్లను గత రెండువారములనుండి కలుగుతున్న ప్రతిఘటనలను అనుకూలముగునట్లుగా సాధించుకుంటారు. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. మిత్రలాభము పొందుతారు. దూరమందున్న బంధువుల క్షేమవార్త తెలుస్తుంది. కవులకు, నటీనటులకు, చిత్రకారులకు యోగకాలం. ఉద్యోగస్థులకు 1, 2 తేదిలలో తొందర్లు కలుగుతాయి. 3, 4, 5 తేదీలలో అధిక ఖర్చులు, కార్యానుకూలత, మిత్రలాభము, శుభవార్త. 7 వ తేదిని అలసటచే అస్వస్థత.

ఈ నక్షత్రమువారికి 8-2-58 నుండి కొంత యోగము తగ్గుతుంది. 17-5-58 నుండి 20-7-58 వరకూ శుభయోగము. 7-11-58 నుండి మళ్ళీ అవయోగము మొదలై సంవత్సరాంతమునకు కొంత శుభయోగము కలుగును.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగకాలము. ఆర్థికస్థితి బాగుపడుతుంది. కొత్తవారితో పరిచయము కలుగుతుంది. పిల్లల శుభకార్యములను గురించి ఆలోచనలు చేస్తారు. కొన్ని చిక్కు వ్యవహారములు పరిష్కారమవుతాయి. విద్వాంసులవల్ల కొత్త విషయాలు తెలుసుకుంటారు. ఉద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ ఎక్కువవుతుంది. న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగకాలము. 1, 2 తేదీలలో కార్యసాధనవల్ల త్రిప్పట, శ్రమ. 3, 4, 5 తేదీలలో ధనాదాయము, కార్యానుకూలత, విజ్ఞానార్జన. 6, 7 తేదీలలో ఖర్చులు, శ్రమచే అలసట.

ఈ నక్షత్రము 1, 2 పాదముల వారికి 8-2-58 నుండి కొంత యోగము తగ్గును. 17-5-58 నుండి 20-7-58 వరకూ శుభయోగము. 7-11-58 నుండి తిరిగీ అవయోగము ప్రారంభమై సంవత్సరాంతమునకు శుభయోగము కలుగుతుంది. 3, 4 పాదముల వారికి కూడా ఇంచుమించుగా పైవిధముగానే వుండును.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీ పలుకుబడిని వినియోగించుకొని కార్యసాధన పొందుతారు. కోర్టు

 

# నక్షత్ర ఫలితాలు



వ్యవహారములు మీ పక్షముగా తీర్పు అవుతవి. ఉద్యోగస్తులకు మంచికాలము. విద్యార్థులు కొత్తవిషయాలు నేర్చుకుంటారు. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము. కళాకారులకు, కవులకు, నటీనటులకు యోగకాలము. 1, 2 తేదీలలో కార్యాచరణలో శ్రమ, ఖర్చులు. 3, 4, 5 తేదీలలో ప్రయాణము, కార్యలాభము. 7 వ త్రిప్పటవల్ల ఆయాసం.

మీకు 8-2-58 నుండి కొంతయోగము తగ్గుతుంది. 17-5-58 నుండి 20-7-58వరకూ కూడా అవయోగంగా నేవుంటుంది. 21-7-58 నుండి కొంత శుభయోగము. సంవత్సరాంతమునకు తిరిగీ యోగము తగ్గును.

## * పునర్వసు [కే, కో, హా, హి,] *

ఈ వారము బంధుమిత్రులను కలుసుకుంటారు. శుభకార్యములను గురించి ఆలోచిస్తారు. వాహనయోగము కలదు. బంగారము, నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభం. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు కాలము. 1, 2 తేదీలలో కార్యభారముచే శ్రమ, అధికఖర్చులు. 3, 4, 5, 6 తేదీలలో మిత్రసందర్శనం, వినోదము, శుభకార్యచింత. 7 వ ప్రయాణముచే అస్వస్థత. వారమంతయు విద్యార్థులకు ప్రోత్సాహకరముగా వుంటుంది.

ఈ నక్షత్రము 1, 2, 3 పాదములవారికి ఇదివరకున్న యోగము 8-2-1958 నుండి తగును. 17-5-58 నుండి 20-7-58 వరకు మరికొంత అవయోగం. 21-7-58 నుండి కొంత శుభయోగము. 4 వ పాదము ఫలము పుష్యమినక్షత్రమునకువలెనే యుండును.

## *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము ఆర్థికస్థితి యేమంత తృప్తికరముగా వుండదు. తలపెటిన పనులు ఫలించవు. కార్యభారము ఎక్కువ. త్రిప్పటచే అకాల భోజనమువల్ల ఆరోగ్యభంగముకలిగే సూచనలున్నవి. వెంటనే శ్రద్ధవహించడం మంచిది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ ఎక్కువ. 1, 2 తేదిలలో కార్యభంగము, అనారోగ్యము, గృహకలతలు, మనోవ్యథ. 3, 4, 5, 6 తేదీలలో స్వల్పలాభము, పితృవర్గ సహాయము, 7 వ అశాంతి.

మీకు 8-2-58 నుండి మంచియోగము కలుగును. 17-5-58 నుండి 20-7-58 వరకు అంత బాగుండదు. 16-9-58 నుండి శుభయోగము.

## *ఆశ్లేష [డి, డూ, డే, డో]*

ఈ వారము అంతయోగదాయకం కాదు. మొదట్లో కార్యభంగమైనట్లు కనబడి నిరాశ కలిగినను క్రమేణా మిత్రుల సహాయంతో కార్యసిద్ధి అవుతుంది. ఉద్యోగస్తులకు ధన లోపమువల్ల ఒత్తిడి ఎక్కువ. వ్యాపారస్తులకు మాంద్యము. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధ. 1, 2 తేదీలలో అవసరాలు తీరనందున గృహకలతలు, మనోవ్యథ, 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, మిత్రసహాయము. కార్యసిద్ధి 7 వ అనారోగ్యము.

మీకు 8-2-58 నుండి మంచి యోగము. 17-5-58 నుండి 20-7-58 వరకు అంత బాగుండదు. 16-9-57 నుండి శుభయోగము.

## *మఖ [మా, మీ, మూ, మే]*

ఈవారము ఖర్చులు ఎక్కువ. తలపెట్టిన కార్యములు ఫలించవు. సంసారముపట్ల నిర్లిప్తత కలదనే అపోహవల్ల గృహకలతలు వస్తాయి. సజ్జనసహవాసమువల్ల, ఆధ్యాత్మిక చింతవల్ల మనశ్శాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులు కొంత కష్టపడినమీదట మేలు పొందుతారు. విద్యార్థులకు చదువుపైని శ్రద్ధ తక్కువైనను నూతన విషయాలు నేర్చుకుంటారు. 1,2 తేదీలలో కార్యసాధనలో జాప్యము, అశాంతి. 3, 4, 5, 6 తేదీలలో సజ్జనసాంగత్యము, విజ్ఞానలాభము, ఆత్మశాంతి, కొంత మేలు. 7 వ ఆరోగ్యభంగము.

కొంతకాలమునుండి మీకు కలిగిన అవయోగము 8-2-58 నుండి తొలగిపోతుంది. 17-5-58 నుండి 20-7-58 వరకు ధనయోగము 21-7-58 నుండి అంత మంచికాలము కాదు. 7-11-58 నుండి తిరిగీ యోగకాలం.

## * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *

## [మో, టా, టీ, టూ]

ఈవారములో కార్యభారము ఎక్కువ; బంధువుల రాకవల్ల అధికఖర్చులు. ధనలోపమువల్ల అస్థిమితము కలుగుతుంది. కోర్టు వ్యవహారములు మీపక్షముగా తీర్పు అవుతాయి. ఉద్యోగస్తులకు శ్రమ. వ్యాపారస్తులకు అశాంతి. స్త్రీలతో వివాదము. ఆరోగ్యము చెడవచ్చు; వెంటనే శ్రద్ధవహించిన మేలు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధతక్కువ. 1, 2 తేదిలలో త్రిప్పట, కార్యభారమువల్ల అలసట, కార్యభంగము. 3, 4, 5, 6 తేదీలలో కొంత కార్యానుకూలత, ఊరట. 7 వ ఆరోగ్యభంగము.

కొంతకాలమునుండి మీకు కలిగిన అవయోగము 8-2-58 నుండి తొలగిపోతుంది. 17-5-58 నుండి 20-7-58 వరకూ ధనయోగము. 21-7-58 నుండి అంత మంచిదికాదు. 7-11-58 నుండి తిరిగి యోగము కలుగుతుంది.

## —ధరలు:—

నూలు, వస్త్రములు: స్వల్పముగా పెరుగును.

నూనెదినుసులు: మార్పులేదు.

బెల్లము: కొంచెము పెరుగును.

పంచదార, చింతపండు: సమస్థాయిలో నుండును.

ఆహారధాన్యములు: మందముగా వుండును.

పప్పుదినుసులు: తగ్గును.

వెండి, బంగారము: స్వల్పభేదాలతో వుండును.

దక్షిణదేశములో అక్కడక్కడ మెదురుగా వర్షించును.

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామ నక్షత్రము (వారి వారి పేర్లననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది.

కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

## * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *

## [టే, టో, పా, పీ]

ఈవారము మీశక్తినంతయుఉపయోగించి పనులు మొదలుపెట్టినను ఫలము [illegible]లుగదు. పట్టుదల గలవారగుటచేతను ధైర్యముతో యత్నిస్తూవుంటారు. అందువల్ల క్రమేణా అవరోధములు తొలగి మేలు కలుగుతుంది. తోబుట్టువుల సహాయ సానుభూతులచే ఒడిదుడుకులు సర్దుబాటు అవుతవి. ప్రమాదము కలిగే సూచనలున్నవి. జాగ్రత్తవల్ల తప్పవచ్చును. లోహ, ఎరువుల వ్యాపారస్థులకు లాభము. 1, 2 తేదిలలో త్రిప్పట, కార్యభంగము, మనోవ్యథ 3, 4, 5, 6 తేదీలలో సోదరసహాయము, కార్యానుకూలత, శుభయోగము. 7 వ ప్రమాదభయము.

ఈ నక్షత్రము 2, 3, 4 పాదములవారికి 1958 వ సం॥ములో యిదివరకు కలిగిన శుభయోగము 8-2-58 నుండి తగ్గును; 17-5-58 నుండి 20-7-58 వరకు మరికొంత తగ్గును. అయితే ఈమధ్య 2-6-58 నుండి అవయోగముతోబాటు కొంత మంచియోగము కూడా వుండును. 21-7-58 నుండి 28-12-58వరకూ ధనయోగము. ఈ నక్షత్రము మొదటిపాదమునకు ఫలములు పూర్వఫల్గుణికివలెనే వుండును.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీ ప్రజ్ఞచేతను ఇంతవరకు కలిగిన ఆటంకములను తొలగించుకొని, కార్యసాధనలో మంచి ఫలితాలు పొందుతారు. అధికారుల ఆదరణ ఉంటుంది. కొత్త వారితో పరిచయము కలుగుతుంది. బంధువుల క్షేమసమాచారము తెలిసి కుదుటపడతారు. విద్యార్థులు కొత్తవిషయాలు నేర్చుకుంటారు. డాక్టర్లకు, మంగుల వర్తకులకు లాభము. గణిత శాస్త్రజ్ఞులకూ, చిత్రకారులకూ, కవులకూ మేలుకాలము. 1, 2 తేదీలలో కార్యాచరణవల త్రిప్పట, శ్రమ. 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, మిత్రలాభము, కార్యసిద్ధి. 7 వ అలసట.

ఇదివరకు కలిగిన శుభయోగము 8-2-58 నుండి తగ్గును 17-5-58 నుండి 20-7-58 వరకు ఇంకనూ తగ్గును అయినప్పటికీ 2-6-58 నుండి కొంత మంచి కలుగును. 21-7-58 నుండి 28-12-58 వరకూ ధనయోగము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీ ధనాదాయము పెరుగుతుంది. పండితగోష్ఠివల్ల కొత్త సంగతులు తెలుసుకుంటారు. స్నేహితులద్వారా కోర్టు వ్యవహారములలో రాజీపడతారు. పిల్లల అభివృద్దికొరకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు. విద్యార్థులు శ్రద్ధగా విషయాలు నేర్చుకుంటారు. పండితులకూ, న్యాయవాదులకూ, కళాకారులకూ యోగకాలము. 1, 2 తేదీలలో త్రిప్పట, శ్రమ, 3, 4, 5, 6 తేదీలలో ఆర్థిక లాభము, బంధు సమాగమము, కార్యసిద్ధి, శుభకార్యాలోచన. 6 వ శ్రమ.

ఈ నక్షత్రము 1, 2 పాదముల వారికి హస్తానక్షత్రమునకు వలెనే 1958 వ సం॥ ఫలితాలుండునని తెలుసుకొనునది. 3, 4 పాదములవారికి ఏలినాటిశని పోవును. బహుకాలముగావుంటున్న అశాంతి, అవయోగములు 8-2-58 నుండి తొలగుతాయి. శుభయోగము ప్రారంభమగును. 17-5-58 నుండి 20-7-58 వరకూ అంత యోగప్రదం కాదు. 16-9-58 నుండి కొంతయోగము. 7-11-58 నుండి యోగము ప్రబలమగును. సంవత్సరాంతమున ధనయోగము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

గత రెండువారముల నుండి యున్న అశాంతి తొలగుతుంది. ఆర్థికస్థితి బాగుపడుతుంది. బంధుమిత్రులతో వినోదములలో పాల్గొంటారు. ఉద్యోగస్థులకు అధికారుల దయ కలుగుతుంది. వ్యాపారస్థులకు యోగిస్తుంది. ఇంట్లోనున్న వారిఆరోగ్యంబాగుపడుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు యోగకాలము. 1, 2 తేదీలలో అధిక ఖర్చులు, త్రిప్పట, శ్రమ. 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, బంధుదర్శనము, కార్యలాభము. 7 వ అలసట.

మీకు 1958 వ సం॥ ములో ఏలినాటిశని పోయి చాలాకాలమునుండి వుంటున్న అశాంతి, అవయోగములు 8-2-58 నుండి తొలుగుతాయి. శుభయోగము ప్రారంభమగును. 17-5-58 నుండి 20-7-58వరకు అంత యోగప్రదముగా వుండదు. 16-9-58 నుండి కొంత యోగము. 7-11-58 నుండి యోగము ప్రబలమగును. సంవత్సరాంతమున ధనయోగము కలుగుతుంది.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

గతవారము కలిగిన యోగము ఈ వారము కూడా వుంటుంది. మీ హోదా పెరుగుతుంది. యత్నకార్యములు ఫలిస్తాయి. పుణ్య, ధర్మకార్యాచరణ చేసారు. కోర్టు వ్యవహారములు మీపరముగా తీర్పు అవుతాయి. పిల్లల శుభకార్యాలోచనలు ఫలిస్తాయి. విద్యార్థులకు మేలుకాలము. బట్టల వర్తకులకు లాభము. 1,2 తేదీలలో కార్యాచరణలో త్రిప్పటవల శ్రమ. 3,4,5,6 తేదీలలో ధనలాభము, ప్రయాణము, కార్యసిద్ధి, బంధువులతో విందుభోజనము. 7వ బడలిక.

1958వ సం॥ములో ఈ నక్షత్రము 1, 2, 3 పాదములవారికి 8-2-58నుండి ఏలినాటిశని తీరిపోవును. చాలాకాలము నుండి వున్న అవయోగములు తొలగి శాంతి కలుగుతుంది. శుభయోగము ప్రారంభమవుతుంది. 17-5-58 నుండి 20-7-58 వరకూ అంతయోగప్రదము కాదు. 16-9-58 నుండి కొంతయోగము. 7-11-58 నుండి యోగము ప్రబలమవుతుంది. సంవత్సరాంతమున ధనయోగము కలుగును. ఈ నక్షత్రము 4వ పాదము వారలకు అనూరాధకు వలెనే ఫలితములు వుండును.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీ ఆదాయము వృద్ధిచేసుకొనే ప్రయత్నాలుఫలించవు. సకాలములో అనుకున్న సహాయము కలుగక అవసరములు తీరక గృహకలతలు ఏర్పడుతాయి కార్యభారముచే మానసికస్థితి, శరీరస్థితి సంతృప్తికరముగా ఉండవు. త్రిప్పటచేత, అకాల భోజనమువల ఆరోగ్యము చెడుతుంది. వర్తకులకు ఒడిదుడుకులు; ఉద్యోగస్థులకు శ్రమ. 1, 2 తేదీలలో కార్యభంగము. 3, 4, 5, 6 తేదీలలో పితృసహాయము. కొద్దిగా ఊరట. 7 వ అనారోగ్యము.

8-2-58 నుండి ఇంతవరకువున్న కష్టములు చాలామట్టుకు తగ్గుతాయి. 17-5-58 నుండి 20-7-58 వరకు లాభయోగము. 21-7-58 నుండి కొంతలాభము తగ్గినను 16-9-58 నుండి లాభయోగము ప్రబలముగా వుండును.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈవారము అనుకున్న పనులు జరగక ఆశించినసహాయము కలుగక గృహకలతలవల్లమనోవ్యధ కలుగును. అయినప్పటికీ వారాంతమునకు తటస్థముగావున్న మిత్రులసహాయముచే కార్యసాధన అయి శాంతిపొందుతారు. ఇంట్లోనున్న పెద్దల ఆరోగ్యము చెడవచ్చును. ఉద్యోగస్థులకు మొదట్లో అధికారుల ఒత్తిడి, క్రమేణా ఆదరణ కలుగుతుంది. విద్యార్థులకు చదువుమీద అశ్రద్ధ. 1, 2 తేదీలలో కార్యభంగము, అధికఖర్చులు, శ్రమ. 3, 4, 5, 6 తేదీలలో మిత్రసహాయముచే కార్యసిద్ధి, అనుకోని ప్రయాణము. 7 వ ఆరోగ్యచింత.

మీకు ఇదివరకుయున్న కష్టములు 8-2-57 నుండి చాలావరకూ తగ్గుతాయి. 17-5-58 నుండి 20-7-58వరకు ధనలాభయోగము. 21-7-58 నుండి ఈయోగము తగ్గినను 16-9-58 నుండి తిరిగి అధికమగును.

### *మూల [యే, యో, బా, బీ]*

గత రెండువారములలో కలిగిన యోగము ఈవారము తగ్గుటచేత కార్యహానికలిగి కలతలు, నిరుత్సాహ పరిస్థితి ఏర్పడుతాయి. అయినప్పటికీ పుణ్యకార్యాచరణ, ఆధ్యాత్మిక చింతవల్ల చిత్తశాంతి పొందుతారు. కుటుంబమందుండువారి ఆరోగ్యముగురించి కలవరపడుతారు. వ్యాపారస్థులకు నిరాశ. 1, 2 తేదీలలో కార్యహానివల్ల అశాంతి, త్రిప్పట. 3, 4, 5, 6 తేదీలలో పుణ్యకార్యాచరణ, సాధుసాంగత్యమువలనశాంతి. ఉద్యోగస్థులకు కొంత అనుకూలత. 7 వ ఆరోగ్య చింత.

మీకు 1958 సం॥ములో ఇదివరకూ వున్న చిక్కులు కొన్నితగినను 8-2-58 నుండి మరికొన్ని కొత్తవి కలుగును. అయినప్పటికీ కొంత ధనయోగము వున్నది. 17-5-58 నుండి 20-7-58 వరకూ అంతమంచిది కాదు. 21-7-58 నుండి సంవత్సరాంతము వరకు మిశ్రమయోగము.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. కార్యభారము అధికమగుటవల్ల శ్రమ. ఇచ్చిపుచ్చుకొనేపట్ల నీచస్త్రీలతో వివాదము భార్యకు అనారోగ్యము; మనోవ్యథ. 1, 2, 3 తేదీలలో కార్యభంగము, త్రిప్పట, వివాదము. 4, 5, 6 తేదీలలో కార్యానుకూలత 7 వ ఆరోగ్యచింత. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ.

మీకు 1958 వ సం॥ములో ఇదివరకూ యున్న కష్టములు కొన్ని తగ్గినను 8-2-58 నుండి మరికొన్ని కొత్త సమస్యలు వస్తాయి.

# ★ నక్షత్ర ఫలితాలు ★

అయిననూ ధనయోగము ఉన్నది. 17-5-58 నుండి 20-7-58 వరకూ అంతమంచికాలము కాదు. 21-7-58నుండి సంవత్సరాంతము వరకూ యోగావయోగములు సమానముగా వుండును.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీ సామర్థ్యము నంతటినీ ఉపయోగించి కార్యసాధనకుయత్నించినా ఫలితము ఉండదు. అయిననూ వెనుకంజ వేయక సాహసముతో ప్రయత్నిస్తూనే ఉంటారు. అదేసరియైన క్రమము. అందువల్ల అడ్డంకులు గడిచి మేలుపొందుతారు. జ్ఞాతి సహాయమువల్ల కష్టములు చాలావరకూ సర్దుకుంటాయి. ప్రమాదములచే దెబ్బలు తగుల వచ్చు. జాగ్రత్తపడినచో తప్పవచ్చును. ఖనిజ వ్యాపారస్తులకు లాభము. 1, 2 తేదీలలో త్రిప్పట, ఆటంకములు-3, 4, 5, 6 తేదీలలో ఆదాయవృద్ధి, సహాయము, కొంత ఊరట. 7 వ ప్రమాద భయము.

ఈ నక్షత్రం మొదటిపాదంలో జనించిన వారికి 1958 వ సం॥మునకు పూర్వాషాఢ ఫలములే వర్తిస్తాయి 2, 3, 4 పాదములలో పుట్టినవారికి 8-2-58 నుండి ఏలినాటిశని ప్రారంభమగును. అయినప్పటికీ శని రజిత మూర్తిగా ధనస్సులో ప్రవేశిస్తున్నాడు. కనుక బాధలు అంతగా వుండవు. అదియునుగాక జననకాలమందు మీ నక్షత్రము శని క్షేత్రములో వున్నందున మకరరాసివారికి ఏలినాటిశని కష్టములు వుండవు. 17-5-58 నుండి 20-7-58 వరకూ మంచి యోగము. తిరిగి సంవత్సరాంతమున లాభయోగము కలుగుతుంది.

### *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారము అధికారములో నుండువారి సహాయంవల్లను, మీ స్వశక్తిచేతను కార్యానుకూలత పొందుతారు. కొత్త వారితో పరిచయము కలుగుట, శుభవార్తలు వినుట వంటి మంచి ఫలితాలు కలుగుతాయి. దూరస్తులైన బంధువుల క్షేమం తెలిసినందున ఇంతవరకూ వున్న ఆందోళన తొలగుతుంది. గణిత శాస్త్రజ్ఞులకు, శిల్పులకు, కళాకారులకు మంచికాలము. వైద్యులకు, మందుల వర్తకులకు లాభం 1, 2 తేదీలలో కార్యాచరణవల్ల త్రిప్పట, శ్రమ. 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, అధికారుల సహాయము, మిత్రదర్శనము, లాభము 7 వ అలసట.

మీకు 8-2-1958 నుండి ఏలినాటి శని ప్రారంభించిననూ రజిత మూర్తిగా శని ధనస్సులో ప్రవేశిస్తాడు కనుక ఆ బాధలు ఉండవు. అదీగాక జనన కాలమున మీ నక్షత్రము శని క్షేత్రములో వున్నందున మకర రాశి వారికి ఏలినాటిశని కష్టములు ఉండవు. 17-5-58 నుండి 20-7-58 వరకూ మంచి యోగము కలుగుతుంది. తిరిగీ సంవత్సరాంతమున లాభయోగము.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీకు యోగకాలము. ఉత్తమగ్రంథాలు చదువుటవల్ల, పండిత సాంగత్యమువల్ల జ్ఞానాభివృద్ధి కలుగుతుంది. యత్న కార్యాలు ఫలిస్తాయి. భార్యాబిడ్డలతో సుఖముగా గడుస్తుంది. పిల్లలకు అభివృద్ధి కలుగును. ఉద్యోగస్తులకు గతివారము కలిగిన మనోవ్యథతీరుతుంది. ఆదాయము మెరుగుగా వుంటుంది. న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగకాలము. 1, 2 తేదీలలో శ్రమతోకూడిన కార్యసిద్ధి. 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, పండితగోష్ఠి, ధనలాభము, 7 వ అలసట.

ఈ నక్షత్రము 1, 2 పాదములలో జనించిన వారికి 1958 సం॥ములో ఫలములు శ్రవణంనకు వలెనే వుంటాయి. 3, 4 పాదముల వారికి 8-2-58 నుండి ఇది వరకుయున్న అవయోగము తొలగిపోవును. భాగ్యలాభము వుండును. 17-5-58 నుండి 20-7-58 వరకు యోగము కొంత తగిననూ 21-7-58 నుండి యెప్పటివలె భాగ్యయోగము కలుగును.

### *శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము మీ ఆర్థికస్థితి బాగుంటుంది. గతవారము అసంపూర్తిగా నిలిచిపోయిన పనులు నెరవేరుతాయి. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. ఆగ్నేయ దిక్కునుండి శుభవార్త వింటారు. వెండి వ్యాపారస్తులకు లాభము. విద్యార్థులకు, నూతనోల్లాసము, కవులకు, కళాకారులకు నటీనటులకు యోగకాలము. 1, 2 తేదీలలో అశాంతితోకూడిన కార్యసిద్ధి. 3, 4, 5, 6 తేదీలలో ధనాదాయము, మిత్రదర్శనము, విందు వినోదములు. 7 వ అస్వస్థత.

మీకు 8-2-58 నుండి ఇదివరకుయున్న అవయోగములు తొలగి పోవును. భాగ్యలాభము ఉండును. 17-5-58 నుండి 20-7-58 వరకూ కొద్దిగా యోగము తగ్గిననూ 21-7-58 నుండి ఎప్పటిలాగున భాగ్యయోగము కలిగి 7-11-58 నుండి మరికొంత వృద్ధియగును.

### * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారము మీకు యోగప్రదము. ధనాదాయము వృద్ధిపొందును. సంఘక్షేమ కార్యకలాపాలలో పాల్గొంటారు. కోర్టు వ్యవహారములు అనుకూలిస్తవి. వాహన యోగము కలుగుతుంది. బంగారము వ్యాపారస్తులకు, బట్టల వర్తకులకు లాభము. విద్యార్థులు ఆసక్తిగా చదువుకుంటారు కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మంచికాలము. 1, 2 తేదీలలో కార్యాచరణ వల్ల శ్రమ. 3,4, 5, 6 తేదీలలో ప్రయాణము, కార్యలాభము, విందు భోజనము.

ఈనక్షత్రం 1, 2, 3 పాదములలో జన్మించిన వారికి 1958 వ సం॥ములో శతభిషం నక్షత్రమునకు వ్రాసిన ఫలములు వర్తించును. 4 వ పాదంలో జననమైనవారికి ఉత్తరాభాద్ర వ్రాసిన ఫలితాలు వర్తించును.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఆర్థికాభివృద్ధికి మీరుచేసే ప్రయత్నాలు ఈవారంఫలించవు. చేతనున్నడబ్బుతో అవసరాలు తీరక గృహకలతలు వస్తాయి. కార్యభారముచే శరీరస్థితి చెడుతుంది. వెంటనే శ్రద్ధతీసుకొనుట మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు తలెత్తుతాయి. వర్తకులకు ఆందోళన. 1, 2 తేదీలలో త్రిప్పట, కార్యభంగము, అనారోగ్యము, 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, పితృసహాయము, స్వల్ప లాభము 7 వ ఆందోళన.

8-2-58 నుండి మీ పరిస్థితులలో కొంత వరకూ మంచిమార్పులు కలుగును. 17-5-58 నుండి 20-7-58 వరకు ధనయోగము. 21-7-58 ఈ యోగము తగ్గును. సంవత్సరాంతమునకు తిరిగీధనయోగముకలిగి భాగ్యాభివృద్ధియగును.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము సకాలములో డబ్బుచేతికిరాక కార్యములు నెరవేరవు. ఇంత వరకు వ్యతిరేకుడని అపోహపడిన వ్యక్తి సహాయమువల్ల కార్యానుకూలత పొందుతారు. వ్యాపారస్తులకు మొదట్లో ఆశాభంగము. వారాంతమున లాభము. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. 1, 2 తేదీలలో ఒత్తిడి, అధికఖర్చులు, ఆశాభంగము, శరీరాయాసము. 3, 4, 5, 6 తేదీలలో ప్రయాణము, వింత సహాయము. కార్యానుకూలత. 7 వ గృహమందుండు వారి ఆరోగ్యచింత.

8-2-58 నుండి మీ పరిస్థితులలో కొన్ని మంచిమార్పులు కలుగును. 17-5-58 నుండి 20-7-58 వరకూ ధనయోగము కలుగును. 21-7-58 నుండి ఈ యోగము తగ్గును. సంవత్సరాంతమున తిరిగీ ధనయోగము కలిగి సంపద వృద్ధియగును.



# వనితా లోకం

## దేవుడు వరమిచ్చినా...

**కుమారి ఎ. కనకం**

వివాహావిషయములలో వరకట్నము పుచ్చుకున్న, యిచ్చి, లేక ప్రోత్సహించిన వారికి ఆరు నెలలు కృష్ణజన్మస్థానము లేదా ఒక సంచి రూపాయిలు జరిమానా లేదా రెండు విధింప బడుతవని పేపరులో చదవగానే అమితానందం కలిగింది. వెంటనే ఈ మహోపకారమునకు మూలపురుషులైన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారికి కన్యలందరి తరఫున కృతజ్ఞతాంజలిసమర్పించాను. కాని అంతలోనే ఏదో చిన్న ఆలోచన కలిగింది. చట్టాన్ని పెట్టి శాసించ గలరుగానీ చేతులపట్టి చేయించగలరా? అని. ప్రభుత్వం వరకట్న నిషేధ బిల్లు అనే పేరుతో ఒక తెల్లకాగితాన్ని శాసనపత్రంగా మార్చ గలిగినంత తేలికగా మానవుల హృదయాన్ని మార్చలేదు కదా అనిపించింది.

ఇంతలో పక్క యింటి ఆసామి వారి స్నేహితులు యీ విషయమే చర్చించడం ప్రారంభించారు. ఎవరి భావాలెలా గుంటాయో అని జాగ్రత్తగా వింటూ కూర్చున్నా. ఏమండోయి రామభద్రుడుగారూ. ఇవ్వాళ పేపరు చూచారా! వరకట్న నిషేధపుబిలు అమలులోకి వచ్చిందట. అన్నాడు. ఎంతో బాధతో ఏదో పోగొట్టుకున్న వాడిలా.

“మాచానండి. చాలా సంతోషం. మహానుభావుడు అయ్యదేవర కాళేశ్వరరావుగారి ధర్మమా యిక ఆడపిల్లల కన్న తల్లిదండ్రులకు కట్నాల బాధ తప్పింది. ఈ కట్న పిశాచివల్లనే కదండీ ఏలోటు లేని మా అమ్మాయి యింతవరకు పెళ్ళి చెయ్యలేకపోయాను. ఇంక నా బెంగ తీరిందండి. ఏదో ఓ సంబంధం చూచి మా చిట్టి తల్లిని కూడా ఓ యింటి దాన్ని చేస్తాను.

“మీకే ముందండి ఒక్కమ్మాయి. ఎలాగో ఒకలా చేస్తారు. మరినాగతేమిటి నలుగురూ మగపిల్లలు కదా అని పొంగిపోయాను. నలుగురూ నాలుగు సంస్థానాలనుకున్నాను. ఎంతో ధైర్యంగా ఏడు వేల రూపాయలు ఖర్చు పెట్టి పెద్దాణ్ణి ఎం. బి. బి. ఎస్. చదివించాను. పెట్టిన డబ్బుకు ఢోకా వుండదనుకున్నాను. ఈ దిక్కుమాలిన బిల్లు యింత తొందరలో వస్తుందని తెలిస్తే యీ పాటికి పెళ్ళిళ్లు చేసేసేవుండేవాణ్ని. ఈ కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చాక చేసేవన్నీ యీలాంటి పనికిరాని చట్టాలే. బ్రిటిష్‌వాళ్లున్నపుడెంత హాయిగా వుండేది. ఇంకలాంటి రోజులు మళ్లీ వస్తాయండీ? అయినా పిచ్చిగాని యిల్లలగ్గానే పండగయిందేమిటి? కట్నం కాకపోతే మరోపేరుతో కానుకగా పుచ్చుకుంటాం కాని మానేస్తాముటండీ” అన్నాడు ధైర్యంగా.

ఎవరెలాపోతే నాకెందు కన్నట్లుగా “మీ ఆలోచన బాగుందండి. మరోసారి కలుసుకుంటానం”టూ జారాడు రామభద్రుడుగారు.

* * *

ఒక్కసారి ఆశ్చర్యమేసింది. ఒక పనివల్ల కొందరికి లాభం కొందరికి నష్టం కొందరికి సంతోషం కొందరికి విచారం. మా చెల్లెలు తమ్ముడూ వాదించుకొంటున్నారు. ఏమిటో అని అలా వెళ్ళా. చెల్లాయి తమ్ముడిని వుడికిస్తోంది. “అన్నయ్యా! పాపం వచ్చే డబ్బు పోయిందారా? ఎంత దురదృష్టవంతుడవురా?” తమ్ముడుమాత్రం తక్కువవాడా. ‘పోనీలే నిన్ను కాని ఖర్చులేకుండా తోలేస్తాం.’ సరికిసరి. పాపం నాన్నగారికి నష్టం లేదనిపించింది. ప్రపంచమంతా యింతే. చిన్న నా పొట్టకు శ్రీరామరక్ష అంటూంటారు.

నిజంగా యీ కట్నాల పేరుతో ఎంతమంది కన్యలు ఆత్మహత్యలు చేసికోలేదు? యిప్పటికి ఎందరు అవివాహితులుగా నుండలేదు. హాయిగా మగవాడు సంపాదించి తెస్తే యింట్లో కూర్చుని, యిల్లు చక్కబెట్టుకుని గృహలక్ష్మి అని అనిపించుకోవలసిన కన్య లెందరో తమ జానెడు పొట్టకోసం వుద్యోగంలో చేరి మగవాళ్ళచేతే కాకుండా అమ్మలక్కలచేతకూడ రకరకాలుగా అనిపించుకోవలసి వచ్చుటకు కారణమెవరు? ఈ కట్నాల దాహం తీరని రాతిహృదయాలు కదూ. ఈ బాధవలనే కదా ఆడపిల్ల పుట్టిందనగానే అయ్యో ఆడపిల్లా ఎంతో హీనంగా మాట్లాడం.

ఈ చట్టం ధర్మమా ఈ దురాచారాన్ని అమూలంగా పోగొట్టలేకపోయినా మనమందరము కూడా తీవ్ర కృషిచేస్తే దేముడిచ్చిన వరం తప్పకుండా ఫలిస్తుంది. చదువుకున్న యువతీయువకులందరూ శాసనంగా వస్తున్న యీ దురాచారాన్ని ముందంజవేసి కూకటివేళ్ళతో పెళ్ళగించి నామరూపాలు లేకుండాపోవునట్లు పాటుపడాలి. దేముడు వర మిచ్చాడు దానిని పూజారుల బారినుండి తప్పించి రక్షించుకోవాలి.

ఎన్నో కష్టాలకు గురవుతున్నా కన్యల కారుణ్యజీవితంలో కాంతికిరణాలు యిప్పుడిప్పుడే ప్రసరిస్తున్నాయి. వివిధమైన మబ్బులు తుపానులు, రాకుండా కాపాడే బాధ్యత మహిళామణులందరిదీ అనే విషయం మరిచిపోకూడదు.



# ★ కలకంఠి కంట కన్నీరొలికిన

ఈనూక్తి, బాగానే వున్నది. ఈ కన్నీళ్లు అనేవి మూడురకాలున్నాయి. ఒకటి శోకచేతను, రెండు దుఃఖం మూలంగా మూడు, సంతోషంవల్ల. మూడోరకపు కన్నీళ్ళనే, ఆనందబాష్పాలు అని కూడా అంటారు. దుఃఖానికి, దుఃఖాశ్రువులనీ అంటారు. అది సరే, కానీ, ఫలానా కలకంఠి ఎందుకు కన్నీరు పెట్టిందీ అంటే, అందుకు సవాలక్ష కారణాలుంటాయి. కారణాలున్నా, తగినంత లేకపోయినా, చీటికీ, మాటికీ, ముక్కు చీదేస్తూ కళ్ళనీళ్లు పెట్టేవాళ్ళున్నారు. అందుకే కాబోలు; ఆడవాళ్లకి నెత్తిన నీళ్ళకడవ వుంటుందనీ, దాని మూలాన్నే ఆ ప్రమాణం కన్నీరు త్వరగా వస్తుందనీ అంటారు. అది సహజమే! ఎందుకంటే, నెత్తిమీద నీళ్ళకుండలు, దొంతర్లుగా, ఎంతదూరమైనాసరే ఇంటికొ్చవలసిన నీళ్ళన్నీ మోసుకొస్తూ ఉంటారు. అంచేత రెండువిధాల అన్వయించుకోవచ్చు.

అది సరే, ముఖ్య విషయానికొద్దాం. కలకంఠికంటినీరొలికిన సిరియింటనుండ నొల్లదు. అయితే కారణం లేకుండా ఎందుకు, ఏ సందర్భంలో ఆ కలకంఠి కన్నీరు పెట్టవలసి వచ్చింది? ఎప్పుడు ఆ సిరి ఇంటినుండి వెళ్ళిపోతానందీ, బహుశా ఆ సిరితో వెళిపోయిన తరువాతే ఆవిడ, రోదించిందో! లేక,

## శ్రీనివాస యామినీ పూర్ణతిలక

ఈమె విచారవదనం చూశాక, ఆమె వెళ్ళిపోయిందో తెలియదు. కాని, ఏది, యెలాగున్నా ముందు, యింటినుండి భర్తే వెళిపోతాడు. కలకలలాడే బదులు. ఈ కన్నీరేమిటీ అని, యెలాగైనా పెద్దలు మారాలోచనలోనే [illegible] మూటనివుంటారు. స్త్రీ ఎప్పుడుకూడా, అగ్గి, సెగ, పొగ, వుల్లి ఖారం మొదలైన వాటిల్లో మెసులుతూ వుంటుంది. అంచేత వీటినుండి, వచ్చే కన్నీళ్లు ఆపుకుందామన్నా ఆగవు. అట్టి పరిస్థితిలో భర్తయొక్క, ప్రేమానురాగం, దయతో కూడిన సానుభూతి, చల్లనిమాటే, ఆడదానికి అవసరం. అవచ్చే కన్నీ రెటువంటిదైనా, ఇట్టే, ఇంకిపోతుంది. అలా కాకుండా, చీటికీ, మాటికీ అనవసరంగా కసూర్లు బుసూర్లు మంటూ, మనసు నొప్పించేలా ప్రవర్తిస్తుంటే ఎంత ఆపుకుందామన్నా కన్నీ రాగదు. తన వల్ల ఏలోపం లేనప్పుడు భర్తే సర్వస్వం అని తన బాగోగులు చూస్తూ సంరక్షణ చేస్తున్నప్పుడు, భార్యని దుఃఖపెట్టి మనసు బాధించినందువల్ల నష్టమే కాని లాభముండదు. అందుకే ఈ ప్రయోగం చేసేరు. కలకంఠి కంటినీరొలికిన సిరి ఇంటనుండనొల్లదు అని.

సాధారణంగా గృహిణి, మనస్సు ఎంత బాధపడినా, ఎంతో [illegible]పరిస్థితుల్లో ఉన్నా కూడా, కన్నీళ్ళాపుకుని విచారాన్ని దిగమింగుతూ, ఆనందంగా వుండాలనే ప్రయత్నిస్తుంది. భరించలేని ఎన్నో కష్టపరంపరలు



లోలకు　　　　తులసికోట

వాశిరెడ్డి విజయసుశీలకుమారి, (తుమ్మపూడి)




## తలనొప్పికి

తలనొప్పి వచ్చిందంటే ఎలాటి వాళ్ళనైనా కుంగదీసేస్తుంది. తలనొప్పి వచ్చిందంటే కొందరు తలపైకెత్తి చూడ్డం కూడా కష్టమై పోతుంది. అలా ఉధృతంగా వున్నప్పుడు చేసేదే ఈ చిట్కా వైద్యం. ముద్దహారతి కర్పూరం తెచ్చి ఓ సీసాలో వేసి పుదీనా పువ్వు తెచ్చి రెండు కలిపి కణతలికి బాగా రాస్తే ఓ పావుగంట అయ్యేసరికి పోయి కనుపిస్తుంది. మిరియాలు సొంఠి బియ్యం నూరి వేస్తారు కానీ దానికన్నా కూడా ఈ కర్పూరమే బాగా పనిచేస్తుంది.

బాలింతతనంలో కాని, చిన్న పిల్లలకుగాని జ్వరం తగ్గిందని భోజనం పెట్టినప్పుడు ఒక్కొక్కప్పుడు మళ్ళీజ్వరం అంకవంకాల వస్తూంటుంది. అలాంటి అన్నం పెట్టినదోషానికి ఆ అన్నమే మందు. వేడి అన్నం తీసి చాయపసుపు, నూనె వేసి ముదురంతా కాస్తే, ఆదోషం తగ్గుతుం దంటారు. ఓర్చుకోగలవాళ్లు ఓ మిరియం గాని, బియ్యంగింజ కాని అరగదీసి కలికం అని కూడా పెడతారు. అలా పెడితే తలభారం తగ్గిపోయి కనుపిస్తుంది.

* * *

## గర్భిణీల నిస్సత్తువకు

కొందరు గర్భిణీలుగా వున్నప్పుడు చాలా నీరసంగా వుంటారు. అలాంటివారు ఉదయం ఓ ½ కప్పు పాలలో 2 మజ్జిపండ్లు వేసి కాచి ఆ కాయలు తీసేసి ఆపాలు త్రాగితే బలం చేస్తుంది. ఆ బలం ఆమెకే కాక గర్భంలో పసిపిల్లకు కూడా బలం చేస్తుంది. ఇదికాక మంచి కుంకుంపువ్వు (అనగా నోట్లో వేసుకుంటే కరగాలన్న మాట,) దొరికితే కాశ్మీర్ కుంకుంపువ్వు రాత్రి పడుకునేప్పుడు ఓ చిటికె పాలలో కలిపివాడినా మంచిబలం చేస్తుంది. అలా పాలు సరిపడనివారు తాంబూలంలో సేవించినా రక్తం వృద్ధిచేస్తుంది. శరీరానికి బలం చేస్తుంది, కాని కొంచెం వేడిచేస్తుంది కనుక తత్వాన్నిబట్టి వాడాలి.

వేడితత్వంకలవారు ప్రతిదినంకాక అప్పుడప్పుడు వాడుకోవాలి. ఈ కుంకుంపువ్వు బజార్లో మంచిది దొరకదు. పైచెప్పిన పరీక్షకు ఆగే మంచిపువ్వు వీధుల్లో అత్తరు సెంట్లు తెచ్చే సాయబులదగ్గర దొరకచ్చు. లేదా ఆయుర్వేద మందుల షాపులలో దొరుకుతుంది.

* * *

## పైత్యం, వొళ్లత్రిప్పు

మాదీఫలరసాయనం ప్రతిదినం విడువకుండా ఓ వారం వాడితే పైత్యం, తల, కళ్లు త్రిప్పు తగ్గగలదు. లేదా అల్లంరసం కాని అల్లంతో చేసిన మరి ఏదైనా వాడినా తగ్గగలదు.

* * *

## గుండెలలో మంట

కొందరికి బోరంతా మండుతూంటుంది. ఈ గుండెలలో మంటకు, పచ్చి కొత్తిమిరి 2 కట్టలు ఓ గ్లాసునీళ్లలో వేసి ½ కప్పు అయ్యేదాక మరిగనిచ్చి ఆ కషాయం త్రాగితే తగ్గగలదు. అలా మూడుదినాలు త్రాగితే తప్పకుండా తగ్గుతుంది. ఇది అతి

(89-వ పేజీ చూడండి)

# వంటలు

## బంగాళదుంప అప్పడాలు

కావలసిన సామాను: ½ వీశె బంగాళదుంపలు, ½ శేరు చోళ్ళు, ఒక అణా పచ్చిమిరపకాయలు, తగినంత ఉప్పు.

తయారుచేయు విధము: చోళ్ళు శుభ్రముగా చాయి, రవ్వ లేకుండా బాగుచేసి మెత్తగా విసిరించి ఆ పిండి మునుగువరకు నీళ్ళుపోసి 4 గంటలు నానబెట్టి, రోట్లోపోసి మెత్తగా రుబ్బి పల్చటిగుడ్డలో వడికట్టి పాలు తీయవలెను. ఆ రోజున ఆపాలు కదపకుండా మూతపెట్టి ఒకచోట ఉంచి మరునాడు పైనీరంతయు పారపోసి అడుగునఉన్న చిక్కని పాలు ఒక కళాయిగిన్నెలో పోసి సన్నటి సెగమీదపెట్టి గరిటతో అడుగంటకుండా ఆ పాలు ముద్దలా అయ్యేవరకు త్రిప్పాలి. అరవీశె బంగాళదుంపలు ఉడకబెట్టి తొక్కు తీయవలెను. తరువాత రోటిలో కొంచెం పచ్చిమిరపకాయలు, ఉప్పు మెత్తగా రుబ్బి తరువాత చోళ్ళలో వచ్చిన పాలముద్ద ఉడికిన బంగాళదుంపలువేసి అన్నీ బాగా ముద్దలా కలిసేటట్టు మెత్తగా రుబ్బాలి. రుబ్బిన తరువాత నిమ్మకాయంతేసి ఉండలుచేసి ఒక పీటమీద ఒక ఆకువేసి ఆ ఆకుమీద డాల్డా కాని, నూనెకాని వేసి ఉండపెట్టి ఆ వుండమీద వేరొక ఆకువేసి ఆ ఆకుమీద అప్పడాల కఱ్ఱతో అప్పడంలాగ వత్తాలి. ఆకు అంటే ఏమి ఆకు అనుకునేరు. అరటిఆకే వేయాలి. ఎప్పుడు ఆకు వేసినా ఆకుమీద నూనిరాసే వత్తాలి. లేకపోతే అప్పడం ఆకుకు అంటుకు పోతుంది. ఆ అప్పడములను ఎండలో వేసి ఎండనిచ్చి డబ్బాలో పెట్టి మూతపెట్టుకుంటే రెండు నెలల దాకా బాగుంటాయి. సాధ్యమైనంతవరకు నేతిలో వేయించుకుంటే చాలబాగుంటాయి, తప్పితే డాల్డా అయిన బాగుంటుంది కాని నూనెలో వేయించవద్దు.

చేతులు అరికాళ్లు మంటలకుకూడా మంచిదే.

## అత్యుష్ణం

కొందరకు అత్యుష్ణత వుంటుంది. దీంతో జ్వరం వచ్చినట్టు వుండడం, కళ్లుమంటలు అవీ వుంటాయి. అలా వచ్చినప్పుడు అన్నం వొక్కవుడుకు రానిచ్చి, ఆ నీరులో ½ గ్లాసు తీసుకుని పంచదారకాని, వుప్పుకానీ వేసి త్రాగితే ఆ వుష్ణం తగుతుంది. ఆ నీటిని చిటుదుడుకునీరు అంటారు. ఇది మామూలుగా అన్నంతినే మనుష్యులకే వాడాలి. జబ్బు మనుష్యులకు, బాలింతలకు వాడరాదు. వారికి బార్లీ వాడవచ్చు.

## పళ్ల ఇగుళ్లకు

వంటి ఇగుళ్లు ఉబ్బి కొందరు చాలాబాధ పడుతూంటారు. అలా వచ్చినప్పుడు ఓ గ్లాసు గోరు వెచ్చనీరు తీసుకు ఓ టేబుల్ స్పూన్ వుప్పువేసి అవి బాగా పుక్కిలించి వుమ్మవలెను. పంటిజబ్బువాళ్ళు ప్రతిదినం రాత్రులు ఈ వుప్పునీటితో నోరు శుభ్రం చేసుకుంటే పళ్లు పుచ్చుకుండా వుప్పు పంటిలో క్రిమిని చంపగలదు. నీరు గవద బిళ్ళలు వచ్చినప్పుడుకూడా పుక్కిలించిన, గవదలు నయంచేయును.

డి. భాస్కరమ్మ, వంగోల్.

## పనస తొనల అప్పడాలు

పనస తొనలను శుభ్రముగా కడిగి గిన్నెకు వాసెన కట్టి ఆ వాసెనమీద ఈ తొనలు పెట్టి కుంపటిమీద గిన్నెను పెట్టి మెత్తగా ఉడికించాలి. పచ్చి మిరపకాయలు, ఉప్పు వేసి, ఆ ఉడికిన పనస తొనలనికూడ వేసి మెత్తగా రుబ్బి బంగాళదుంపల అప్పడములవలెనే ఆకుమీద ఆకువేసి వత్తి ఎండలో వేయవలెను. ఇవి తియ్యతియ్యగా చిన్న పిల్లలు కూడ కారం లేకుండా తినుటకు చాల బాగుంటాయి. ఇవికూడ రెండు నెలలదాకా బాగుంటాయి. ఇవి టిఫిను క్రింద చాల బాగుంటాయి. ఈ అప్పడములు ఎండ వచ్చినప్పుడే చేసుకోవలెను. ఎండకపోతే అప్పడములు బూజుపట్టి పాడగును.

## పిండి అప్పడములు

ఈ అప్పడములు చేయుట కొంచెము కష్టమైనా చేసినతరువాత వేయించుకుని తింటే చాలరుచిగా ఉంటాయి. నోట్లోవేస్తే కరిగి పోతూ ఉంటాయి. మొదటిరోజున ఒక అర్థశేరు బియ్యం రాయి, రప్పా లేకుండా ఏరుకుని నీళ్ళలోపోసి నానబెట్టవలెను. మరునాడు ఆ నానినబియ్యమును కడిగి బుటలో వాడేసి దంపించి మెత్తటిజల్లెడతో జల్లించి ఆ తడిపిండిని ఒక కళాయి పాత్రలోపోసి పిండి మునుగువరకు నీళ్ళుపోసి ఉప్పు వేయకుండా మూడురోజులవరకు నానపెట్టవలెను. మూడవనాడు సాయంకాలం ఆపిండికి ఉప్పువేసి రోటిలో వేసి మెత్తగారుబ్బి ఒక కళాయిగిన్నెలోనికి తీసుకుని కావలసినవారు సగ్గుబియ్యం ఒక అరసోలడు ఆపిండిలో కలిపి ఆరాత్రికి ఆపిండిని అల్లాగేయుంచవలెను. బాదమాకులు తెప్పించి ముచ్చికలు తీసి సాపుగాఅయ్యేటట్లు ఏతిరగలి క్రిందనో పెట్టి ఉంచవలెను. మరునాడు పొయ్యిఅంటించి ఒకగిన్నెలోనీళ్ళుపోసి ఆగిన్నెకు వాసినకట్టి మూతపెట్టి ఉంచవలె. ఆనీళ్ళు మరిగేలోపున బాదమాకులు తీసుకుని ఒక ఆకుమీద కొద్దిగా నూనెరాసి చేతిగరిటతో మెత్తగా రుబ్బిన బియ్యం పిండిని తీసుకుని అట్లుపోసినట్లు పల్చగా గుండ్రంగా ఆకుపట్టినంతమేర రాయవలెను. ఆ రాసిన ఆకును తీసుకుని వాసినమీదపెట్టి ఆవిరిపోకుండా మూత పెట్టవలెను. ఇంతలో ఇంకొక ఆకుమీద తిరిగి రాయవలెను. ఇది రాసేలోపున వాసినమీద ఉన్న ఆకు నల్లబడును. అది తీసి చేతితో నెమ్మదిగా ఒలిచి ఎండలో వేయుచుండవలెను. దీనికి ఇదరు మనుషులు తప్పకుండా ఉండవలెను. ఒకరు ఆవిరిమీద పెడ్తుంటే రెండవవారు ఆకు మీదది ఎండలో వేసి ఒక పావుగంట విసిరితే పట్‌మని విరిగేటట్లు ఎండనిచ్చి తీయుచుండవలెను. ఇవి చాలా పెళుసుగా యుండును గనుక ఎండలో తీసేటప్పుడు చాలా జాగ్రత్తగా యుండవలెను. ఇవి నూనెమరిగాక వేసి వేయించుకుంటే సన్నగా, చిన్నదిగా, నల్లగా ఉండే అప్పడము తెల్లదిగా పెద్దదిగా వచును. ఇవి వంటిపిల్లలకు కూడ పెటిసా ఏమి జబ్బు చేయవు. ఎంత జబ్బుచేసినా సరే ఇదినిప్పులమీద కాల్చి నెయ్యిరాసి పెట్టే ఏమిచెయ్యవు దీనికి ఖర్చు కూడా ఎక్కువ ఉండదు. ఎవరైనా స్నేహితులు వస్తే ఇవి వేయించి పెట్టే డాబుగా యుండును. ఇవి ఒక సంవత్సరము వరకు నిలవయుండును.

## అరటికాయ ఒడియాలు

రెండు అరటికాయలను తొక్కు తీసి ఉడకబెట్టి అల్లం, పచ్చిమిరపకాయలు, తగినంత ఉప్పువేసి మెత్తగా రోటిలో దంపి పొయ్యిమీద బాణలిపెట్టి నెయ్యిగాని, నూనె గాని పెట్టి గార్లులాగ ఆ నూనెలో చిన్న చిన్న ఉంటలుచేసి చేతితో తట్టివేస్తే కాస్సేపటికి ఎఱ్ఱగా వేగును. కొద్దిగా బియ్యపు పిండిని కూడ వేస్తే కరకరలాడుతూ తినుటకు చాల బాగుంటాయి. ఇవి అన్నంలో ఆధరవు క్రింద కూడ పనికివస్తాయి. టిఫిను క్రింద పనికివస్తాయి. ఇవి నిలవ వుండవు. అప్పటికప్పుడు చేసుకుంటే సేపనికివస్తాయి.



కిళాంబి సత్యవతీదేవి, (కాకినాడ)

# నేరాలు నేర్పే గారాలు

దద్దనాల రంగనాయకమ్మ

స్వానుభవం లేకపోయినా, యింటా బయటా జరిగే అనేక సంఘటనలను బట్టి, పిల్లలపెంపకంలో ఆరితేరామనుకొంటున్నవారిప్రవర్తనలోని మంచి చెడ్డల్ని కనిపెట్టవచ్చు. పిల్లలపెంపకం ఎంత కట్టుదిట్టంగావుంటే, వాళ్ల భవిష్యత్తంత హాయిగా వుంటుందనేవిషయం ఎవరికి తెలీందిగాదు.

పిల్లల్ని గారం చెయ్యడానికి మితి ఉండాలి. ఇది వాళ్ల పెంపకంలోని అతిముఖ్యవిషయం. ప్రేమరూపాంతరమే గారం. పిల్లలపట్ల తల్లిదండ్రులహృదయాల్లో ప్రేమ పొంగుతూ వుంటుంది కాబట్టే గారం చేస్తారు. కానీ, ఈ గారం శృతిమించి రాగానపడితేనే గొడవ జరుగుతుంది.

కొందరు అతిచాదస్తంగా గారంచేస్తారు. చూసేవాళ్లకి చిరాకేస్తుంది. ఒకావిడ పేరంటానికి ఏడేళ్ళ పిల్లాణ్ని తీసుకొచ్చింది. వచ్చిందిలగాయితూ పళ్ళెల్లోవున్న ఫలహారాలుచూపిస్తూ, పెట్టించమని ఆపిల్లవాడు తల్లిని వూపుతూ ఒకటేగొడవ. ఆవిడ చూసీచూడనట్టూరుకుందిగానీ, తప్పని సైగజేసి కళ్ళెఱ్ఱచేస్తే (అసలు మొదట్నుంచీ అలవాటు గదూ బహుశా వినక పోవచ్చు) ఆ పిల్లవాడు రాగం తియ్యటం సాగించాడు. చేసేదిలేక ఆవిడ యింటివారమ్మాయిని పిలిచి "కాస్త వీడికి అతినేది తగలెయ్యమ్మా. ఏడిచి పోతున్నాడు" అంది. ఆ అమ్మాయి తటపటాయిస్తూ యింట్లోకి వెళ్ళి ఏదో తెచ్చిపెట్టింది. ఏడేళ్ల పిల్లవాడు అలా పేరంటంలో తిండికోసం మారాం చెయ్యటం ఆవిడకి తప్పుగా తోచలేదు. కనుకనే వాడి అలవాటు మాన్పించలేదు సరిగదా మహా దర్జాగా నలుగుర్లోకి తీసుకొచ్చింది. పుట్టి పెరుగుతున్నంతమాత్రాన మంచీ చెడ్డా వాళ్ళు స్వయంగా నిర్ణయించుకోలేరు. తప్పు చేస్తున్నామని తెలీదు. ఎప్పటికప్పుడు పెద్దలు పిల్లలకు నయానో భయానో మంచి పద్ధతులు నేర్పుతూండాలి.

## మెప్పు

ఇంటిముందు ఏ వర్తకుడైనా తన సరుకు దింపటం భయం. వాడితో పెద్దవాళ్లు బేరాలాడుతూ వుంటారు. కొందరు పిల్లలు సరుకు దగ్గరచేరి (పళ్ళుగానీ, తినుబండారాలుగానీ, ఆఖరికి కూరగాయలు కూడా) నెమ్మదిగా ఒక్కొక్కటిలాగేసి దాచేస్తూంటారు. కావిట్లో రెండుగంపలుంటే దేన్నని చూసుకొంటాడు వర్తకుడు? పిల్లలలా చేస్తున్నారని వర్తకుడికితప్ప అందరికీ తెలుస్తూనే వుంటుంది. ఏమీ అనరు. సరికదా, ఒకవేళ బేరంకుదరక వర్తకుడు వెళ్ళిపోతే, "బాగా శాస్తిచేశార్రా. వసేమిరా తగ్గనని మహా నీలిగిపొయ్యాడు" అంటూ పిల్లల్ని సమర్థించి వాళ్ళు సంపాదించిన సరుకుని పెద్దలుకూడా పంచుకుతింటారాయింట్లో. ఆ యింటివారు కులానికిగానీ, ధనానికిగానీ, చదువులకుగానీ పేదవాళ్లుగాదు. ఒక్క గుణానికే—ఇటువంటి పెద్దల పోషణలో పెరిగిన పిల్లవాడెలాతయారౌతాడో వూహించుకోవచ్చు.

గారంలో ఇంకో రకం చూడండి. సరిగ్గా భోజనాలకి పీటమీద కూర్చునే ముందు "నాకు ఫలానా కూరకావాలి, ఐదు నిమిషాల్లో వండితే వండు. లేకపోతే రెండు రోజుల్దాకా అన్నం తినను" అంటాడా పిల్లవాడు. తల్లి హడలిపోతుంది. "బాబ్బాబు ఈపూటకి తినెయ్యమ్మా సాయంత్రం నువ్వడిగిందే తెప్పించి వండుతాను, బాబ్బాబు." కాళ్ళూ గడ్డం పట్టుకుని బతిమాలుతుందితల్లి. చస్తే వినడు పిల్లాడు. పీట బిందికేసి కొట్టి, అన్నం పళ్ళెం కాలితో తన్నేసి, నీళ్లతో వున్న గాజుగ్లాసు నేలకేసి విసిరి కొట్టి, బూతులు తిట్టుకుంటూ బయటకెళ్ళి పోతాడు. క్షణం నిశ్చలంగా చూసి, గాజు పెంకులు తుడవటానికి చీపురుకోసం వెళుతుందావిడ. "కుర్రసన్నాసి, పెద్దాడైతే గాని బుద్ధిరాదు." అంటూ. వాడికి బుద్ధి వస్తుందో పోతుందోగానీ ఈ సంఘటన చూసినవాళ్లకి మాత్రం మతిపోయి తీరుతుంది. ఆవిడ జీవితంలో పిల్లాణ్ని మందలించదు. తండ్రికి తెలీనివ్వదు. ఆడింది ఆటా, పాడింది పాటగా సాగి, ఆ పిల్లవాడు మంకుతనం, పెంకిపట్టు, అసహనం లాంటి దుర్గుణాలతో పెరిగి పెద్దవాడౌతాడు. ఏవేళప్పుడే కోరిక కోరితే ఆడదెంత కష్టపడుతుందో అతనికి తెలుస్తుందా? పిచ్చిమోజులో తల్లిగాబట్టి కొడుకు దుర్గుణాన్ని సహించినా, రాబోయే ఆడదానికి తిప్పలన్నీనూ. పునాది తీరు అదే!

మనం పెట్టే గారం పిల్లల్ని సర్వనాశనం చేస్తుందే గాని, దానివల్ల రవ్వంతయినా మంచి జరగదని కొందరికి తోచదు. తెలీదు.

ఒకతను యిరవై రెండేళ్ళకి స్కూలు ఫైనల్ పాసయ్యాడు. ఎంతో తెలివిగా చదువుతాడు. ఆర్థికంగా కూడా యిబ్బంది లేని సంసారం. ఐనా కాలేజీ కెళ్ళనన్నాడు." పధ్నాలుగేళ్ళపిల్లలు ఇంటర్ చదువుతోంటే వాళ్ళపక్కన నేనెలా కూర్చోను? నాకు సిగ్గుబాబూ. ఎలాగో యింటిదగ్గరే తంటాలు పడతానుగానీ" అన్నాడు. పాపం అతని పరిస్థితిచూస్తే జాలేస్తుంది. అతని తప్పేంలేదు. చిన్నప్పుడు బడికెళ్ళనని పేచీ పెట్టేవాడట. పిల్లాడేడవటంతోటే అతనితండ్రి "పోనీలేమ్మా, మళ్ళా ఏడు వెళ్ళొచ్చు. అసలు చెప్పించే ఓపికుండాలి కానీ, అబ్బో, చాలాకాలముంది చదువుకోటానికి" అని పిల్లవాణ్ని బుజ్జగించి, బడికి వెళ్లనిచ్చేవాడు కాదట. ఈ విధంగా తొమ్మిదేళ్ళవరకూ జరిగాక పిల్లవాడికే కొంచెం వూహావచ్చి బడికెళ్లి శ్రద్ధగా చదివినా పోయిన వయస్సు వెనక్కొస్తుందా? —చిన్నతనంలో బడికెళ్లటమంటే మహా యిబ్బంది పడిపోతారు పిల్లలు. తప్పకుండా మారాం పెడతారు. అంత మాత్రానికే వాళ్ల మాట సాగనిస్తే చెడేదెవరు?

కొందరు పిల్లలకు సరిగ్గా వయస్సు రాకుండానే సకల విద్యలూ నేర్పుదామని చూస్తారు. ఊహాకందని విషయాలు చెప్తే, పిల్లలు బేజారై చదువంటేనే భయపడటం జరుగుతుంది.

పాఠం రాలేదని పిల్లవాణ్ణి కొడితే, పంతులమ్మ మీదకి యుద్ధానికొస్తుందొకావిడ. పిల్లలందరి ఎదురుగా పంతులమ్మని నానామాటలూ అని వస్తుంది. ఇకపిల్లలకి పంతులమ్మమీద గురి తప్పుతుంది. పసితనం నుంచే భయభక్తిలేని చదువై పోతుంది.

ఇద్దరుపిల్లలు పోట్లాడుకొంటున్నారనుకోండి అందులో తనపిల్లవాడిదే తప్పని ఆతల్లికి తెలిసినా, గారంమూలాన, తప్పు చేసినప్పటికీ తన పిల్లాణ్ణి వెనకేసుకుని ఎదటివాళ్ళమీదకి జగడానికెళ్తుంది. కానీ తన పిల్లవాణ్ణే మందలించదు. న్యాయాన్యాయాలు చూచే అలవాటులేని తల్లిదండ్రుల ప్రవర్తన ప్రభావం పిల్లవాడిమీదపడుతుంది. వాడూ అలాగే ప్రవర్తిస్తాడు.

ఇంకోవిషయం. పిల్లల వేషభాషలలో కూడా చాలాశ్రద్ధ తీసుకోవాలి. అతి విలువగల బట్టలు. రకరకాల ఫాషన్స్‌లో కుట్టించి వాడకూడదు. ఎంత ధనవంతులైనా పిల్లల్ని అతిసాధారణంగా, పరిశుభ్రంగానే వుంచాలిగానీ, చిన్నతనంనుంచీ విలాసాల కలవాటు

(42- వ పేజీ చూడండి)




11-12-57 సంచికలో "నల్లని వాళ్ళంటే ఎందుకంత హేళన" అన్న వ్యాసంలో శ్రీమతి ఉత్తర వాస్తవిక విషయాలను చక్కగా చెప్పారు. హేళనచేయుటం అనేది ఒక్క శరీరచ్ఛాయమీదనేకాకుండా మనిషియొక్క ఆకారాన్ని బట్టి కూడ ఎక్కువగా జరుగుతూ ఉంటుంది. పొడవు, పొట్టి, లావు, సన్నము, పళ్ళు ఎత్తు, పిల్లికళ్ళు మొదలైనవి ఆధారంగా తీసుకుని అవతల మనిషి అవమానంతో బాధపడేటట్లు నలుగురిలోను పట్టుకుని హేళన చేస్తూ ఉంటారు కొంతమంది. వాళ్ళు ఏడవలేక నవ్వుతూ ఉంటే వీళ్ళకు సరదా

ఇలా వెక్కిరించడం హేళన చేయుటం అనేది స్త్రీ పురుష భేదం లేకుండా అందరిలోను ప్రబలిపోతున్న మందులేని జబ్బు!

ఇది విద్యార్థి దశలో మరీ ఎక్కువ ఒకళ్ళ నొకళ్ళు 'నిక్ నేమ్సు'తో పిల్చుకోవటం పరిపాటి హేళన చేయటానికి ఎఱుపు, నలుపులతో నిమిత్తం లేదు. అందంగా వున్న వాళ్ళను లేనిపోని వంకలు పెట్టి ఏడిపించి నోటి దురద తీర్చుకోవటం కొందరి హాబీ!

ఎంతమంచివాళ్ళు అయినా ఎప్పుడో ఒకప్పుడు ఎవరినైనా హేళన చేయకుండా ఉండరు. దేనికైనా హద్దు మీరితే ప్రమాదం!.

ఇక పిల్లనలుపైతే కట్నాలెక్కువ అవుతాయని రచయిత్రి అభిప్రాయం ఈ కట్నాల పిశాచానికి ఈ రోజులలో ఎఱుపు, నలుపు తేడా లేదు పచ్చనిపసిమి విద్యా సంస్కారాలుగల అమ్మాయిలు కూడ దీనికి గురి అవుతూనే ఉన్నారు.

కొరుమంచి మారుతి (ఒంగోలు)

* * *

సి. ఉత్తరగారు వ్రాసినవ్యాసము చాలా బాగున్నది. ఈ సమస్య చాలా రోజులనుండి జరుగుచున్నది. మా స్నేహితురాలు చాలా నల్లగావుంటుంది. ఆ అమ్మాయిని చూచిన వారు కట్నం ఎక్కువకావాలని అడిగినారు. నల్లగా వున్నందుకు కట్నం ఎక్కువ ఇచ్చుటకు అమ్మాయి ఒప్పుకొనలేదు. ఇప్పుడు వుద్యోగముచేయుచు తన జీవితము బాగా గడుపుకొనుచున్నది. మన స్త్రీలు కట్నంవిషయములో తిరస్కారభావము కలిగియుంటే బాగుంటుంది.

కె. అనసూయదేవి, (శ్రీకాకుళం.)

* * *

సి. ఉత్తర వ్రాసిన "నల్లనివాళ్ళంటే ఎందుకంత హేళన"అను వ్యాసము చదివితిని. చాలా బాగుగానున్నది.

ఎస్. ఎస్. విజయ, (గుంటూరు.)

* * *

శ్రీ కె. నాగేశ్వరరావుగారు 18-12-57 వార పత్రికలో, గ్రంథాలయాల గురించి, స్త్రీల బాధ్యత, వారి కర్తవ్యములగురించియు, వ్రాసినవ్యాసం సముచితంగానుంది చాలా సంగతులు వివరించారు. వారుచేసిన సూచనలు నిజముగా చాలా గొప్పవి. వాటి నన్నిటిని అనుసరించిన స్త్రీలకు అనేక కర్తవ్యము లేవియు కలుగనేరవు.

గ్రంథాలయములలో లేదిదా, ప్రత్యేకముగ ఏర్పాటుచేసిన వనితలకు ప్రత్యేకత దొరకక పోవచ్చును. ఈ రెంటిని గ్రంథాలయ భవనముండేగాక, వేరుగా ఏర్పాటు చేసి వానిపై అభిలాషగలవారిని అదటకు వెళ్ళమనవచ్చును గ్రంథాలయ సంఘము లన్నియు స్త్రీలకు గ్రంథాలయములు తెరచియుంచు కాలముగురించి ఆలోచింప వలయును. వనితలకు మధ్యాహ్న సమయము విశ్రాంతి కనుక ఆ కాలమున గ్రంథాలయము తెరచియుంచు ఏర్పాటు చేయవలయును.

కొత్తపల్లి ఉమాకుమారి, (పెదములూరు.)

★



రంగులతో నేకాక, కత్తి, కత్తెర, శ్రావణం, కాగితం, జిగురువంటి సాధనాలతో కూడా చిత్రాలు రూపొందించవచ్చునని ఋజువుచేసిన అమెరికన్ చిత్రకారిణి పాసే ఫాక్టస్,

# నేరాలునేర్పే గారాలు

(40-వ పేజీ తరువాయి)

చెప్పటం మంచిదిగాదు. చిన్న వయస్సులో పెద్దసాగను లక్కర్లేదు. దీనివల పిల్లలకు అతిశయం అలవడే ప్రమాదంకూడా వుండదు.

ఇంకో ముఖ్యవిషయం: నాపిల్లలు ప్రయోజకులవ్వాలని ప్రతి తల్లితండ్రీ కోరుకుంటారు కదా. కోరుకోవటమేగాదు, పిల్లల్ని ప్రయోజకులుగా చెయ్యటానికి అవకాశాలు కల్పించి ప్రయత్నించాలి—ఒకదంపతులకు లేక లేక కొడుకుపుట్టాడు. ఎన్ని వుత్సవాలు చేసుకోవాలో అన్నీ చేసుకున్నారు. పిల్లవాణ్ణి సదా కనుసన్నలలో వుంచుకునేవారు. "రోడ్డుమీద కార్లక్రింద పడిపోతావ్. కొట్లాటలవుతాయి. ఇరుగుపొరుగు పిల్లల్తో కలిసి ఆడుకుంటే ఆటల్లో దెబ్బలుతగుల్తాయి. కాబట్టి మనం బయటికెళ్ళొద్దు" అని, యుక్త పర్యంతంగా యింటి నాలుగుగోడల మధ్యే పెంచారు. స్కూలుకెళ్తే కారూ, వెంట సర్వెంటూ, బజారుకెళ్తే తల్లో, తండ్రో, వెంట వుండాల్సిందే. ఆ పిల్లవాడికి స్వంత గొడవలంటూ లేవు. స్వంతభిప్రాయాలసలే లేవు. బుద్ధావతారంలా ఎలాగో పెరిగి పెద్దవాడయ్యాడు. ఇంటి కొచ్చిన చుట్టంతో ధైర్యంగా మాట్లాడలేడు. ఒంటరిగా సినిమాకెళ్ళలేడు. పరి అప్రయోజకుడు. "మా వాడికి తగనిసిగ్గు" అంటుంది తల్లి తప్పేదం కప్పిపుచ్చుకొంటూ.

ఎన్ని రకాలు చూసినా గారం మితిమీరటంవల్ల ఎన్నో అనర్థాలున్నాయని తేలుతుంది. అలాని పిల్లల్ని కోతిగా కఠినంగా శాసించకూడదు. ప్రతీ విషయం లాలనగా నెమ్మదిగా చెప్పాలి. ఒకావిడ మొగుడిమీద కోపం మూలాన పిల్లాణ్ణీ, పిల్లనీ పట్టుకొని నానాహీనంగాను తిడుతుంది "అడుంగి వెధవల్లారా, చవటల్లారా" అంటూ. అటువంటి వాతావరణంలో పెరిగిన పిల్లలు, మానాభిమానాల్ని ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని మర్చిపోయి, నిజంగానే "చవట" లవటానికి అవకాశం వుంది.

పెద్దలంతా ఒక్కవిషయం సదా గుర్తుపెట్టుకోవాలి "పెద్దల ప్రవర్తనని అనుకరిస్తారు పిల్లలు." పిల్లలక్కూడా మనస్సుంటుందని కోరిక లుంటాయని గ్రహించి, వాళ్ళమాటకి విలువిచ్చి వాళ్ళవ్యక్తిత్వాన్ని నిలబెట్టాలి. పిల్లల్ని ఖాతరు చెయ్యకపోతే, వాళ్ళకి పెద్దవాళ్ళమీద సదభిప్రాయం కల్గదు. ఇలా పిల్లల పెంపకంగురించి ఎంతని చెప్పుకోగలం? మన పిల్లలు ప్రయోజకులై మనని సంతోషపెట్టటం మన పెంపకంలోనే వుంది. తల్లి చేతిలోనే వుంది. దుర్మార్గుల్నిగానీ, సన్మార్గుల్నిగానీ తయారుచేసేది ఆమదే. ఈ వ్యాసంలో ప్రతీ వుదాహరణానగ్న సత్యం. పెంపకంతీరుకి ప్రతిబింబం. ★



# కలకంఠికంట కన్నీరొలికిన, సిరి ఇంట నుండ నొల్లదు !

(37-వ పేజీ తరువాయి)

అని ఉడుకుమోతుతనం వచ్చి, విపరీతమైన విచారం కలుగుతుంది. దీనికంతా చిన్నతనం నుండి, స్త్రీ పెరిగిన, వాతావరణం, చిన్నతనం నుండి తల్లిదండ్రుల అదుపు ఇంకా తనకన్న పెద్దవాళ్ళయిన అక్కలు, అన్నలూ అధికారంతో పెరుగుతూ ఏమాత్రం వ్యక్తిగత స్వాతంత్ర్యంలేక, అందరిచేతా మొట్టికాయలు తింటూ అస్తమానం ఏడుపుకే అలవాటుపడుతుంది. ఆడపిల్లయినంత మాత్రాన, చిన్నప్పుడుగాని పెద్దదయినప్పుడుగాని, కోరికలు కలగడం సహజం. వాటికి, ఆడ, మగ భేదా లుండవు కద! ఉదాహరణకి, ఆడపిల్ల, సైకిలు తొక్కకూడదూ, బంతి ఆడకూడదు. చెట్టెక్కకూడదు. చెరువుల్లో ఈదకూడదు. ఇంకా పరుగుల్లోనూ, ఆటల్లోనూ, అనేక వ్యత్యాసాలు చూపెడుతూ తల్లిదండ్రులు బోధిస్తారు. ఇంక అధికారంగా కూడా ఆజ్ఞాపిస్తారు, వద్దమ్మా వద్దూ, నీవాడపిల్లవి. ఎంచక్కా బొమ్మరిల్లు లక్కపిడతలూ గవ్వలూ, చింత పిక్కలతో, ఆడుకోవాలిగాని మొగపిల్లలతో ఆడకూడదు. తిరక్కూడదు. అని అంటారు. ఇంకా శ్రుతి మించి రాగాన పడితే! అయ్యో! అదేమిటే అంత పోరూ అంత గయ్యాళితనం ఆడదానికి తనివస్తుందే? అత్తారింటికి వెళ్ళవలసిన దానవు అడిగి మణిగి వుండాలకాని, అనిఆదేశిస్తుంది అమ్మ. పూర్వకాలంలో, గుఱ్ఱపు స్వారీచేసి కత్తులూ, బాణాలూ, పట్టి యుద్ధంచేసి సమయంతనే, సముద్రాల్లాంటి మహానదులు దాటిన వీరనారీమణులున్నారు. అసలు సీతాదేవి, బంతి ఆడుతుండగా, శివధనుస్సు, క్రిందికి జారిపోతే, తన ఎడమచేత విల్లునెత్తి యింకో చేత్తో బంతిని తీసుకుందిట. తరువాత తరువాత కాలాల్లో ఎలాగున్నా. ప్రస్తుతం నాగరికత, స్త్రీపురుష సమానప్రతిపత్తి గల ఈ రోజుల్లోకూడా, తల్లిదండ్రులు అన్నలూ మొదలైన పెద్దలు ధోరణిమాత్రం పైనచెప్పిన విధంగానే వుంటున్నది. ఇటువంటిపరిస్థితిలోనే, ఆడదాని ఆశయాలు నెరవేరక అస్వతంత్రతో, చాతకానితనం, ఉడుకుమోతుతనంవల్లనే ఏడుపు అలవరుచుకొంది. ఇటువంటి అనవసరపు గొడవలకీ, ఏడుపులకీ తావివ్వకుండా, అందరూ పరిపెట్టుకున్నప్పుడే, కలకలలాడుతూ, కలకంఠి ఉండగలుగుతుంది. అప్పుడు కన్నీరు పెట్టుకోదు: ఆనందంతో మంగా ఉంటే సిరిఇంటి నుండి వెళ్ళిపోవలసిన అగత్యముండదు. ★




# స్వేచ్ఛ

★

సదానంద

★

అన్నయ్య తెచ్చాడు
'చిన్ని' కొక చిలుక -
'చిన్ని' తనగారాల
చెల్లాయి కనుక.

"నాకు - నాకేచిలుక
నేనివ్వ కోనింక"
అని చిన్ని ఆ చిలుక
తో నాట్య మాడింది.

చిన్న పంజర మొకటి
చేయించి అందు,
చిన్నారి చిన్ని తన
చిలుక నుంచింది.

చిలు కెందుకో మిగుల
చిక్కిపోసాగింది.
పలుక దెవ్వరితోను
కుంగబడిపోయింది.

ఒక రోజు అమ్మాయి
ద్రాక్షకాని తెచ్చింది.
ప్రేమతో తన చిలుక
నోటి కందించింది.

భ్రష్టు చిలు కాపండ్లు
ముట్టుకోనంది.
మూతి అవైపునకు
మరలించు కొంది.

చిన్ని' మెత్తని మనసు
చిన్న బోయింది.
పాప మీరీతిగా
బ్రతిమాలు కొంది!

"ఏమంటివే చిలుక -
ఎందుకే అలుక?
తినవేమి యీపండ్లు -
తెచ్చాను నీకై..."

చిలుక ముక్కొకసారి
సవరించుకొంది.
జాలిగా చిన్నితో
పలుకసాగింది :

"నీకేమి ఎఱుకలే
చిన్ని - నాబాధ?
కండ్లతో నాబాధ
కానలేవమ్మ...

స్వేచ్ఛగా నింగిలో
సంచరిస్తుంటే
దానికన్నా సుఖము
నాకెక్కడుంది?...

పచ్చపచ్చనిచెట్ల
పచ్చరంగులతో
కలిసిపోతే మనసు
తేలిపోతుంది...

బంగారు పంజరము
బందిఖానా నాకు.
స్వేచ్ఛ లేకున్నపుడు
చచ్చుటే సుఖము..."

అని చిలుక బాధతో
కన్నీరు కార్చింది.
అది చూచి పాపాయి
గుండె కరిగింది.

చిలుకకై జాలిగొని
స్వేచ్ఛ నిచ్చింది
పాపాయి గుండెలో
బరువు తగ్గింది.

# చల్ తమాషా

(గతసంచిక తరువాయి)

పట్టపగలు ఇంత మోసమా! జమీందారు తెల్లబోయాడు. కిటికీలోంచిచూస్తే ఏం కనిపిస్తుంది. గుఱ్ఱమూ లేదు, వర్తకుడూ లేదు. పైకంతోసహా పరారీ. జమీందారు గారికే శఠగోపం పెట్టాడు వీడి తస్సాదియ్యా. "ఆ 'చల్' అని అంటూండగానే నాకు అనుమానం వేసిందండి" అన్నాడు ఒక టీకప్వగాడు. "నాకు వీడి మొహం చూసిందిలగాయతు - యిదో పెద్ద టోపీ వ్యవహారం అనిపించింది," అంటున్నాడు మరో టీకప్వగాడు. "ఆగండి జమీందారుగారు ఉగ్రులై అగ్నిపర్వతం అయిపోతున్నారు - వినండి వారి ఆజ్ఞల్ని" అంటున్నాడు మూడో టీకప్వగాడు.

ఇంతలో హాజరయ్యారు అశ్వదళాధిపతులు. "పోండి-వాయువేగ మనోవేగాలతో పోండి. ఈ మోసకారి వర్తకుణ్ణి - గుఱ్ఱంతోసహా బంధించి తీసుకురండి-తక్షణంపోండి-నలుగురూ నాల్గువైపులకీ పోండి. పెయ్యమ్మలలాగ చూడకండి - వీర విహారం చేయండి-ఊఁ" అన్నారు జమీందారుగారు. వెంటనే భటులు అశ్వారూఢులై వెళ్ళారు.

"ఇంతమంది వుండగా-పట్టపగలే ఇంత చేశాడే వీడు-రాత్రిళ్లు ఎలాంటివి చేస్తాడో" అని ఓకాయన అందుకున్నాడు. "గుఱ్ఱాన్ని కొట్టాంలో కట్టించి-పైకం ఎగ కొడితే-వీడి జలుబు ఒదిలేది" అన్నాడింకో ప్రబుద్ధుడు. చిరాకుగా వున్నారు జమీందారుగారు.

"ఇలాంటి అనుభవం నాకు ఇదే మొదటిది" అని దీనిని పెద్ద అవమానంగా భావించి జమీందారు బాధపడుతూంటే పరామర్శచేస్తూ- "ఫరవాలేదండి-పాపం భళ్లునబ్రద్దల వదుటండీ-దేవుడు లేడుటండీ-సత్యం జయించదామరి" అని ఇంకో కంఠ

## అయ్యగారి విశ్వేశ్వరరావు

స్వరం. ఇలాగ యీరోజు నిరాశాంకితంగా ముగిసింది. ఇహ ఆ మర్నాడు జమీందారుగారినే మోసంచేశాట్ట-అని నీలాటిరేవుల్లో అమ్మలక్కలు వర్తకుడికి దుంపశ్రాద్ధాలు పెడుతున్నారు. తన అశ్వశాలలోవున్న పసందైనగుఱ్ఱాల మీద ఫహిల్‌మానులు బయలుదేరి పోయారు. అవకాశం చిక్కినంత మేరా-గాలించి వదిలారు, ఎక్కడా ఆ గుఱ్ఱంగాని - ఆ వర్తకుని జాడ గాని పికర్ లేదు. ఏడుపు మొహాలతో భటులంతా తిరిగి వచ్చేశారు, గుఱ్ఱాలన్నీ అలిసిపోయాయి, తెగ ఒగరుస్తున్నాయి. ఇంక పరుగెత్తలేని స్థితిలో వున్నాయి. గుఱ్ఱాల కేసి చూశారు జమీందారుగారు. వర్తకుణ్ణిపట్టి బంధించలేని భటులవైపు చూశారు. చూపుల్లో-అగ్ని కురిసింది. కాని మన కళ్ళ ఎదురుగానే. వాడు మాయమైతే - భటుల్ని గుఱ్ఱాల్ని నిందించి ప్రయోజనం లేదన్నారు - జమీందారుగారు.

"కష్టాలువస్తే గాబరాపడితే లాభంలేదండి - ఎక్కడికక్కడ సరి పెట్టుకోందేం బ్రతకటం మహాకష్టం. ఏమంటారు జమీందారుగారూ" అన్నాడో ఆసామీ, ఇదేదో 'చల్ తమాషా' అన్నాడు మరొకాయన.

ఎవరెన్ని చెప్పినప్పటికీ జమీందారుగారికి ఆందోళన హెచ్చుతోంది. కాని ఆయన చూస్తూండగానే గుఱ్ఱాన్ని కౌగలించుకోవడం-మూతిని ముద్దెట్టుకోవడం - చల్ అని- పలాయనం సాగించడం - ఇంతకన్న దారుణం ఏముంటుంది - అని జమీందారుగారు చాలా బాధపడుతున్నారు.

అక్కడున్న వాళ్లంతా ఇదేదో చల్ తమాషా అన్నారు. తెలియని వాళ్లు చల్‌తమాషా అంటే ఏవిటి అని అంటున్నారు. "గుఱ్ఱానికి చల్ అని చెప్పి-మప్పి-ఆమాట వినపడే సరికి పరుగెత్తే అలవాటు చేయించడమేగదా చల్ తమాషా అంటే, లేకపోతే అంత గాలాపు తీయగలదేం" అన్నారు.

ఆశాభంగం - అవమానం - అవ

మర్థత-పట్టి జమీందారుగారిని పీడిస్తూండగనే రెండవరోజు గడిచింది. ఇహ జమీందారుగారికి డబ్బాపోయె - దిమ్మొపట్టె నన్నట్లుంది. 'ఆ వర్తకుడు ఎందరికి యిలా ద్రోహం - మోసం చేశాడో' అని జమీందారు గారు బాధపడుతున్నారు.

మూడవరోజు తెల్లారింది.జమీందారుగారు ఎవర్నీ రానీయటంలేదు. ఎవరితోనూ మాట్లాడటం లేదు. ఎంతో చిరాకుగా వున్నారు. లోలోపల పరిభవాగ్ని ప్రజ్వరిల్లుతోంది. ఈ కిటికీయే నాకు మోసకారి వర్తకుడి మొహం చూపించింది - అంటూ ఆ కిటికీ దగ్గఱకే పోయారు జమీందారుగారు. ఆఁ అక్కడే వున్నాడే ఆ వర్తకుడు! అదుగో! [illegible] గుఱ్ఱం. ఏమిటీ! - ఇది నిజమేనా - నా భ్రాంతి కాదుకదా - కళ్లు మోసం చేస్తున్నాయేమో?అని జమీందారు కళ్లుమూసుకొని - రెప్పలు జాడించి - మళ్లీ చూశారు. ఇప్పుడా వర్తకుడు ముసిముసి నవ్వులతో చేతులు జోడించి నమస్కరిస్తూ - "బాబూ - లోపలికి రమ్మని శలవా ?" అంటున్నాడు.

మోసంచేసి మళ్లీ వచ్చాడు. పట్టండి వీణ్ణి, బుఱ్ఱ గొరిగించి - సున్నం బొట్లుపెట్టి - గాడిద మీద వూరేగించండి - గజదొంగ - ఎంత ధైర్యంరా! నీకు!" అంటున్నారు అరకప్పటీగాళ్లు.

" వాణ్ణేమీ చేయకండి - రానీయండి లోపలకి" అన్నారు జమీందారుగారు. ఈయన యింతే - వట్టి మెతక మనిషి అనుకుంటున్నారు టపాకాయ విమర్శకులు.

ఏం మాట్లాడుకుంటారో విందాం అని జనం కిటకిట లాడుతున్నారు. అంతా నిశ్శబ్దంగా వున్నారు. 'అరే దొంగతనంచేసి-గమత్తుగా చేజిక్కుకున్నాడే' అని ఒకరు - 'బాబూ దేవుడు లేడుటండీ - పాపం - భళ్లున బ్రద్దలవకపోతే యెలా చెప్పండి' అని ఇంకొకరు అనుకుంటున్నారు.

" అయితే - పైకం తీసికొని - గుఱ్ఱంతో పలాయనమైన పెద్ద మనిషివి నీవేనా-" అన్నారు జమీందారుగారు.

" చిత్తం - దీని తాతలాంటి గుఱ్ఱాలు నా దగ్గఱ వున్నాయి అని శలవిప్పించింది తమరేగా - ప్రభువులు"- అన్నాడు వర్తకుడు.

"ఔను-ఇప్పుడూ అదేఅంటాను" అన్నారు జమీందారుగారు.

"ఆ సత్యాన్ని ఋజువు చేయడానికే పలాయనం చేశానన్నాడు" వర్తకుడు.

'ఆఁ'.అని ఆశ్చర్యపడ్డారుజమీందారుగారు. అందరూ వాడి ధైర్యాన్ని చూడండి అంటున్నారు. వర్తకుడు నిర్భయంగా యిలా అంటున్నాడు:

"అశ్వధాటిలో నాగుఱ్ఱం మజా-మీ గుఱ్ఱాల మజా - ఋజువయింది. మీరు చెప్పినమాటలు ఎంతవఱకు నిజమో మీరు గ్రహించారు. ప్రభూ! నేను దొంగని కాను, ద్రోహినికాను, నా గుఱ్ఱం ఎంత వెల చేస్తుందో—మీసాటి గుఱ్ఱాలతో ఎంతవఱకూ తూగుతుందో తెలపడానికి యీపని చేశాను. దీనికన్న తాతల్లాంటి గుఱ్ఱాలున్నాయని తమరు చాలా హేళనచేస్తూ వెలకట్టారు. క్షమించండి - ఇంతకన్న నాకు వేరే దురుద్దేశంలేదు"- అని వర్తకుడు చెప్పేసరికి - జమీందారుకి తనమాటలే తన చెవుల్లో కంగుకంగున మారుమ్రోగాయి

" మనభటులూ - మనగుఱ్ఱాలూ - యీగుఱ్ఱాన్ని వెంబడించి-వేగంతో ఓడించలేకపోయిన మాట నిజమే గదా-"అని జమీందారు లోలోపల ప్రశ్నించుకుంటూండగా——

"ప్రభూ! గుఱ్ఱం కావాలా - తమకి రూకలు కావాలా-చెప్పండి" అంటున్నాడు వర్తకుడు-జమీందారుగారి వైపు వినయంగా చూస్తూ. "అవునండీ! వాడినీ - వాడిగుఱ్ఱాన్నీ దులిపిపారేసి—గడ్డిపరకలాగ మాట్లాడినందుకు బలే శాస్తి చేశాడు. చెయ్యడామరి, ఇవన్నీ చెప్పక వర్తకుడు దొంగ! దొంగ!!" అంటారేం అని ఒకాయన అంటూంటే- "ఎవళ్ల తప్పు వాళ్లు బయట పెట్టుకొంటారుటండీ" అంటున్నా డింకొకాయన, "మొత్తం మీద వర్తకుడు ఘట్టివాడండోయ్-జమీందారుగారికి పారం నేర్పడానికి 'చల్ తమషా' చేశాడే" అని ఎవరో అంటూంటే - "జమీందారుగారు మాట్లాడుతున్నారు - హెచ్చరిక-" అని దఫేదారు కేక వినిపించింది.అంతా నిశ్శబ్దం. జమీందారుగారు వర్తకుణ్ణి సమీపించారు. ముసిముసి నవ్వులతో కరచాలనం చేశారు. "నీగుఱ్ఱం నిజంగా గొప్పది. నువ్వు నీతిగల వర్తకుడివి. మోసం చేసిధనం దోచుకున్నావనుకున్నాం. అశ్వధాటిని ఋజువుచేసి నీ పంచకళ్యాణియొక్క ప్రతిభను కళ్ళకెదురుగా చూపించావు. సెహబాస్ - నీవు కోరిన మూడువేల రూకలూ యివ్వాలని సంకల్పించాము-" అని అన్నారు జమీందారుగారు. వెంటనే మరో వెయ్యిరూకల్నీ తెప్పించి వర్తకుడికి కర్పూర తాంబూలంతో

# ★ కళ్లెం జారిన గుఱ్ఱం ★

(8-వ పేజీ తరువాయి)

రోజూ సంజవేళప్పుడు ఆమె అగరువత్తి వెలిగించి నమస్కరిస్తుందని చటాలున గుర్తుకొచ్చింది. వెంటనే వెళ్ళి, అగరువత్తి వెలిగించి చేతులు జోడించి నమస్కరించి, "ఎప్పుడూ ఎట్టి ఆపదరాకుండా శారదను కాపాడు; క్షేమంగా యింటికిచేర్చు" అని ప్రార్థించాడు. ఇంతసేపై అగరువత్తి వెలిగించడం మాట గుర్తుకురానందుకు నొచ్చుకున్నాడు. కాఫీ, భోజనాలింకా కాలేదుకదా అని సమాధానపడుతూ వచ్చి వరాండాలో తిరిగి కూర్చున్నాడు. అప్పుడే [illegible] రిక్షా వచ్చి వాకిట ముందాగింది. శారదేమో నని తొందరగా, ఆనందంతో లేచాడు. కాని, "నమస్తే బాబుగారూ! మంచి నాణ్యమైన బెంగుళూరు, మధుర, కంచిచీరలు తీసుకొచ్చాను, చూస్తారా? తిరిగి బసకు వెళ్ళిపోతున్నాను. బాబుగారు తీరికగా వున్నారని రిక్షా ఆపాను. అమ్మగార్ని పిలిపిస్తారా?" అంటూ, రిక్షా దిగి, ఓ ఆసామీ వచ్చాడు. "ఇంట్లో లేరు; ఊళ్ళోకి వెళ్లారు" అన్నాడు క్లుప్తంగా. "రేపొద్దున్న రమ్మంటారా? మంచి ప్రశస్తమైన చీరలు బాబుగారూ" అన్నాడు బట్టలు తెచ్చినతను. తటాలున ఏదో జ్ఞాపకం వచ్చి "సరే, చూస్తాను" అన్నాడు. చీరలతను పెట్టె తెప్పించాడు.

రమణారావుకు జ్ఞాపకం వచ్చిన సంగతి యిది: ఆమధ్యకూడా ఎవరో యిలాగే వెంట కూడు చీరలని తెస్తే, చూదామా అన్నట్టు యితనివేపు శారద చూసింది. కాని తాను, 'బీరువాలో చీరలకి లోటు యిప్పుడే లేదు. యింకా కావాలిట!' అని నవ్వుతూ అనేశాడు. నొచ్చుకుందో ఏమో తెలియదుకాని ఆమెకూడా నవ్వేసి వూరుకుంది పాపం, సరదాపడిందేమో; ఎందుకలా అనేశాడో మరి! అక్కిందటి సంవత్సరం, తనకి తెలియకుండానే, ఎంత మంచి పేంటూ, షర్టూ కొలతలూ అవీ జాగ్రత్తగా చూచి తన పుట్టిన రోజుకి కుట్టించింది! తాను వచ్చేమాసంలో ఊలు సూటు కుట్టించుకుందామని తీసి వుంచిన నూరురూపాయలసంగతికూడా జ్ఞాపకం వచ్చింది. అదికాకుండా, ఈ మాసంలోనే వాళ్ళ వివాహదినం వస్తుంది! అందుకోసమే చీరలతన్ని వుండమన్నాడు. ఆ నల్లంచు, వంగపండూ, నేరేడు పండూ రంగుల సిల్కు చీర కట్టుకుంటే శారద ఎంత బాగుంటుంది! అదంటే ఆమెకి చాలా సరదా. పెళ్ళిలో తనవాళ్ళు పెట్టిన మూడు సిల్కు చీరల్లో అది తనే సెలెక్టు చేశాడు. మొన్న మొన్నటివరకూ బాగానే వుంది. యిప్పుడిప్పుడే అంచులదగ్గర చిరుగుతోంది. కాంతివంతమైన ఆమె చాయకు అట్లాంటి దట్టమైన రంగు నల్లంచు చీర చాలా బాగుంటుంది...

చీరలతను మడతలు విప్పుతున్నాడు. సరిగ్గా తనకు నచ్చిన చీర కనిపించింది. రంగూ, అంచూ నేతా అన్నీ బాగున్నాయి. పొడుగూ, వెడల్పూ కూడా శారదకు సరిపోయేవే. అటువంటి చీరంటే తప్పకుండా ముచ్చటపడుతుంది. ఖరీదుచేసి, ఎనభైరెండు రూపాయ లిచ్చివేశాడు, మరో పద్నాలుగు రూపాయలకు చీరకు కుదిరే బాడీ గుడ్డ కూడా తీసుకున్నాడు, మనసుకుచాలా సంతృప్తి కలిగింది. అవి లోపలపెట్టి, తిరిగి వసారాలో కొచ్చే సరికి మరో రిక్షా యింటి ముందాగింది.

అనుకున్నట్టుగానే శారదే అందులోంచి దిగింది.

"హమ్మయ్య" అనుకుంటూ, గబగబ మెట్లు దిగి వస్తూ ఆమె చేతిలోని సంచీ అందుకొని, చిల్లరకోసం ఆమె తడుముకుంటూంటే, 'నా దగ్గరుందిలే' అంటూ తనే పర్సుతీసి రిక్షావాడికి అర్థరూపాయ యిచ్చాడు. ఆమె కొంచెం ఆశ్చర్యంతో, "ఎంతిచ్చారేమిటి? అరణాలే" అంది. "పోనీలే ఆలస్యం అయింది, మరో రెండణాల కేమిటి" అనేశాడు.

శారద యింట్లో ప్రవేశిస్తూ, "చాలా ఆలస్యం అయిపోయింది. పిల్లలూ, మీరూ భోజనంచేశారా? కాస్తలా తిరిగివచ్చారా? సమాజానికి వెళ్ళకుండానే వచ్చే కలిసింది. ఒక్క నిమిషం మొహం చూపించి వచ్చేద్దామనుకుంటే నలుగురు కమిటీమెంబర్లూ జతపడ్డారని మీటింగు పెట్టారు. ఎంత వచ్చేద్దామన్నా కుదరలేదే! ఇందిరావాళ్ళూ, 'మీరు మటుకూ యింట్లో పనులేమిటి; ఎప్పుడేనా కాస్త ఆలస్యమవుతుంది మరి' అంటూ బలవంతపెట్టి కూర్చోపెట్టేశారు. ఇందిరకేం! ఇంట్లో అత్తా, ఆడబడుచూ కూడా వున్నారు. గ్రహించుకోరండీ యిబ్బందులు" అంటూ, ఆలస్యమయిందనే ఆందోళనలో భర్తకు సమాధానం చెప్పేతీరులో చెప్పుకుపోసాగింది. రమణారావు సరదాగా మాట్లాడుతూ ఆమె వెనకాలే వెళ్లాడు. "అయ్యో మీరింకా భోజనం చెయ్యలేదూ? ఎందుకన్నారూ?" అంటూ పెరట్లోకి వెళ్లింది. రమణారావు అంతసేపూ పెరటివసారాలో నిలబడి సంభాషణ సాగిస్తూనేవున్నాడు. ఆమె కాళ్ళూ చేతులూ, ముఖమూ కడుక్కొని, తొందరగా చీర మార్చుకుందుకు గదిలోకొచ్చేటప్పుడు కూడా ఏదో చెబుతూనే వెంబడించాడు. ఆలస్యం అయినందుకు చిరాకుపడకుండా యింత వుల్లాసంగా వుండడం శారదకు విస్మయం కలిగిస్తోంది.

పిల్లలంతా నిద్రపోతున్నారు; దాసీది కునుకుతీస్తోంది. రమణారావు, "మనం భోజనంచేశాక దాన్ని లేపొచ్చునులే; వీధి తలుపు వేసొస్తా" అంటూ వెళ్ళి, నట్టింట్లోకి వస్తున్నప్పుడు తను కొన్న చీరమాట జ్ఞాపకం వచ్చి, యిప్పుడే చూపిద్దామా, భోజనం చేశాక చూపిద్దామా, అని ఒక్క క్షణం తటపటాయించి, వుండబట్టలేక కాగితంలో కట్టిన పార్సెలును తీసుకునే వెళ్లాడు. శారద [illegible] వడ్డిస్తూ, "కూచోండి" అంది. "అలాగే కాని, యిదేమిటి చెప్పుకో చూదాం" అన్నాడు పార్సెలు చూపిస్తూ. శారద ఆశ్చర్యంతో ఏమిటన్నట్టు చూచింది. చీర మడతవిప్పి అంచులున్నవేపు చూపించాడు. శారదకళ్ళు ఆనందంతోనూ, ఆశ్చర్యంతోనూ మెరిశాయి.

"చాలా బాగుంది; ఎక్కడిదేమిటి?" అంది.

"ఇందాక ఒకతను తెస్తే, నీకు బాగుంటుందనిపించి తీసుకున్నాను. నచ్చిందా?" అన్నాడు, ఆప్యాయంగా చూస్తూ.

"చాలా ఖరీదయి వుంటుందే; బోర్డరూ, రంగూ, అదీ చాలా బాగున్నాయి; యిలాటిదే కొనుక్కోవాలని వుంది. సరిగ్గా ఏలా కనుక్కున్నారో! అయినా యిప్పుడెందుకూ యింత ఖరీదుపెట్టి? ఇదేమిటి,

---

## చెల్ తమాషా

బహూకరించారు.

చల్ తమాషాతో జమీందారు గారిని మెప్పించిన వర్తకుణ్ణి అంతా పొగిడారు. గౌరవ మర్యాదలతో వర్తకుణ్ణి సాగనంపారు జమీందారు గారు. ఆ పంచకళ్యాణి మీదే జమీందారుగారికి మోజు.

అంతా రానురాను ఆ గుఱ్ఱాన్ని 'చల్ తమాషా' అని పిలుస్తూంటే జమీందారుగారికి వర్తకుడు నేర్పిన పాఠం చటుక్కున జ్ఞాపకం వస్తూండేదిట. ఇప్పటికీ ఆ గుఱ్ఱం పేరు 'చల్ తమాషా'గానే చలామణీ అవుతూంది. ★

బాడీసు కుట్టకూడదా! ఇవన్నీ ఎందుకు కొన్నారూ?" అంది విస్మయానందంతో. రమణారావుకి చాలా సంతృప్తి కలిగింది. "ఎంతయితే నేమిటి, నీకు నచ్చాయి కదా రెండూను" అంటూ అవి పక్కమీద పెట్టి, వచ్చి భోజనానికి కూర్చున్నాడు. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ యిద్దరూ భోజనం చేశారు.

భోజనాలయ్యాక శారద తాంబూల మందిస్తున్నప్పుడు "దేముడిదగ్గర అగరువత్తి వెలిగించానులే" అన్నాడు. "మాశారా మరిచేపోయాను తొందరలో, జ్ఞాపకం వుంచుకున్నారే. పాపం, పిల్లలతో మీకు చాలా యిబ్బందయి వుంటుంది. ఇలా ఆలస్యం అయే మాటుంటే సమాజం మానేస్తాను" అంది. అది వినిపించుకున్నాడో లేదో కాని, "చాలా రోజులయినట్టుంది. రేపు కోదండ రామాలయానికి వెడదామా?" అన్నాడు. "అలాగే" అని శారద అతనివేపు వింతగా చూసి, "పనిమనిషికి అన్నం పెట్టి వస్తానివ్వాడే" అంటూ లోనికి వెళ్ళింది.

రమణారావు పరధ్యానంగా చూస్తూ పడకకుర్చీలో కూర్చున్నాడు. శారద రాగానే లేస్తూ, మంచంపక్కన చిందరవందరగా పడివున్న ఆమెచీరను చూశాడు. ఇందాక తొందరగా ఆమె చీర మార్చుకుంటూ కింద వదిలేసింది. అది చూడగానే "నీ కెన్నిసార్లు చెప్పినా అంతే; ఎక్కడపడితే అక్కడ విడిచినచీర పడెయ్యడమే" అన్నాడు—తటాలున, అనుకోకుండా కలిగిన చిరాకుతో! శారద సిగ్గుతో నొచ్చుకుంటూ, "మీకు ఆలస్యమవుతుందని తొందరపడుతూ మరిచిపోయానండీ; తప్పే" అంది చీరతీసి మడతపెడుతూ.

అంత ఆలస్యం అయినా ఏమి విసుక్కోకుండా కులాసాగా కబుర్లు చెప్పడం, మంచి చీరే బాడీనూ అనుకోకుండా తనకోసము కొనడమూ, తనపట్ల చూపిన ఆత్మీయతా, యింతలోనే రోజూ జరిగే సామాన్యమైన చిన్న పొరపాటుకు ఒక్కసారి చిరాకుపడటం— ఈ ధోరణి శారదకేమీ అర్థం కాలేదు.

పెళ్ళిపీటలమీద వేసిన మూడు ముళ్లూ భార్యాభర్తలను ఎంతవరకూ బంధిస్తాయో చెప్పలేం కాని, చాలామంది భర్తలని కళ్ళెం వేసిన గుఱ్ఱం మాదిరిగా మచ్చిక చేస్తవి! ఆ కళ్ళెం వుంటేనే సంసారంలో నిలకడా, నిశ్చింతతో కూడిన గమనం, లక్ష్యం చాలామంది పురుషుల కలవడతాయి! ఒకరు నడుపుతుంటేనే పరుగెట్టడాని కలవాటు పడ్డ గుఱ్ఱానికి, కళ్ళెం జారితే బహుశా స్వేచ్ఛానుభవం కాక కంగారే హెచ్చవచ్చు. బెదిరి బెంబేలుపడ్డ మనసుతో రమణారావు యింతసేపూ పడిన ఆరాటం శారదకేం తెలుస్తుంది పాపం! ఆమె పేరంటాలనుంచి వచ్చిన కాస్త సేపట్లోనే తిరిగి కళ్ళెం పడటంవల్ల, మామూలు ధోరణిలో చిరాకు పడ్డాడు రమణారావు!

శారద చీర దండేన్ని వుంచి భర్తవేపు యింకా వింతగానే చూస్తూ, "ఇంకెప్పుడూ కిందలా వదిలేను లెండి" అంది. ఇంతసేపటి ఆందోళనా, కాస్త సేపటికిందే చేసుకున్న నిశ్చయం కూడా మరిచిపోయి, ఆమెపై అలా చిరాకుపడ్డందుకు సిగ్గుతో, "అబ్బే, మరేంలేదు; పురుగూ పుట్రా అందులో చేరగలవనీ కింద వదిలేస్తే; పోనీ మంచం మీదేనా వేసేస్తూండు" అన్నాడు మెల్లగా ఆమెచేయిని తన చేతిలోకి తీసుకుంటూ! ★

## న్యూఢిల్లీ లేఖ

(10-వ పేజీ తరువాయి)

వచ్చింది. ఒక గడ్డుదశ నుంచి ఇంకో గడ్డు దశకు గెంతుతూ వచ్చింది. ఈలోగా ఆర్థిక వ్యవస్థ నాశాభ్రష్టా అయింది; ప్రజలలో నిస్త్రాణ హెచ్చింది. అధ్యక్షుడు సుకర్నో, ఉపాధ్యక్షుడు హట్టా ఘర్షణపడి, డా॥ హట్టా రాజీనామా చేయడంతో పరిస్థితులు అస్తవ్యస్తమయిపోతున్నాయని మొట్టమొదటిసారిగా వెల్లడయింది. ఆతరవాత సుమత్రా, బోర్నియో, సెలిబస్‌లలో కొన్ని కొన్ని చోట్ల మిలిటరీ అధికారులు స్వతంత్ర రాష్ట్రీయ ప్రభుత్వాలను స్థాపించుకోవడం జరిగింది. విశాలమైన ఇండొనీషియా దేశంలోని దూరదూర ద్వీపాలన్నిటికీ జకార్తా ప్రభుత్వం ప్రాతినిధ్యం వహిస్తోందనిగాని, పరిపాలిస్తోందనిగాని నమ్మించడం కూడా ఇక సాధ్యం కాదు. జాతీయైకమత్యాన్ని పునరుద్ధరించడానికి ఇంకో కొత్త నాటకం ఆడవలసి వచ్చింది. అధ్యక్షుడు సుకర్నో "కొత్తరకం ప్రజాస్వామ్యం" పేరుతో ఈ నాటకం ఆడారు. ఇండొనీషియన్ జాతీయత ఛిన్నాభిన్నం అవుతున్నా ఆయన పట్టించుకోలేదు. గత ఏప్రిల్‌లో డా॥ జువాండాను పార్లమెంటుకు సంబంధంలేని ప్రభుత్వాన్నేర్పరచమని అధ్యక్షుడు కోరారు. జూలైలో జాతీయ సలహామండలి అవతరించింది. విడిపోయిన ద్వీపాలను తిరిగి కూడగట్టుకోడానికి చేసిన ప్రయత్నాలు విఫలం కావడంతో జకర్తాలో ఒక జాతీయ సమావేశం ఏర్పాటుచేశారు. ఇటీవల జాతీయ అభివృద్ధిమండలి సమావేశం అంటూ ఇంకొకటి జకర్తాలో జరిగింది.

ఇండొనీషియాలో ఉన్న ఇబ్బందులన్నీ గుర్తుపెట్టుకుంటే ఆశయాలు ఆచరణలోకి రాకపోయినందుకుగాని, ఆడిన నాటకం ఎవర్నీ నమ్మించలేకపోయినందుకుగాని ఆశ్చర్యం కలగనే కలగదు. విచారపడవలసిన విషయమల్లా ఏమిటంటే జాతీయతను బలపరచడంకోసమని విద్వేషభావాన్ని రేకెత్తించడం. సమాధానపడడం ద్వారా ఏకమత్యం కుదర్చలేకపోతే, ఎవరిమీదో ఒకరి మీద ద్వేషం రెచ్చగొట్టడం ద్వారా కుదర్చడమనేది చాలకాలంగా స్వాతంత్ర్యోద్యమాలన్నీ అనుసరిస్తున్న పద్ధతే."

పాకిస్తాన్ ఏర్పడినప్పటినుంచీ భారత పాకిస్తాన్ సంబంధాలను గమనిస్తున్న వారందరికీ ఇదే విధమైన పద్ధతి భారత సరిహద్దుల కవతల కూడా అనుసరిస్తున్నారని విదితమవుతుంది. పాకిస్తాన్ ప్రభుత్వం చిక్కుల్లో పడినప్పుడల్లా భారత విద్వేషగీతాల బృందగానం హోరెత్తిపోతుంది.

పాకిస్తాన్‌లోనూ, ఇతరత్రా భారతదేశానికి వ్యాపార ప్రయోజనాలున్నాయి గనుక ఈ విషయమై కొంత ఆసక్తి వహించడం అవసరం. ఇండొనీషియాలో డచ్చి వారి ఆస్తులను వశపరుచుకోడంవల్ల, వెనుకబడిన దేశాలలో విదేశీయుల పెట్టుబడి అవకాశాలు దెబ్బతినిపోతాయి. ఇంతమాత్రాన డచ్చి వలసవిధానాన్ని సమర్థిస్తున్నానని అర్థం కాదు. న్యూగినీ ప్రజల అభిమతాలను గూర్చికూడా ఆలోచించాలిగదా? ఈ పరిపాలకులు పోయి ఆ పరిపాలకులు రావడం న్యూగినీ ప్రజలకు ఇష్టం లేకపోవచ్చు. స్వతంత్రంగా ఉండడమే వారి అభీష్టం కావచ్చు. న్యూగినీ ప్రజలకూ, ఇండొనీషియన్లకు అంత అనుబంధం ఏమున్నది గనుక? భారతదేశం నిస్సందేహంగా సామ్రాజ్యవాద వ్యతిరేక దేశమే. కాని అలాగని చెప్పి న్యూగినీ ప్రజలకు ఇష్టంలేని పరిపాలనను వారి నెత్తికి అంటగట్టడానికి భారతదేశం సమ్మతిస్తుందా? ★



# తెగిన తీగలు



(24 వ పేజీ తరువాయి)

భయం భయంగా వస్తోంది. లోపలికి రాగానే, 'ఎవరూ?' అన్నాడు నిదానంగా చూస్తూ. "నేనే మామయ్యా! మీ కోడల్ని" అంది. "పార్వతివా! తల్లీ రా!" అని చేతులు చాచాడు. పార్వతి చంటివాణ్ణి ఆయన చేతులకందించి, "ఎలా ఉంది మామయ్యా మీకిప్పుడు?" అంది. ఆయన పాపాయిని ముద్దు పెట్టుకొని "అయితే వాడు రానన్నాడా?" అన్నాడు. ఆమె తల వంచుకొని సిగ్గుపడుతో, "ఒంట్లో కులాసాగా ఉందా మీకిప్పుడు" అని మళ్ళీ అడిగింది. సుబ్బారావు బరువుగా నిట్టూరుస్తూ, "వాడి మనస్సింకా కరగలేదన్న మాట!......అయితే ఇంతకూ ఏమన్నాడు?"

"తగ్గిందాకా ఇక్కడుండి, మిమ్మల్ని తీసుకొని రమ్మన్నారు" అంది పార్వతి నేరస్థురాలి మల్లే.

## 5

ఎన్నో ఏళ్ళుగా ఎఱుగని జీవన మాధుర్యాన్ని చవిచూచాడు సుబ్బారావు. గడచిపోయిన మంచి రోజులు మళ్ళీ వచ్చాయనిపించిందతనికి. ప్రేమించే హృదయం ఎలా ఆదరించగలిగేది ఎండిపోయిన ఆయన మనస్సు చూచి తృప్తితో నిశ్వసించింది. కష్టాలంటే ఎఱుగని వాడల్లే, ఏవో అసంబద్ధమైన కబుర్లతో పార్వతిని విసిగించేవాడు. ఇన్నాళ్ళుగా బయటికి వచ్చేందుకు మార్గం లేక అట్టడుగున పడిపోయిన అతని భావాలు అనంతమైన వాగ్ధారగా సాగినయ్.

పార్వతి హృదయం మామగారి మీద కరుణతో స్నిగ్ధమైంది. ఆమె ఆయనని తనతో రమ్మంది. ఆమె అన్నది: "మామయ్యా వారిప్పుడు రాలేదంటే మీ మీద కోపంతో కాదు. సిగ్గుతో మీకు మొహం చూపలేక నే. మీరు రండి. తరవాత మీకే తెలుస్తుంది కదా" అని.

సుబ్బారావు కళ్ళు ఆనందంతో మెరిశాయి. ఆశారేఖ అతనిముఖంమీద తళుక్కుమంది. వెంటనే, అతని ముఖం నల్లబడిపోయింది. అతను పేలవంగా నవ్వి, 'మళ్ళీ వచ్చేందుకు ఆశలో పడేస్తావు...దానిలో పడి మళ్ళీ నేను అగౌరవం పాలు కాదలచుకోలేదు...అయినా, తండ్రి దగ్గఱకు వచ్చేందుకు వాడికి సిగ్గెందుకు. నేనేమీ వాణ్ణి వెళ్ళగొట్టలేదే!" అన్నాడు. ఈ ముసలి మనస్సు ఇంత కఠోరమైందా అని ఆశ్చర్యపడింది పార్వతి.

వారం రోజులు గడిచాయి. తన అపత్నీక జీవితంలో ఇంత ఆనందంగా గడచిపోయిన రోజులు లేవనుకొన్నాడు. ఏడేళ్ళ క్రితం జీవితం దుఃఖావిలం కాదుకాని, అప్పుడు బాధ్యతలతో శాంతి లభించిందికాదు. నిజానికి, జీవితంలో తృప్తిక్షణాలు వార్ధక్యంలోనే వస్తాయేమో! అనుకొన్నాడతను. అంతవఱకు జీవితంతో పోరాటం. దాన్ని సంపాదించటంతో, దీనిని వృద్ధిచేయటంతో అవిరామమైన కృషి. అందుకే యౌవనము ఒడుదుడుకులతో కూడినది. వార్ధక్యంలో అతను తన పూర్వాశ్రమంలో సంపాదించిన దాని 'వడ్డీ'ని అనుభవిస్తాడు. ఒకడదృష్టవంతుడో, కాదో, నిర్ణయించేది అతను ముసలితనంలో గడిపిన రోజులే.

పార్వతి మళ్ళీ ప్రస్తావించింది. "అన్నట్టు ఇక ఎన్నాళ్ళుంటావు తల్లీ! వాడక్కడ పిల్లలతో ఇబ్బందులు పడుతూ ఉంటాడు" అన్నాడాయన జుగుప్సతో. "మీరూ రండి వెళ్దాం. ఏంతైనా, ఆయన మీ కొడుకే కదా!" అంది ఆమె.

"కాదూ మరి!" అంటూ ఏదో పని ఉన్నట్టుగా లేచిపోయాడు. ఇక లాభం లేదనుకొంది పార్వతి. తండ్రీ కొడుకులూ కదా మరి! పార్వతి నా రోజు ప్రయాణం చేయించాడు సుబ్బారావు. ఇన్నాళ్ళకి సెలవుగా ఇంటికి వచ్చిన కోడల్ని ఘనంగా గౌరవించాడు. విలువైన చీరలూ, రవికెలూ పెట్టాడు. రకరకాలైన బొమ్మలూ, వస్తువులూ ఇచ్చాడు మనమడికి. ఆ రోజు పార్వతి ఒలిచి ఇచ్చిన సొమ్ములన్నీ తెచ్చి ఆమె కిచ్చాడు. పాపాయిని ఆఖరిసారిగా ముద్దుపెట్టుకొని "అమ్మా ఈ ముసలి మామయ్యని కాస్త గుర్తుంచుకో! మళ్ళీ చూస్తానో చూడనో మఱచిపోయేవు" అని నవ్వాడు. పార్వతి ఆయనకి నమస్కారం చేసి బండి ఎక్కింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "వెళ్తొస్తా మామయ్యా" అనాలని ఆమె పెదవులు విప్పింది. కాని మాటలు గొంతులోనే ఉండి పోయాయి. ఆమె కొంగుతో కళ్ళద్దుకొంది.

ఎంత విచిత్రమైన మానవులు వీళ్ళు! ఒకరిమీద ఒకరికి అనంతమైన అనురాగం. ఇద్దఱికీ తెగిన తీగెల్ని సరిచేసుకోవాలనే! మళ్ళీ ఎంత అభిమానం!

పార్వతి దగ్గఱనుంచి ఉత్తరం వస్తుందేమో అని గోపాలరావు అనుక్షణమూ ఎదురు చూచేవాడు. 'నాన్న కెలావుందో?' అని బాధపడేవాడు. మళ్ళీ, ఎక్కువగా ఉంటే ఉత్తరమైనా రాకపోతుందా?' అని తృప్తి పడేవాడు. పిల్లలతో సర్దుకొని, ఆఫీసుకు వెళ్ళటం కష్టంగా ఉంది. పార్వతి ఒస్తే బాగుండును! కాని నిజానికతను పార్వతికంటే, ఆమె దగ్గఱనుంచి ఉత్తరం వచ్చివుంటేనే ఎక్కువగా సంతోషించి ఉండేవాడు.

'నాన్నా, పార్వతీ' ఈసారి తప్పక వస్తారనీ, ఏడేళ్ళుగా ఎడమైపోయిన జీవితాలు మళ్ళీ కలుసుకొంటాయనీ అనుకొన్నాడు గోపాలరావు. తండ్రి వస్తే ఎలా పలకరించటమా అని ఆలోచించుకొన్నాడు. తండ్రీ కొడుకులు కలిసి ఉన్నట్టుగా ఊహించుకొని, అదే సత్యమనీ, ఈ ఎడబాటే అసత్యమనీ అనుకొన్నాడు.

కాని, పాప కొరుకొని, పార్వతి ఒక్కతే వచ్చింది. వాకిట్లో బండి నిలవగానే, వేగంగా కొట్టుకొనే గుండెల్తో వచ్చి చూచాడు. అందులోంచి చిఱునవ్వుతో పార్వతి దిగుతూంటే, అతని ముఖం మలినమైంది. "ఒక్కదానివేనా పార్వతీ!" "ఒక్కదాన్ని ఎందుకౌతా? నేనూ, పాపాయి ఇద్దరము" అందామె.

"నాన్నేమన్నాడు అయితే" అని అడగాలని రెండుసార్లు అనుకొన్నాడు మళ్ళీ మానివేశాడు.

పార్వతి ఎంతవద్దని బ్రతిమాలుకొన్నా, వినిపించుకోకుండా సొమ్ములన్నీ ఊడదీసి తండ్రికి పంపివేశాడు. ఆ మరునటిరోజే. పార్వతి వెళ్ళిన నాటినుంచీ, సుబ్బారావు యథాస్థితికి వచ్చాడు. అతని సంతోషమంతా, భగ్నభంగురంలాగా మాయమైంది. పేక మేడలా అతను కుప్పకూలిపోయాడు.

ఒంటరితనం దుర్భరంగా ఉంది. మరీ, అది పార్వతి రాకపూర్వంకంటే, ఆమె వెళ్ళిపోయిన తరవాత సహింపరానిదై పోయింది. అత నా రోజుల్ని నెమరు వేసుకొంటూ కాలం గడుపుతున్నారు. సాయంకాలం నీరెండలో మనవడితో తాను గడిపిన ఆనందక్షణాలని తలచుకొని తనలో తనే నవ్వుకొనేవాడు. వాడి వచ్చీరాని మాటలింకా ఆయన చెవుల్లో గింగురుమంటూ ఉన్నయ్. ఇంతలో కొడుకుదగ్గఱనుంచి సొమ్ము వచ్చింది. అతని కిప్పుడు దుఃఖం కలగలేదు. పైగా నవ్వు వచ్చింది. తనకీ, తన కొడుక్కీ శాశ్వతంగా ఇహ సంబంధం తెగిపోయింది! మమకారం అనేది ఒకర్ని మాత్రమే ఆశ్రయించుకొని బతకలేదు. పెఱిగి పెద్దది కావాలంటే ఇద్దఱూ ఉండాలికదా! తానెంత మఱచిపోవాలనుకున్నా వాడు మఱచిపోనివ్వందే!

అతని మనస్సులో, పదిహేనేళ్ళ క్రిందట చనిపోయిన భార్య మెదలసాగింది. ఇక ఆమె వెళ్ళినదే తనకు రాదబాట! ఈ ప్రపంచంలో తాను చెయ్యవలసిన దింకేమీ లేదు. పెళ్లి చేసికొన్నాడు. పిల్లల్ని కన్నాడు. వాళ్ళను పెద్దవాళ్ళను చేశాడు. రెక్కలు వచ్చినదాకా గూడుకంటుకొ

ఉన్నారువాళ్ళు. అని రాగానే, తమదారిన తాము వెళ్ళిపోయారు. గూడు చిన్నబోయింది. ఇక ఆ గూటిలో తానుండలేడు. మరో చోటికి, శాశ్వతమైన మరో చోటికి తాను తరలిపోవాలి.

హఠాత్తుగా అతనికి స్ఫురించింది. తానింకా చేయవలసిన పని ఒకటే ఉంది. అవును, తనభాగం ఆస్తి ఏమి చేయటం? కొడుకులకీ కూతురికీ ఇక ఇవ్వలేడు. ఎవరైనా లేనివాళ్ళకి రాసిఇస్తే. మీద పంచె వేసుకొని, అనాథశిశు శరణాలయానికి వెళ్లాడు. సెక్రటరీని కలుసుకొని తనభాగం రాసిఇచ్చి, రిజిష్టరు చేసి వచ్చాడు. సెక్రటరీ సన్మాన సభ చేయిస్తానన్నాడు కాని, 'ఏమీ ఒద్దు' అని వచ్చాడు.

మిగిలిన నాలుగెకరాలు ఎలాగూ గోపాలానికి చెందుతుంది. దాన్ని పార్వతి పేర రాసి, ఇచ్చాడు. ఇహ, అతను చేయవలసిందేమీ లేదు. శాశ్వతమైన ఆక్షణంకోసం ఎదురుచూడటమే.

అతనికి సంతోషంగా ఉంది. అతని కిప్పుడు, మమతలూ, ద్వేషాలు లేవు. అన్నిటినీ, భౌతికమైన అన్నిటినీ, త్యజించి మరో లోకానికి పయనించేటనకు ఇవన్నీ ఎందుకు! కనపడినవాళ్ళందర్నీ పిలిచి, పలకరించిగాని వదల్లేదు. ఆప్యాయంగా క్షేమసమాచారాలు విచారించాడు.

సాయంకాలం పొలమ్మీద కెళ్ళాడు. గుంటా మిట్టా చదును చేసి పల్లం చేశాడు. అది ఈరోజు పండి బరువెక్కిన వరి మొక్కల్లో కళ్ళపండువుగా వుంది. ఒకనాడది రాళ్లతో, తుమ్మలతో భయంకరంగా ఉండేది. ఇంతేకదా జీవితం కూడా!

రాత్రికి జ్వరం వచ్చింది. ఒకటే కలలు! కలలో భార్య కనిపించింది. ఆమె అతన్ని కేక వేస్తోంది: "ఆరోజే రమ్మంటే ఇంకా రాలేదేమి?" అని. "ఇదుగో వస్తున్నాను. ఇంక ఆలస్యం చెయ్యను" అన్నాడతను. వెంకట్రావు వచ్చి, కూతుర్ని మధుని పిలిపించనా అంటే "ఎందుకులే" అన్నాడు. "అయితే గోపాలాన్నో?" అంటే, "వాడెందుకు వస్తాడు. వాడు రాడు" అన్నాడు.

మరుసటిరోజుకి జ్వరం ఇంకా ఎక్కువైంది. అందరికీ టెలిగ్రాములు వెళ్ళాయి. కూతురూ, అల్లుడూ, మధూ వచ్చారు. "వాడు రాలేదా?" అని అడిగాడు స్పృహ వచ్చినప్పుడు, ఒకటి రెండుసార్లు.

మూడోరోజుకి ఇంకా ఎక్కువైంది. అతని దృష్టి ఇంటి కప్పులమీద ఉండేది. మధ్యమధ్య ఎవరినో ఎదురుచూచేవి, అతని కళ్ళు. అతని ప్రాణాలు పోలేక, ఎవరికోసమో నిరీక్షిస్తున్నాయి.

పదిగంటలకి గోపాలరావు పార్వతీపిల్లలూ వచ్చారు. గోపాలరావు 'నేవచ్చాను నాన్నా ఇదిగో నన్ను చూడవూ?' అని దగ్గరకు వెళ్ళాడు. సుబ్బారావు కళ్ళెత్తి చూచాడు. వెంటనే అవి మూతలుపడిపోయాయి. కాని అతను బలవంతంగా తెరిచి కొడుకు ముఖంలోకి ఆప్యాయంగా చూచాడు. నోటిమీద సన్నని నీటిధార కమ్మింది. "నాయనా వచ్చావా...నన్ను తీసికొని వెళ్ళవూ... ఇక..." అన్నాడు తిరిగి.

గోపాలరావు తండ్రి గుండెలమీద తల ఆనించి రోదించాడు. ★

## ఉస్మానియా ఆంధ్రమహోత్సవాల సమీక్ష

(6 వ పేజీ తరువాయి)

అంతర్లీనమైన సంకేతాన్ని అవ్యక్తంగానే ప్రేక్షకులు గ్రహించడానికి ఈ యాంత్రిక సాధనాలు ఎంతవరకు తోడ్పడ్డాయి? నాటికలోని 'నాటకీయత'నే నాశనం చేయలేదా ఈ సాధనాలు?

రెండవ ప్రశ్న: పదేళ్ళక్రితం డాక్టరుగా ప్రదర్శించిన వారి నటన సహజంగా లేదు. వయసులోని అంతరాన్ని సూచన ప్రాయంగా చూపించడానికి వారీవిధంగా నటించారా? ఇది నిజమైతే, వారి నటన అభినందనీయం; లేకుంటే, కాదు. వారి ఉద్దేశ్యాన్నిబట్టే ఆధారపడి ఉంటుంది ఫలితం. నటనాపద్ధతిపై విమర్శ ఇది. రచనపై కాదు.

ఇదేవిధంగా శ్రీ ఆనందమోహన్ నటనను గురించి కాక నటనా పద్ధతిని గురించి రెండు మాటలు. ఆధునిక నటనాపద్ధతిలో స్వాభావికతకు ప్రాధాన్యమెక్కువ. మన పెద్దలు మన కలవరచిన నటనాపద్ధతి రంగస్థల నటనాపద్ధతి. ఇంగ్లీషులో చెప్పాలంటే 'స్టేజీ'గా ఉంటుందనాలి. 'ధర్మపథం' నాటిక చారిత్రాత్మక నాటిక. చారిత్రాత్మక నాటికలో నటన రెండవపద్ధతిగా నున్నా చూడ ముచ్చటగా ఉంటుంది. ప్రథమ బహుమతి గ్రహించడానికి శ్రీ ఆనందమోహన్ ఎంతో అర్హులు. దానివిషయంలో సందేహం ఏమాత్రం లేదు. కాని శరీర సౌష్ఠవం, గంభీరమైన కంఠం కలిగిన ఈ నటుడు ఆధునిక నటనాపద్ధతిని అలవర్చుకొంటే బాగుంటుందని సూచిస్తున్నాను. సాంఘిక నాటకాలలో మొదటి పద్ధతిని నటనచేస్తే ఈ నటునికి మంచి భవిష్యత్తు ఉంది.



డాక్టరు వి. బ్రహ్మాజీరావు. భారత ప్రభుత్వం వీరిని గుండెజబ్బుల చికిత్సా క్రమంలో ప్రత్యేక విజ్ఞాన అభ్యాసానికి ఇంగ్లండ్ పంపిస్తున్నది.



సంస్కృతి సమాఖ్య (కలకత్తా) ప్రదర్శించిన 'నారాబు' నాటకంలో 'శ్రీనివాసం' పాత్రను ఉత్తమంగా నటించి, ఆంధ్ర సంఘం (బొక్సారా)చే రజతపాత్ర బహుమానంగా అందుకున్న నటుడు శ్రీ డి. రమణమూర్తి.

తుదిని రెండుమాటలు. ఉత్సాహవంతులైన విద్యార్థులు ఉత్సవాల ఆనందంలో కాలం గడిచిపోవడం గమనించకపోవడం సహజం. కాని రాత్రి పన్నెండు గంటలవరకు, ఒంటిగంటన్నరకు నాటకాలాడి, న్యాయమూర్తుల సహృదయతను శోధించడం న్యాయం కాదు.

వచ్చే సంవత్సరం పోటీల ప్రమాణాలు పెరుగుతాయని, మరింత ఉత్సాహంతో విద్యార్థులు పాల్గొంటారని 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' తరఫున నా విశ్వాసాన్ని ప్రకటిస్తున్నాను. ★

# సినిమా

భారత రష్యాల సంయుక్త నిర్మాణం 'పరదేశీ' చిత్రం విజయాన్ని పురస్కరించుకొని ఉభయదేశాలవారూ ఇదే తరహాలో మరికొన్ని చిత్రాలు నిర్మించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. జరగబోయే కృషికి ఈ విధంగా 'పరదేశీ' చిత్రం దోహదకారి అవుతున్నది.

మాస్ ఫిలింస్టుడియో ఉపాధ్యక్షుడు గ్రాలోవ్ గతవారం బొంబాయిలో ఈ సందర్భమైన సూచన ఒకటి చేశారు. సంయుక్త నిర్మాణానికి మరొకళ్ళను ఆహ్వానించేబదులు తొలచిత్రంలో తమతో పనిచేసిన అబ్బాస్ బృందమే (నయాసన్సార్ ఇంటర్నేషనల్) మళ్ళీ [illegible]స్తే బాగుంటుందనీ, మంచి ఇతి వృత్తం సూచించేపక్షంలో ప్రయత్నాలు ప్రారంభించవచ్చునని అన్నారు. నయాసన్సార్ టెక్నీషియన్లు 'పరదేశీ' నిర్మాణం ఫలితంగా మాస్కో కళాకారులకు, టెక్నీషియన్లకూ సుపరిచితులయ్యారు. అందువల్ల తిరిగి వీరే కలిసి పనిచేస్తే, మరింతగా మంచిఫలితాలు సాధించవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు. పరదేశీ హిందీప్రతి వచ్చే నెల సోవియట్ రష్యాలో విడుదల అవుతుందని తెలియజేశారు.

## బొంబాయి సినిమాలేఖ

"పరదేశీ" దర్శకుడు అబ్బాస్, ఇప్పుడు, బొంబాయిలో ఒకచిత్రం దర్శకత్వం నిర్వహించబోతున్నారు. ఆచిత్రంపేరు "భగవాన్ ఔర్ సైతాన్" అందులో దక్షిణ భారతనటి జమున, ముఖ్యభూమిక నిర్వహిస్తుందని తెలుస్తూంది.

* * *

భారత సంగీత నాటక అకాడమీవారు కూడా సోవియట్ టెక్నీషియన్ల సహకారంతో ఒకటిరెండు చిత్రాలు నిర్మించబోతున్నారు. భారతదేశంలోని వివిధప్రాంతాల నృత్యాలను సమగ్రంగా చిత్రించడం వీరిలక్ష్యం. సంగీత నాటక పరిషత్ ఉపాధ్యక్షురాలు కమలాదేవి, కార్యదర్శిని నిర్మలా జోషీలు, ఈవిషయమై తాము వేసుకొన్న పథకం స్వరూప స్వభావాలను సోవియట్ చలనచిత్ర వ్యవహారాలశాఖ అధిపతి షెడరోవ్‌కు వివరించారు. మొదట కథక్ నృత్యంపై ఒకచిత్రం తీస్తారట. ఆ వెనుక, కథాకళి, మణిపురి, భరతనాట్యాలపై నిర్మించదలచారు. ఇవన్నీ వర్ణచిత్రాలే. "పరదేశీ" చిత్రంలో సోవ్‌కలర్ మనోహరంగా ఉంది. ఆచిత్రం చూచినమీదట, ఆ పద్ధతిలోనే వీటినిచిత్రించాలని పరిషత్

రవీ ఫిలింస్‌వారి 'కొండవీటి దొంగ'లో అంజలీదేవి



ఉపాధ్యక్షురాలు భావిస్తున్నారు.

ఈచిత్రాల నిర్మాణానికి కావలసిన పరికరాలనుఇచ్చి, సాంకేతిక నిపుణులను పంపడానికీ చిత్రానికి మాస్కోలో ప్రతులు తీసి ఇవ్వడానికీ ఫెడరోవ్ అంగీకరించారు.

ఈ విషయమై పరిషత్కార్యదర్శిని నిర్మలా జోషి, సోవెక్స్‌పోర్ట్ ఫిలిం ప్రతినిధి ప్రొనోకోవ్‌తో చర్చలు జరుపుతున్నారు. ఈ చిత్రాల నిర్మాణ వ్యవహారాలను, రాజ్ బంస్ ఖన్నా (గౌతమబుద్ధ దర్శకుడు) నిర్వహిస్తారు.

* * *

డిసెంబరు పూర్వార్థం బొంబాయిలో పుట్టినరోజు పండుగల సీజను. చిన్నా పెద్ద చాలమంది పండుగలు చేసుకున్నారు పెద్దలలో దిలీప్‌కుమార్‌కు ఇలాటివి గిట్టవు అందుకని ఆరోజు మామూలుగానే గడిపివేశాడు

రాజ్‌కపూర్ మటుకు, 14న అతి ఉత్సాహంగా జన్మదినోత్సవం జరుపుకొన్నాడు. అతనిని మీకు తెరమీద ఎంత హుషారుగాకనిపిస్తాడో, జీవితంలోను అంతే

పదో చిత్రాన్ని ప్రస్తుతానికి ప్రొడక్షన్ నెంబర్ టెన్ అని చెప్పుకోవాలి ఈచిత్రం విశేషం: ఛాయాగ్రాహకుడు రాధూ కర్మాకర్ తొలిసారిగా దర్శకత్వం నిర్వహించడం.

పుట్టినరోజు పండుగ రాజ్‌కపూర్ ఇంట్లోనూ, స్టుడియోలోనుకూడా దార్హూమ్మని జరిగింది. స్టుడియోలో, చిన్నా పెద్దా అంతా ఆటలతో పాటలతో చాలా వేడుకలు జరుపుకొన్నారు. ఆటల పోటీలలో గెలిచినవారికి బహుమతులు ఇచ్చారు. సాయంత్రం రాజ్ భార్య కృష్ణ, నలుగురినీ పిలిచి విందుచేసింది ఈ పండుగ పేరు చెప్పి కొత్త సంవత్సరంలో ఆర్. కె. ఫిలింస్ తీయబోయే కొత్తచిత్రాలు రెండు ప్రకటించాడు ఆర్. కె. చిత్రాలలో అవి తొమ్మిది పది అవుతాయి. తొమ్మిదో చిత్రం పేరు 'జాగర్' అభూమిక దర్శకత్వం కూడా అతనే నిర్వహిస్తాడు. సంగీతం శంకర్ జైకిషన్‌లు సమకూర్చుతారు.

* * *

ప్రభుత్వ ఫిలింస్ డివిజన్‌వారు ఢిల్లీలో ప్రయోగాత్మకంగా డాక్యుమెంటరీచిత్రాల ప్రదర్శనం ఆరంభించారు

వ్యాపార చిత్రాలు ఆడేచోట్ల చోటు దొరకదు కాబట్టి, ఫిలింస్ డివిజన్ థియేటర్‌నే ఇందుకు కేటాయించారు. రోజూ రెండాటలుంటాయి ఒకటి ఉదయం 11 గంటలకి, ఇంకొకటి సాయంత్రం 6 గంటలకు. ఒక్కొక ప్రదర్శనం గంటసేపు ఉంటుంది. ఆ గంటలోనూ నాలుగైదు డాక్యుమెంటరీలు వేస్తారు. ప్రవేశరుసుము పావలా. తరగతులు లేవు.



డీలక్స్ ఫిలింస్‌వారి 'లాజ్‌వంతి'లో నర్గీస్, బల్‌రాజ్ సాహ్నీ

దీనికి ప్రజాదరణ లభిస్తే, దేశవ్యాప్తంగా ఇలాటివి నెలకొల్పడానికీ రోజుకు ఇరవైనాలుగు గంటలూ ప్రదర్శనం జరిగే ఏర్పాట్లు చేయడానికీ క్రమంగా ప్రయత్నిస్తామని సమాచారశాఖ కార్యదర్శి శ్రీ రామధ్యాని చెప్పారు.

ఇలాటివి యూరప్ దేశాలలో సమృద్ధిగా ఉన్నాయి. ఏ వేళప్పుడు కావాలన్నా ఈ రకం థియేటర్‌కు వెళ్లి చూడొచ్చు.

మన ఫిలింస్ డివిజన్‌వారు తీసిన డాక్యుమెంటరీలలో కొన్ని ఉత్తమోత్తమం అనతగ్గవి ఉన్నాయి. అందరూ చూడతగినవి, చూడవలసినవీ అనేకం ఉన్నాయి. పెద్ద సినిమాకి వెళ్ళినపుడు పది నిముషాలు చూడడంతప్ప, డాక్యుమెంటరీలు చూడటం ఏమిటని అనేవాళ్ళు చాలమంది ఉన్నారు. కాని, చూడడం మొదలుపెడితే, పోనుపోను వెళ్లి చూచితీరాలి అని అనిపించేరకం మంచి చిత్రాలు పుష్కలంగా తయారవుతాయి. కథా ప్రధానచిత్రాలలకు కాలు కొన్నిటిని, డాక్యుమెంటరీ శిల్పానికి కలిపితీస్తే ఉభయతారకమైనవి రూపొందుతాయి. ఈ ఉద్యమం జయప్రదం అయితే, క్రమంగా వ్యాపారంగాన చిత్రాలస్థాయికూడా మంచి మార్గాన వృద్ధిచెందగలదనిఆశించవచ్చును. ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

# ★ నిర్మాణంలో ఉన్న తెలుగు చిత్రాలు ★

**1958**వ సంవత్సరం ఆరంభమైన నాటికి నిర్మాణంలో ఉన్న తెలుగు చిత్రాలు 45. వీటిలో కొన్ని మాత్రం విడుదలకు సిద్ధమై, తుది మెరుగులు దిద్దుకుంటున్నాయి. కొన్ని మొన్న మొన్ననే మొదలయ్యాయి.

* * *

విజయా వారి 'అప్పుచేసి పప్పుకూడు' ఉగాదికి విడుదల అవుతుంది. అందుకని నిర్మాణం తాపీగా సాగుతోంది. ఎన్. టి. రామారావు, సావిత్రి, రంగారావు, రేలంగి, జగ్గయ్య నటిస్తున్నారు. రచన సదాశివబ్రహ్మం, చక్రపాణి. సంగీతం ఘంటసాల దర్శకుడు ఎల్. వి. ప్రసాద్.

* * *

అన్నపూర్ణావారి కొత్త చిత్రం నిర్మాణం మొన్ననే ఆరంభమైంది. నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు, రేలంగి, రాజసులోచన, సూర్యకాంతం, కొత్తనటుడు రమణమూర్తి, అతని నాయికగా రాధిక నటిస్తున్నారు. రచయిత ఆత్రేయ. సంగీతం వేణు. పాటలు శ్రీ శ్రీ, కొసరాజు, ఆత్రేయ వ్రాశారు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. నిర్మాత డి. మధుసూదనరావు.

* * *

జయంతి పిక్చర్స్ వారుకూడా కె. వి. రెడ్డి దర్శకత్వాన మొన్ననే కొత్త చిత్రం మొదలు పెట్టారు. రచయిత పింగళి నాగేంద్రరావు. నాగేశ్వరరావు, జమున, రేలంగి, పాల్గొంటున్నారు సంగీతం ఘంటసాల.

* * *

పొన్నలూరివారి 'శోభ' కమలాకర కామేశ్వరరావు దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది. త్వరలోనే విడుదల చేస్తారు. ఇందులో రామారావు, అంజలీదేవి, రాజసులోచన, రేలంగి, ముక్కామల, రమణారెడ్డి పాల్గొంటున్నారు. రచయిత డి. వి. నరసరాజు. సంగీతం ఎం. ఎం. రాజా.

నిర్మాత వసంతకుమారరెడ్డి, మూడవ చిత్రం 'దైవబలం'కు స్వయంగా దర్శకత్వం నిర్వహిస్తున్నారు. ఈ చిత్రానికి డిసెంబరు 30 తో పాటల రికార్డింగు పూర్తిచేశారు. సంగీత దర్శకుడు అశ్వత్థామ. రచయిత పరశురాం.

* * *

రిపబ్లిక్ వారి హాస్యప్రధాన చిత్రం 'పెళ్లి సందడి'కి దర్శకుడు డి. యోగానంద్. రచయిత సముద్రాల జూనియర్. నటులు నాగేశ్వరరావు, అంజలీదేవి, బి. సరోజ, గుమ్మడి, రమణారెడ్డి, సి. ఎస్. ఆర్.

* * *

శారదా ప్రొడక్షన్స్ వారి 'జయభేరి'. నటవర్గం నాగేశ్వరరావు, అంజలీదేవి, రేలంగి, నాగయ్య, రమణారెడ్డి, రాజసులోచన. రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి, సంగీతం పెండ్యాల, దర్శకత్వం పి. పుల్లయ్య, నిర్మాత టి. వి. శాస్త్రి, నాలుగు రీళ్ళు తయారైంది.

* * *

రాగిణీవారి 'బండ రాముడు'కు కూడా పి. పుల్లయ్యగారే దర్శకుడు. ఇందులో ఎన్. టి. రామారావు, రాజసులోచన, పాల్గొంటున్నారు.

* * *

పుల్లయ్యగారు స్వయంగా 'శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం' నిర్మిస్తున్నారు. అందులో సావిత్రి, రామారావు నాయికా నాయకులు రచయిత ఆత్రేయ.

* * *

లలితా ఫిలింస్ (వరణాసి) వారి 'లవకుశ'. రామారావు, అంజలీదేవి, నాగయ్య



ప్రసాద్ ప్రొడక్షన్స్‌వారి హిందీచిత్రం 'శారద'లో మీనాకుమారి

ముఖ్యపాత్ర ధారులు. రచయిత సదాశివ బ్రహ్మం. దర్శకుడు సి. పుల్లయ్య.

* * *

వి. ఎ. ఎస్. ప్రొడక్షన్స్‌వారి 'చెంచులక్ష్మి' సగంవరకూ తయారైంది. శ్రీ మహావిష్ణువు నాగేశ్వరరావు, మహాలక్ష్మి అంజలీదేవి. దర్శకుడు బి. ఎ. సుబ్బారావు.

* * *

జలరుహావారి 'రాజనందిని' వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన తయారవుతోంది. నటులు రామారావు, ఆర్. నాగేశ్వరరావు, అంజలీదేవి, జి. వరలక్ష్మి, గిరిజ. రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి. సంగీతం టి. వి. రాజు.

* * *

నందీవారి 'శృంగారసీ' పూర్తి అయినట్లే. దర్శకుడు వై. వి. రావు. నటులు జగ్గయ్య ఎ. వి. సుబ్బారావు, రేవతి, ప్రియదర్శిని.

* * *

[illegible] రెండో చిత్రం 'సౌభాగ్యవతి' తమిళ ప్రతి ఇటీవలే విడుదల అయింది. తెలుగు చిత్రం ఫిబ్రవరిలో రావచ్చు. నటులు రామారావు, రంగారావు, సావిత్రి. దర్శకుడు జంపన చంద్రశేఖరరావు.

* * *

జంపన, ఈ మధ్యనే రాజ్యం పిక్చర్సవారి 'కృష్ణలీల' దర్శకత్వం స్వీకరించారు. యశోద లక్ష్మిరాజ్యం.

* * *

శ్రీ రాజరాజేశ్వరీవారి 'కృష్ణమాయ'లో నాగేశ్వరరావు నారదుడుగా కనబడబోతున్నాడు. హుషారైన రూప కల్పన, అందుకుతగ్గ నటన ఈ పాత్రను మనోహరంగా తయారు చేశాయని రషెస్ చూచినవారు చెబుతున్నారు. ఇందులో జమున నాయిక. రచన రావూరి, దర్శకుడు సి. ఎస్. రావు.

రాజ రాజేశ్వరీవారి మరో చిత్రం 'అన్నా—తమ్ముడు' పూర్తి అయింది. రామారావు, కె. మాలతి, జగ్గయ్య పాల్గొన్నారు. దర్శకుడు సి. ఎస్. రావు.

* * *

నాగేశ్వరరావు నారదుడుపాత్ర ధరించిన మరో చిత్రం ఎ. వి. ఎం. వారి 'భూకైలాస్'. ఇందులో ఎన్. టి. రామారావుకూడా ఉన్నారు. ఆయన మహిరావణ భూమిక నిర్వహిస్తున్నారు. జమున, బి. సరోజకూడా పాల్గొంటున్నారు. ఈ చిత్రం దర్శకుడు శంకర్.

విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి 'గంగాగౌరీ సంవాదం' బి. ఎన్. రెడ్డి దర్శకత్వాన తయారవుతోంది. ఇందులో శివుడి పెళ్ళి సందర్భంలో వేడుకలకు తొమ్మిది నిముషాల

# 1957 లో తెలుగు చిత్రాలు 33

| చిత్రం పేరు. | | దర్శకుడు. |
|---|---|---|
| తోడికోడళ్లు | ... | ఆదుర్తి సుబ్బారావు |
| *పరాశక్తి | ... | కృష్ణన్ పంజు |
| సతీ సావిత్రి | ... | కె. బి. నాగభూషణం |
| *రాణి రంగమ్మ | ... | టి. ఆర్. సుందరం |
| స్వయంప్రభ | ... | శోభనాద్రిరావు |
| రేపు నీదే | ... | భాస్కరరావు |
| భాగ్యరేఖ | ... | బి. ఎన్. రెడ్డి |
| నలదమయంతి | ... | కెంపరాజ్ |
| *టౌన్ బస్ | ... | జగన్నాథ్ |
| *వేగుచుక్క | ... | రఘునాథ్ |
| మాయాబజార్ | ... | కె. వి. రెడ్డి |
| దాంపత్యం | ... | చిత్రా అప్పారావు |
| పెద్దరికాలు | ... | తాపీ చాణక్య |
| అల్లావుద్దీన్ | ... | రఘునాథ్ |
| సువర్ణసుందరి | ... | వేదాంతం రాఘవయ్య |
| వీరకంకణం | ... | జి. హెచ్. రావు |
| బలేబావ | ... | ఎస్. రజనీకాంత్ |
| సంకల్పం | ... | రంగనాథదాస్ |
| వరుడు కావాలి | ... | బి. ఎస్. రామకృష్ణరావు |
| దొంగల్లో దొర | ... | పి. చెంగయ్య |
| అక్కాచెల్లెళ్ళు | ... | పార్వతీబాయి & అమానుల్లా |
| వినాయకచవితి | ... | సముద్రాల రాఘవాచార్య |
| భలే అమ్మాయిలు | ... | వేదాంతం రాఘవయ్య |
| ఎం. ఎల్. ఎ. | ... | కె. బి. తిలక్ |
| సతీ అనసూయ | ... | కె. బి. నాగభూషణం |
| సారంగధర | ... | శ్రీనివాసరాఘవన్ |
| కుటుంబ గౌరవం | ... | బి. ఎస్. రంగా |
| వద్దంటే పెళ్ళి | ... | విఠలాచార్య |
| *రత్నగిరి రహస్యం | ... | బి. ఆర్. పంతులు |
| ప్రేమే దైవం | ... | ఆర్. నాగేంద్రరావు |
| *తలవంచని వీరుడు | ... | పి. పుల్లయ్య |
| పాండురంగ మాహాత్మ్యం | ... | కమలాకర కామేశ్వరరావు |
| *ఎవరి అబ్బాయి | ... | రఘునాథ్ |

* గుర్తుపెట్టినవి డబ్ చేసిన తమిళ చిత్రాలు

పాటకట్టి, హుషారుగా చిత్రించారు. సంగీత దర్శకుడు పెండ్యాల దీనికి 40 వాద్యాలూ, 20 గాత్రాలూ సమకూర్చి ప్రమథ గణాల సంరంభాన్ని ఆ పాటలో స్ఫురింపచేశారు. ఈ చిత్రంలో రమణారెడ్డి కొత్త తరహా పాత్రను నిర్వహిస్తున్నాడు. జానకి, కృష్ణకుమారి, ఋష్యేంద్రమణి, నాగయ్య, నారాయణరావు మొదలగువారు పాల్గొంటున్నారు. రచయిత పరశురాం.

* * *

వి. ఎన్. ఫిలింస్ వారి 'భక్త రామదాసు' నిర్మాణం తాపీగా సాగుతోంది. నాగయ్య, లింగమూర్తి, జంధ్యాల గౌరీనాథశాస్త్రి, ఎ. వి. సుబ్బారావు, వసల సూర్యచంద్రరావు, రామశర్మ, కన్నాంబ, సూర్యకుమారి, ఋష్యేంద్రమణి మొదలగు వారంతా పాల్గొంటున్నారు. రచన యడవల్లి. సంగీతం, దర్శకత్వం వి. నాగయ్య. కబీర్ భజన పాటలు మటుకు అశ్వత్థామ కూర్చారు. వాటిని మహమద్ రఫీచే పాడించారన్న విషయం తెలిసినదే.

* * *

పెల్వకోటీవారి 'రత్న కిరీటం'లో జెమినీ గణేశన్, సావిత్రి, కన్నాంబ, నాగయ్య, ఆర్. నాగేశ్వరరావు నటిస్తున్నారు. రచయిత రావూరి. సంగీతం రమేష్ నాయుడు. దర్శకత్వం డి. యోగానంద్. నిర్మాతలు పెల్వరాజ్, కోటేశ్వరరావు.



సారథీస్టూడియోస్‌వారి 'ఎత్తుకుపైఎత్తు'లో గుమ్మడి, పెరుమాళ్లు, జానకి, నాగయ్య, బాలయ్య, నరసింహారావు

# నిర్మాణంలోవున్న తెలుగు చిత్రాలు

వాహినీ వారు 'రాజ మకుటం' అనే చిత్రం నిర్మిస్తున్నారు. రామారావు, రాజసులోచన, గుమ్మడి, పద్మనాభం, రాజనాల నటిస్తున్నారు. రచయిత డి. నరసరాజు. దర్శకుడు బి. ఎన్. రెడ్డి. సంగీతం వేణు.

* * *

సంగీతావారి 'ఇంటిగుట్టు' వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన తయారవుతోంది. నటులు రామారావు, సావిత్రి, ఆర్. నాగేశ్వరరావు, గుమ్మడి, సూర్యకాంతం. సంగీతం ఎం. ఎస్. ప్రకాష్.

* * *

ఆర్. ఆర్. ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రం 'కార్తవరాయుని కథ'లో రామారావు, ముక్కామల, బాలకృష్ణ, పద్మనాభం, బి. ఎస్. సరోజ, గిరిజ మొదలగువారున్నారు. రచయిత ముద్దిపట్ల సూరి. దర్శకుడు రామన్న. సంయుక్త దర్శకుడు బి. ఎస్. మూర్తి.

* * *

ప్రతిభ ప్రొడక్షన్స్ వారి 'ఆడపెత్తనం' దాదాపు పూర్తి అయినట్టే. ఇందులో నాగేశ్వరరావు, అంజలీదేవి ముఖ్య నటులు. రేలంగి, రమణారెడ్డి, గుమ్మడి, అమ్మాజీ, సూర్యకాంతం పాల్గొంటున్నారు. రచన పినిశెట్టి. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. నిర్మాత కెవర్తి.

* * *

పూర్తి కావచ్చిన మరో చిత్రం ప్రతిభావారి 'దొంగలున్నారు జాగ్రత్త'. దీనికి బి. ఎస్. ఆర్. దర్శకత్వం నిర్వహించారు. నటులు జగ్గయ్య, జి. వరలక్ష్మి, గిరిజ, బి. ఎస్. ఆర్, శివరావు, రచన ఆత్రేయ, నిర్మాత ఘంటసాల కృష్ణమూర్తి.

* * *

వెంకటరమణా ప్రొడక్షన్స్ వారి జానపదం 'బాలనాగమ్మ' వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన రూపొందుతోంది. రామారావు, రంగారావు, రేలంగి ముఖ్య పాత్రలు నిర్వహిస్తారు. రచన, సముద్రాల జూనియర్, సంగీతం టి. వి. రాజు.

* * *

శేషాఫిలింస్‌వారి '[illegible]'కి కె. ఎస్. ప్రకాశరావు దర్శకుడు. రచయిత అనిసెట్టి సుబ్బారావు, సంగీత దర్శకుడు రమేష్ నాయుడు. నటులు జగ్గయ్య, చలం, కృష్ణకుమారి, రమణారెడ్డి సూర్యకళ, చదలవాడ.

* * *

సారథీస్టుడియోస్‌వారి సాంఘికం 'ఎత్తుకు పైఎత్తు' మొన్న సెన్సార్ అయింది. జనవరి 10న సంక్రాంతి కానుకగా విడుదల చేస్తున్నారు. కొత్తనటుడు బాలయ్య, జానకి, రేలంగి, గుమ్మడి, నాగయ్య, పెరుమాళ్లు, బి. ఎస్. ఆర్. నరసింహారావు నటించారు. రచయిత వార్ల, చిరంజీవి సంగీతం వేణు, దర్శకుడు తాపీ చాణుక్య.

* * *

విశ్వరూపావారి తొలి చిత్రానికి కోటనాద్రి (స్వయంప్రభ) రావు దర్శకుడు. రచయితలు పినిసెట్టి, వడ్డాది సంగీతం రమేష్, నిర్మాత శేషగిరిరావు.

కోటనాద్రిరావు దర్శకత్వాన తయారవు

మరో చిత్రం పద్మశ్రీ వారి [illegible]. దీనికి రచయిత రాజుచంద్. (పద్దం పెళ్లి)

* * *

రచయిత డి. వి. నరసరాజు, నరసూ కూడి యూనిట్ కొత్త చిత్రానికి స్క్రిప్టు పూర్తిగా వ్రాసి ఇచ్చారు. నిర్మాణ కార్యక్రమం మొన్ననే ఆరంభం అయింది. ఇది 'మ్యాన్ ధీర్' అనే చిత్రానికి మూలంగా అనుకరణ.

* * *

అనుపమవారి కొత్త చిత్రం కూడా స్క్రిప్టు ఘట్టంలో ఉంది. హాస్యరస ప్రధానమైన ఈ ఇతి వృత్తానికి మాటలూ పాటలూ పినిశెట్టి, వ్రాస్తున్నారు.

మరోకవంక, దర్శకుడు తిలక్, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి' నవలను వెండితెర కెక్కించడానికి ఛాయ సన్నాహాలు చేస్తున్నారు.

* * *

సుధాకర్ ఫిలింస్‌వారి తొలిచిత్రం డి. యోగానంద్ దర్శకత్వన తయారవుతోంది. రచయిత ఆత్రేయ. నటులు రామారావు, జమున, రేలంగి, గుమ్మడి.

* * *

రోహిణీవారి 'గజదొంగ' మూడువంతులు పూర్తికావచ్చింది. రామారావు, సావిత్రి, గుమ్మడి, ఆర్. నాగేశ్వరరావు, సంధ్య నటిస్తున్నారు. రచయిత ఆరుద్ర. సంగీతం చలపతిరావు. దర్శకుడు వై. ఆర్. స్వామి.

* * *

కాశీనాథ్ ప్రొడక్షన్స్‌వారి 'రామాంజనేయ యుద్ధం'లో శ్రీరంజని, అమర్‌నాథ్, సూర్యనారాయణ, బంధ్యాల గౌరీనాథ శాస్త్రి, ముక్కామల, తీగల వెంకటేశ్వర్లు (శ్రీవత్స) టి. వి. ఎస్. శర్మ ఉన్నారు. దర్శకుడు ఎస్. ఎస్. ఆచార్య. సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు.

* * *

వి. వి. వి. ఎస్. ఎం. ప్రొడక్షన్స్‌వారు 'భట్టి విక్రమార్క' నిర్మిస్తున్నారు. అంజలీదేవి, రామారావు, రంగారావు, గుమ్మడి, రేలంగి, పాల్గొన్నారు.

* * *

భారతీ ప్రొడక్షన్స్ వారు సముద్రాల రాఘవాచార్య దర్శకత్వన 'బభ్రువాహన' చిత్రం నిర్మిస్తున్నారు. అంజలీదేవి, రాజసులోచన, రామారావు, వి. ఎస్. ఆర్, ముక్కామల, పేకేటి నటిస్తున్నారు. సంగీతం పామర్తి, పర్యవేక్షణ ఘంటసాల. నిర్మాతలు ఎ. వి. రమణమూర్తి, ఆదని సత్యనారాయణ.

* * *

అశోకావారి 'భూలోక రంభ' లో అంజలీదేవి, రామారావు నాయికా నాయకులు; చలం, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు కూడా పాల్గొంటున్నారు. రచన సముద్రాల జూనియర్. దర్శకుడు బాలచందర్.



'చందన్‌హార్'లో రూప్‌మాల

* * *

కల్యాణీ ప్రొడక్షన్స్‌వారి తొలిచిత్రానికి తిలక్ దర్శకుడు. రంగారావు, కన్నాంబ, జగ్గయ్య, రేలంగి, నరసింహారావు, రమణారెడ్డి మొదలగువారు నటిస్తారు. రచన కాకి ధర్మారావు, మదిపట్ల సూరి. సంగీతం చలపతిరావు.

* * *

వైశక్తి చిత్ర (మద్రాసు) వారు 'నాగులపాలంటే' అనే చిత్రం నిర్మిస్తున్నారు. నిర్మాత, దర్శకుడు లక్ష్మీకుమార్.

* * *

నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారు అల్లూరి సీతారామరాజు. సీతారామరాజు జీవితం చిత్రా



జలరుహావారి 'రాజనందిని'లో రామారావు, అంజలీదేవి

ఖలో ఏ ఒకటిగాని ఆరంభించేలోగా, చిన్న ఎత్తున ఒక చిత్రం నిర్మించాలని ఆలోచిస్తున్నారు.

* * *

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారు 'పార్వతీ పరిణయం' అనే చిత్రం నిర్మిస్తున్నారు. దర్శకుడు భాస్కరరావు.

* * *

పూర్ణా పిక్చర్స్‌వారు 'సంపూర్ణ మహాభారతం' నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నారు. రచయిత సముద్రాల రాఘవాచార్య.

* * *

శ్రీ కృష్ణచిత్ర అనే కొత్త సంస్థ తొలి చిత్రం "మంచి రోజులు"లో కొత్త నటులకు అవకాశం ఇవ్వాలని దర్శక నిర్మాత, కథా రచయిత పద్మనాభరావు సంకల్పించారు. ఈయన, 'అక్క చెల్లెళ్లు' చిత్రానికి కథ వ్రాశారు. కళ్యాణి పిక్చర్స్‌లో భాగస్వామికూడా. ఇప్పుడు స్వయంగా నిర్మాణానికీ, తొలిసారిగా దర్శకత్వానికీ కూడా పూనుకొన్నారు. ఈ చిత్రంలో నాయక భూమికను, 'ఎం. ఎల్ ఎ.'లో తిలక్ పరిచయం చేసిన రమణమూర్తికి ఇచ్చారు. నాయిక, 'సంకల్పం'లో నటించిన కుసుమకుమారి

మరి కొందరు కొత్తవాళ్ళనుకూడా తీసుకోవాలని నిర్మాత సంకల్పం. ఈ చిత్రంలో పాల్గొనే ఇతర నటులు సి. ఎస్. ఆర్, రమణారెడ్డి కుటుంబరావు, నాగభూషణం, రంగర. నటి సూర్యకాంతం ఒక ప్రముఖ భూమిక నిర్వహిస్తుంది

మాటలూ పాటలూ శ్రీ శ్రీ ఆరుద్ర వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు ఇప్పటికి మూడు పాటలు రికార్డు చేశారు. ఘంటసాల, సుశీల ఆ పాటలు పాడారు.

ఛాయాగ్రహణ దర్శకుడు మస్తాన్, కెమెరా చిదానంద్, నృత్యదర్శకుడు వేణుగోపాల్. వీరంతా 'అక్క చెల్లెళ్లు' చిత్రంలో పని చేసినవాళ్లే.

* * *

రవి ఫిలింస్ వారి 'కాంచన్‌ఘర్' వారం పదిరోజుల్లో విడుదల అవుతుంది. రంజన్, అంజలీదేవి నటించారు. రచన అనిసెట్టి.

* * *

దేవరాజ్ ప్రొడక్షన్స్ అనే కొత్త సంస్థ తెలుగు తమిళ భాషల్లో ఒకచిత్రం నిర్మించబోతున్నది.

ఇదికాక, దర్శక నిర్మాత శాంతారాం 'నవరంగ్' అనే హిందీ చిత్రాన్ని అదే కథతో ఒక తెలుగు చిత్రాన్ని నిర్మిస్తున్నారు. దానికి కొసరాజు రాఘవయ్య చౌదరి పాటలు వ్రాస్తున్నారు. నటులింకా నిర్ణయం కాలేదు.

బొంబాయిలో 'ఫాక్స్ టెయిల్ ఫిలింస్ వారు 'స్నేహితులు' చిత్రం నిర్మిస్తున్నారు. రచన మునిపల్లె రాజు. దర్శకుడు సత్యవంత రావు

విజయలక్ష్మి ఫిలింస్(బొంబాయి) వారు 'జీవసాథీ' అనే హిందీ చిత్రాన్ని తెలుగులోకి డబ్ చేస్తున్నారు ★



చైతన్య చిత్రంవారి 'బాగుపడాలంటే' చిత్రానికి డిసెంబరు 1న వాహినీలో ఒకపాట రికార్డింగ్ జరిగింది దర్శకనిర్మాత లక్ష్మీకుమార్, బి. ఎన్ రెడ్డి, డి వి. నరసరాజు, అశ్వత్థామ, మాధవపెద్ది సత్యం ఈ చిత్రంలో ఉన్నారు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras. Editor K. Sambhu Prasad



**లంబాడి పడతి**

—ఫొటో: యు. భానుమూర్తి, అనంతపురం]

Rged. No. M.44 79. Andhra Patrika Illustrated Weekly

స్వార్థపరులు వేసే ఎత్తులకు పై ఎత్తులు వేసి గ్రామాభ్యుదయాన్ని
ప్రజలు ఎట్లా సాధించారో.........త్వరలో చూడండి

